*Issued*— 4-1-1957




# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

## TUESDAY, the 13th MARCH, 1956

**VOLUME IV—No. 2**

*CONTENTS*



PRINTED BY SREE PANDURANGA PRESS, ELURU
FOR THE SUPERINTENDENT
ANDHRA GOVERNMENT PRESS
KURNOOL
1956

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

**Tuesday, the 13th March, 1956.**



The House met in the Assembly Hall, Kurnool, at half past eight of the clock, Mr Speaker (The Hon. Sri R Lakshminarasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS.

## SHORT NOTICE STARRED QUESTION

*An interim report of the Sales Tax Committee*

502-A

S N. Q. No 1224-C. Q. — Sri V KODANDARAMA REDDI . Will the Hon the Chief Minister be pleased to state .

(a) whether an interim report of the Sales Tax Committee has been submitted to the Government , and

(b) if so, whether the Government will state what the recommendations of the Committee are ?

The Hon Dr B. GOPALA REDDI —

(a) Yes, Sir,

(b) The interim report submitted by the Committee is under the consideration of the Government The recommendations made by the Committee are treated as confidential at this stage.

## STARRED QUESTIONS

*'Tacograph' instrument in buses and lorries.*

405 —

* 448 Q. - Sri V. VISWESWARA RAO — Will the Hon the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

(a) whether the Government are aware of a resolution passed by the Andhra Motor Transport Workers Federation urging upon the Government to arrange for the installation in each Bus and Lorry, a 'Tacograph' instrument in order to regulate the speed of the buses and lorries , and

(b) if so, the action taken thereon ?

The Hon. Sri D SANJIVAYYA :—

(a) The answer is in the affirmative.

(b) The Andhra Motor Transport Workers Federation was informed that it is a matter purely for the concerned management and that the workers may impress upon their managements the need for Tacometers.

Sri V. VISWESWARA RAO — అధ్యక్షా ! గోస్తనీగాద బస్సులు, లారీలు ఎక్కువ speed లో వెళ్ళుచుండుటవలన చాలా accidents జరుగుచున్నవి. బెజవాడలాంటి పెద్ద పట్టణములలో రోజుకు రెండు, మూడు accidents జరుగుతున్నాయి. 'Tacograph' ని ప్రతి లారీలోను, బస్సులోనూ, పెట్టి speed ను control చేసినట్లయితే యీ ప్రమాదాలను అరికట్టడానికి అవకాశముంది. కనుక యీ Bus operators కి permission యిచ్చునప్పుడే 'Tacograph' ని introduce చేయాలని ఒత్తిడి చేస్తారా ?

The Hon Sri D SANJIVAYYA.— ఈ representation workers కి సంబంధించినది Workers లో drivers కూడా వుంటారు. ఆ drivers speed ని control చేసి నడిపితే యిటువంటి ప్రమాదాలేవీ జరుగవు.

Sri N SRINIVASA RAO — అధ్యక్షా ! గౌరవనీయులైన మంత్రిగారికే West Godavari లో తాము పర్యటన చేసేటప్పుడు యిటువంటి ఉదంతాలను చూశారు. కనుక ప్రభుత్వబాధ్యతైన చర్య తీసుకొని వెంటనే speed ని control చేయడానికి ప్రయత్నిస్తారా ?

The Hon. Sri D. SANJIVAYYA :— Operaters లో చాలా చిన్నచిన్న operators వున్నారు. Busses విషయం చూసుకుంటే దాదాపు 800 మంది operaters వుంటే సుమారు 400 మంది ఒక్క bus operaters వున్నారు. ఈ Tacograph Machine ప్రతి బస్సులోనూ పెట్టాలంటే వాళ్ళకు కష్టంగా వుంటుంది. అందుచేత దీనిని enforce చేయడానికి మాకు యిష్టంలేదు. వాళ్ళు పెట్టుకోడానికి అంగీకరిస్తే మాకేమీ అభ్యంతరంలేదు.

Sri PILLALAMARRI VENKATESWARLU :— అధ్యక్షా ! మంత్రిగారు సమాధానం చెపుతూ speed ని control చేసేది drivers. దీని responsibilities drivers మీదే వుంటాయన్నారు. కాని యీ మధ్య లారీలు బాడుగకు తిరిగేటప్పుడు ఎక్కువ trips తిరగాలని, ఎక్కువ వేగంగా పోనివ్వాలని యజమానులు insist చేయడంవల్ల drivers ఎక్కువ speed తో పోవలసి వస్తోంది. అందువల్ల speed ని control చేసే instrument వుంది కనుక యీ instrument పెట్టాలని బస్సు, లారీ యజమానులను ప్రభుత్వం insist చేస్తుందా ?

The Hon. Sri D. SANJIVAYYA:— ఇది చాలా costly machine. అందుచేత మేము insist చేయాలనుకోవడంలేదు. Operators అంగీకరిస్తే మాకు ఎటువంటి అభ్యంతరమూలేదు.

13th March 1956]

Sri VAVILALA GOPALAKRISHNAYYA — దాని cost ఎంత ?

The Hon Sri D. SANJIVAYYA — I have no idea, Sir.

Sri VAVILALA GOPALAKRISHNAYYA .— అధ్యక్షా ! యజమానులే యీ "Tacograph" ను పెట్టుకోవాలి అంతేకాని మేము insist చేయమని మంత్రిగారు చెప్తున్నారు. అయితే యజమానులు లారీలను 10 గంటలలో 120 మైళ్ళు, యింకా ఎక్కువగాను నడపాలని drivers ని insist చేస్తున్నారు ఇటువంటి లారీలకు license యిస్తున్నారు. అందువల్ల ప్రమాదాలు సంభవిస్తున్నాయి. ఈ యంత్రాన్ని పెట్టినప్పుడు అటువంటి ప్రమాదాలను అరికట్టడానికి సావకాశంవుంది ఆయంత్రం పెట్టడానికి costly machine, మేము insist చేయము అని మంత్రిగారు చెప్తున్నారు. అందుచేత దానికి ప్రత్యామ్నాయంగా ప్రభుత్వం ఏదైనా చర్యతీసుకుంటుందా?

The Hon Sri D. SANJIVAYYA —లారీలను ఎక్కువ trips త్రిప్పమని యాజమానులు డ్రైవర్సును insist చేస్తున్నారని చెప్తున్నారు. దానికి labour చట్టం వుంది. ఒక కమిటీని appoint చేసినారు. Labour శాఖ మంత్రిగారిని అడిగితే వారుకూడా దీనికికావలసిన సౌకర్యాలు యేర్పాటుచేస్తారు.

*Conducting the Business of the State in Telugu.*

503—

* 566 Q.- Sri VAVILALA GOPALAKRISHNAYYA : Will the Hon. the Chief Minister be pleased to state —

the action taken by the Government in implementing the resolution passed by the Andhra Legislative Assembly regarding the conducting of the business of the State in Telugu ?

The Hon Dr. B GOPALA REDDI —

The Government are examining the practical steps for implementing the resolution such as the nature of action necessary for the change over in respect of staff and equipment.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— ఏ Department లో నైనా immediate గా ప్రారంభించే అవకాశం వుందా ?

The Hon Dr B GOPALA REDDI .— కొంతకాలంక్రింద East Godavari District లో ప్రారంభించాముకదా !

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— State level లో ఏ ఒక్క Department లో నైనా ప్రారంభించే అవకాశంవుందా ?

The Hon Dr B. GOPALA REDDI — Women Welfare Society లో యేర్పాటు చేయడానికి అవకాశం వుందేమో చూస్తాను.

Sri PILLALAMARRI VENKATESWARLU — అధ్యక్షా ! ఒక department లో examine చేస్తుందని చెప్పారు. Resolution pass చేసి

[13th March 1956

5, 6 నెలలు అవుతోంది ఇంకా ఎంతకాలం examine చేస్తుంది ? కనీసం మన అసెంబ్లీలో నైనా మంత్రులు సమాధానాలు తెలుగులో చెప్పడానికి ఏమి ఆటంకాలున్నాయి ?

The Hon. Dr B GOPALA REDDI :— ఇంతకుముందు తెలుగులో జరపడానికి వున్న యిబ్బందులను గురించి నేను చెప్పివున్నాను. Stenographers, Typsists ముఖ్యంగా వారు చాలా తక్కువగా వున్నారు. ఈ వారంలో నేను కాకినాడ వెడుతున్నాను. అక్కడ ఏలా పని చేస్తోందో దర్యాప్తు చేసి వస్తాను.

Sri B. SANKARAIAH — Bills, Resolutions మొదలగునవి వచ్చినపుడు మేము సవరణలు పెట్టడానికి వీలులేకుండా వుంది. అటువంటివి తెలుగులో కూడా ఒక కాపీ తయారుచేయడానికి ప్రయత్నిస్తారా ?

The Hon. Dr. B GOPALA REDDI .— మనం తయారుచేసినా కూడా Constitution of India మాదిరిగా వుంటుంది.

Sri M NAGI REDDI :— గత సంవత్సరంనుంచి కూడా తెలుగులో ప్రవేశపెట్టడానికి ప్రయత్నిస్తామని మంత్రివర్గంవారు చెపుతూ వున్నారు. గత సంవత్సరము నుంచి యీ సంవత్సరానికి ఎంత improvement జరిగిందో సెలవిస్తారా ?

The Hon Dr. B GOPALA REDDI :— Budget speech తెలుగులో చదివినాము.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— పంచవర్ష ప్రణాళికలో దీనికి ఏమయినా స్థానముందా ?

The Hon. Dr. B. GOPALA REDDI :— B. G. Kher గారి Commission నివేదిక వచ్చినతరువాత యివన్నీ మనం తీరికగా ఆలోచించుకుందాము.

Sri V. VISWESWARA RAO :— అధ్యక్షా ! దీంట్లో చాలా సాధక బాధకాలున్నాయనీ, పరిశీలించాలనీ మంత్రిగారు చెప్తున్నారు. దీనిని పరిశీలించడానికి ఒక committee ని వేస్తారా ?

The Hon Dr. B. GOPALA REDDI:-తెలుగులో Stenographers, Typists చాలా తక్కువమంది వున్నారని పత్రికలలో చూచాను. ఇటువంటి సాధక బాధకాలు వున్నాయి.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:–Women welfare Department లో ప్రయత్నిస్తామని చెప్పారు. ఆ Department లో కాకుండా యీ Revenue Department లో నైనా ప్రారంభించడానికి ప్రయత్నం చేస్తారా ?

The Hon. Dr. B. GOPALA REDDI: - మీరు ఏదో ఒక Department లో ప్రారంభించమని చెప్పారు. Women welfare Department చాలా చిన్నది. అందులో కొద్దిమంది clerks వున్నారు. అందుచేత ఆ Department లో ప్రారంభించి వాళ్ళను రక్షను చేస్తాము దాంతో ఏర్పడాలి.

13th March 1956]

Sri P. GUNNAYYA :— అధ్యక్షా! ముఖ్యమంత్రిగారు హామీ ప్రకారంగా యీ సంవత్సరం బడ్జెట్ speech తెలుగులో చదివారు. రేపు విశాలాంధ్ర వస్తుంది. హైద్రాబాద్‌లోకూడ budget speech తెలుగులోచదవడానికి మంత్రిగారు అమోదిస్తారా ?

Mr. SPEAKER :— Hyderabad సంగతి యిప్పుడు ఏమిచెప్పగలము ?

Sri M. NAGI REDDI : అధ్యక్షా! ఈసంవత్సరంలో Budget Speech తెలుగులో చదివినాము అంటున్నారు. ఈ ప్రకారంగా లెఖ్ఖవేస్తే మొత్తమంతా తెలుగులోకి రావడానికి ఎన్ని సంవత్సరాలుపడుతుంది ?

The Hon. Dr B. GOPALAREDDI : రేపు Education Demand మీద చేసే ఉపన్యాసంకూడా తెలుగులో చేయబోతున్నాము. ఈ మాదిరిగాచూస్తే 36 సంవత్సరములు పట్టవచ్చు.

*Regional language as medium of instruction at College and University level.*

504 —

* 1041 Q — SRI P BAPAIAH - Will the Hon the Chief Minister be pleased to state :

(a) whether the Government propose to introduce the regional language as medium of instruction even at College and University level, and

(b) if so, when ?

The Hon Dr B GOPALA REDDI :—

(a) The answer is in the negative.

(b) Does not arise.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ఎందువల్లనండి ?

The Hon Dr B. GOPALA REDDI — అవి university statutory Bodies గా వున్నాయి. అదంతాకూడా వారు ఆలోచించి నిర్ణయించవలసిన విషయం.

Sri PILLALAMARRI VENKATESWARLU .- Universities కి మన policy ఏమిటో తెలియజేసే అవకాశం లేదా ?

The Hon. Dr B. GOPALA REDDI :— Policy ని dictate చేసే అవకాశం లేదు. ఏదైనా వాళ్ళతో సంప్రతించవచ్చును. వారికి సలహా నివ్వవచ్చును. వాళ్ళు అంగీకరిస్తే అంగీకరించవచ్చును, అంగీకరింపకపోవచ్చును. మన Education policy వాళ్ళకు చెపుదామంటే మన Ministry change అయినప్పుడల్లా education policy అంటూ తీసుకొనిపోయి Vice Chancellor మీద syndicate మీదపెట్టడం న్యాయంకాదనే ఉద్దేశ్యంతోనే ఆ అధికారం universities కి ఇచ్చారు.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— Ministry మారినప్పటికల్లా పోయిన వాళ్ళు కూడా policy, change చేసుకోమని కాదు. ప్రధానంగా మనము యీ రోజున మన వ్యవహారాలన్నీ తెలుగులో జరుపుకొంటున్నాము కనుక మన students కి, college course లో కూడా తెలుగులోనే medium of instruction వుండాలనే మన అభిప్రాయంగా ఎందుకు తెలియచేయకూడదు ?

The Hon Dr B. GOPALA REDDI — మనం తెలియచేయవచ్చును. వాళ్ళు అంగీకరించకపోవచ్చును అటువంటప్పుడు ఏమి లాభం ? మనం సలహాయిస్తే వాళ్ళు అంగీకరించటల్లాయితే నే మనం సలహా చెప్పాలి ? వాళ్ళంతా కూడా ఆలోచిస్తున్నారు. వాళ్ళంతా తెలియనివాళ్ళు కారు. చాలా తెలిసిన పెద్దలు యూనివర్శిటీలలో వున్నారు.

Sri V VISWESWARA RAO :— అధ్యక్షా ! ఇది మాదట అయినా సరే, Syndicate లో గాని, Senate లో గాని ఈ విషయము discuss చేసి, వారి అభిప్రాయము కూడ మంత్రిగారు తెలుసుకొంటారా ?

The Hon Dr. B GOPALA REDDI.— నాకు తెలిసినంతవరకు — స్వర్గాభిరామారావుగారికి కూడా తెలుసును — ఈ విషయము అప్పుడప్పుడు Senate లో వస్తూవుంటుంది. అప్పుడు దీన్ని గురించి కొంత చర్చ జరగడం జరిగిన తరువాత దానిని withdraw చేసుకోవడమో లేక reject చేయడమో జరుగుతూ ఉంటుంది.

*Dress regulations to the High School teachers*

505 —

* 588-Q.—Sri PILLALAMARRI VENKATESWARLU :— Will the Hon the Chief Minister be pleased to state :

(a) whether any dress regulation was prescribed to the High School teachers by the Director of Education, Andhra, and

(b) if so, what is the prescribed dress ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

(a) The answer is in the affirmative.

(b) A Jubba (long sleeves), Dhoti and an Upper cloth or a closed coat and dhoti or trousers.

Sri M NAGI REDDI:—యీ dress కూడ ఖద్దరే కట్టాలని చెప్పారా లేక మరేదైనా కట్టవచ్చు అన్నారా ?

The Hon Dr. B. GOPALA REDDI:— నాకు సంపూర్ణ అధికారము ఉన్నట్లయితే ఖద్దరే కట్టండని చెప్పేవాణ్ణి. కాని ఆ మాదిరి ఉత్తరువులు జారీచేయలేదు. Decent dress వేసుకోవాలి అన్నాము. ఎందుకంటే, నేను కొన్ని schools కు పోయినప్పుడు ఆ teachers వారి ఇష్టం వచ్చినట్లు ఏరీతిగా అంటే ఆ రీతిగా గుడ్డలు వేసుకోవడం, అంటే ఒకరు bushcoat వేసుకోవడం, మరొకరు చొక్కా trousers లోకి పెట్టుకోవడం, ఇంకొకరు half sleeves చొక్కా వేసుకోవడం, ఇంకొకరను

sleeves 'చొక్కా వేసుకోవడం ఈ విధంగా అనేక రకాలుగా వేసుకోవడం చూచాను. Teachers ఆమాదిరిగా ఉంటే students కు కూడ అంత బాగుండదు. ఒక dicipline ఉండాలనే ఉద్దేశంతో decent dress వేసుకోవాలని చెప్పాను. అంతే మీరు ధోవతి కట్టుకొన్నా పరవాలేదు. కాని అది సంపూర్ణమైనటువంటి dress గా ఉండవలెనని చెప్పాము.

Sri N SRINIVASA RAO —అధ్యక్షా, ఖద్దరే కట్టాలని difinite గా instructions ఇవ్వకపోయినా, బొంబాయి ఎరుపు గుడ్డలు, తరువాత పార్టీ చిహ్నాలు, badges, ఇటువంటివి కట్టుకో కూడదన్నా instructions పంపుతారా ?

The Hon Dr B. GOPALA REDDI .— తప్పకుండా, అవసరమైతే ఈ మాదిరిగా party చిహ్నాలు, స్కూలుకు పొయ్యేటప్పుడు వేసుకోకూడదని, ఇది decent dress క్రిందకు రాదనేమాట చెప్పుతాము.

Sri P GUNNAYYA — అధ్యక్షా, ఉపాధ్యాయులు మంచి బట్టలు వేసుకోవలసిందని మంత్రిగారు సెలవిస్తున్నారు. కాని వాళ్ళకు జీతాలు ఇప్పటికే చాలవు. కనుక వాళ్ళ జీతాలు హెచ్చుచేయడానికి ప్రభుత్వము పూనుకొంటే తప్ప కుండా వారు మంచి గుడ్డలు వేసుకోడానికి వీలుంటుంది

The Hon Dr B GOPALA REDDI·- మేము చెప్పినటువంటి dress కు ఎక్కువ డబ్బేమి అవసరంలేదు జుబ్బా, ధోవతి గాని లేక closed coat, ధోవతి లేక trousers గాని వేసుకోవలసిందని చెప్పాము. closed coat అంటే ఎక్కువ డబ్బు అవుతుందని అనుకోము. వారు మామూలుగా ఖర్చుపెట్టేదాంట్లోనే సరిచేసుకో వచ్చునని అనుకొంటాను. కనుక దీంట్లో జీతాల విషయం ఉత్పన్నంకాదు.

*Suits, appeals etc , in the Kavali and Gudivada Sub-Court*

506—

*954 Q - Sri G SURYANARAYANA — Will the Hon. the Deputy Chief Minister be pleased to state .

the number of suits, appeals, and applications filed in the Kavali and Gudivada Sub-Courts since their establishment ?

The Hon. Sri N. SANJEEVA REDDI :— The information is furnished below :

| | KAVALI SUB-COURT. | GUDIVADA SUB-COURT, |
|---|---|---|
| 1. Suits ... | 147 | 1765 |
| 2. Appeals . | 224 | 701 |
| 3. Applications | 1315 | 12,235 |

Sri V. KURMAYYA :— Mr. Speaker, Sir, In view of the large number of suits, appeals and applications, may I know from the Hon. Minister whether this Court will be made permanent ?

The Hon. Sri N SANJEEVA REDDI :– కేసులు ఎక్కువగా ఉంటే దానంతటదే permanent అవుతుంది. మేము చేయకుండానే అవుతుంది.

*Minor irrigation tanks in Royachoti Taluk.*

507 —

* 738 Q – SRI Y. ADINARAYANA REDDI — Will the Hon. the Minister for Revenue be pleased to state ;

(a) the number of Minor Irrigation tanks in Royachoti taluk of Cuddapah District ,

(b) the number of breached tanks in Royachoti taluk;

(c) whether the Government propose to take up the repairs of these tanks ,

(d) if so when ?

The Hon Sri K. CHANDRAMOULI:—

(a) There are 1067 Minor Irrigation tanks in Royachoti taluk of Cuddapah District.

*(b), (c) and (d)* There is only one breached tank (Viz) Chinthalagangunicheruvu in Mudampad village of Royachoti taluk The restoration of this tank has been deferred until the completion of the Pincha Reservoir Project, as the ayacut under this tank is likely to be benefited under this project.

*Development of Vodarevu near Chirala into a minor port.*

508.—

* 950 Q.— Sri PRAGADA KOTAIAH :– Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

the action taken on the representations made to the Governor at Chirala on 10th January, 1956 requesting the Government to develop Vodarevu near Chirala into a minor port.

The. Hon' Sri G. LATCHANNA :—

The matter is receiving attention.

ఈ విషయము ప్రభుత్వ పరిశీలనలో ఉన్నది.

Sri PRAGADA KOTAIAH :— కనీసము ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోనైనా ఈ ఓడరేవును అభివృద్ధి చేసేదానికి ఏదైనా పథకాన్ని ఈ ప్రభుత్వము కేంద్ర ప్రభుత్వానికి పంపించిందా !

The Hon. Sri G. LATCHANNA :— ఇటీవలనే ప్రభుత్వము కోస్తా నావికా విధానాన్ని అమలుపరచడానికి అవకాశము ఉంటుందేమో అని కేంద్ర ప్రభుత్వానికి కొన్ని సూచనలు చేసింది. మద్రాసునుంచి ఒక స్టీమరు అన్ని minor ports కు వస్తూ ఎగుమతి దిగుమతులను జరిపించే విధానమొకటి regular lines మీద నడిపించే

స్కీము ఒకటి తయారుచేసి కేంద్ర ప్రభుత్వ పరిశీలనకు పంపబడింది. కేంద్ర ప్రభుత్వము దాన్ని గురించి ఏదైనా సుముఖంగా అభిప్రాయము చెప్పగలిగినప్పుడు ఈ minor port పునరుద్ధరణ గురించి ఆలోచించడానికి వీలుంటుంది.

Sri PRAGADA KOTAIAH — ఇప్పుడు ప్రభుత్వంవారు వేసినటువంటి పథకానికి ఎంత ఖర్చు అవుతుంది ? Minor Ports Development కు ప్రత్యేకించబడినటువంటి సొమ్ములో దానికి ఖర్చుపెట్టడానికి అవకాశంలేదా ?

The Hon. Sri G LATCHANNA — ఈ కోస్తా నావికా విధానాన్ని నడిపించేది రాష్ట్ర ప్రభుత్వంకాదు. Minor ports యొక్క అభివృద్ధి గురించి కేంద్ర ప్రభుత్వము కొన్ని నిధులను ప్రత్యేకిస్తున్నందువలన, ఈ minor ports స్వయం పోషకంగా ఉండడానికి ఒక రకమైన కోస్తా నావికా విధానము ఉంటేనే గాని వీలుండదు, అని రాష్ట్ర ప్రభుత్వము అభిప్రాయపడి ఈ విధంగా minor ports అన్నిటికి ఎగుమతి, దిగుమతుల సౌకర్యాలు కల్పించడానికి ఈ విధంగా ఒక ఏర్పాటు చేయడం అవసరమని కేంద్ర ప్రభుత్వానికి సలహా ఇచ్చింది.

Sri T. JIYYAR DASS — అధ్యక్షా ! ఈ ఓడరేవును గవర్నరుగారు తరువాత మన Social Welfare మంత్రిగారు, సందర్శించి వచ్చారు. వీరైనా ఈ ఓడరేవును అభివృద్ధిచేయడం అవసరమని అభిప్రాయపడుతున్నారా ?

The Hon. Sri G. LATCHANNA — ఈ సందర్భములో సభ్యులు అడుగుతున్నందు వలన కొన్ని లెక్కలు చెప్పవలసియుంటుంది, ఈ వాడరేవు 1919 కి పూర్వము 8 ఏళ్ళు మూసివేయబడింది. తరువాత 1919 లో తిరిగి temporary minor port గా declare చేయబడి 1932 వరకు ఆ విధంగా ఉంది. దానియొక్క స్థిరత్వము గురించి పరిశీలనకై నిర్వహింప బడడం 1932 వచ్చేసరికి చాలా వర్తక వ్యాపారాలు ఏమీజరుగక పోయినందువల్ల సుమారు 1949 వరకు, 17 ఏళ్ళు, అక్కడ వ్యాపారం లేనందువల్ల తిరిగి దాన్ని మూసివేయడం జరిగింది. అందువల్ల దానికి సంబంధించినటు వంటి భౌగోళిక పరిస్థితులు గాని వ్యాపారము యొక్క ఇది వరకు ఉన్న లెక్కలు గాని చూస్తే దాన్ని వెంటనే పునరుద్ధరణ చేయాలని చెప్పేదానికి తగిన ఆధారాలు లేవు. అందుకనే ఈ విధమైనటువంటి systematic నావికా విధానమనేది కోస్తాలో నిగ్రహింప బడినట్లైతే ప్రతి minor port స్వయంపోషకంగా ఉండగలదని ఈ ప్రభుత్వము ఒక scheme ను సూచన ప్రాయంగా కేంద్ర ప్రభుత్వానికి పంపించింది. దానిని అనుసరించి ఈ port ను పునరుద్ధరణ చేయాలని ప్రభుత్వముయొక్క ఆలోచన.

Sri T JIYYAR DASS:— Ports యొక్క అభివృద్ధిని చూసేటటు వంటి ఆఫీసరుగారు వచ్చి చీరాలలో దాన్నిగురించి పర్యవేక్షణ చేసినపుడు అక్కడ ఉన్నటువంటి I. L. T D. కంపెనీవారు మిర్చి, groundnuts వగైరా వ్యాపారస్థులందరు కలసి దీనిని improve చేసినట్లైతే ఇది స్వయంపోషక మౌతుందని చెప్పినమాట వాస్తవమేనా ! నిజమైతే దానిని పరిశీలిస్తున్నారా ?

The Hon Sri G. LATCHANNA — ఇకముందు ఈ విధంగా జరిపింపగలమని సలహా ఇచ్చారు.

Sri VAVILALA GOPALAKRISHNAYYA .— కలకత్తా నుండి Steamer సౌకర్యము ఎట్లుంటుందో port చూడడానికని ఎవరో వస్తారని చెప్పారు. ఆ సందర్భములో కొత్తిపట్నం కూడ చూడడానికి వీలుంటుందా? మరల ప్రత్యేకంగా రావడానికి వీలుంటుందో ఉండదో అందుకని అడుగుతున్నాను.

The Hon Sri G. LATCHANNA:— Port చూడడానికి రావడము కాదు. వర్తక వ్యాపారాలు, ఎగుమతులు, దిగుమతులు జరిపించడానికి నావలు కలకత్తానుంచి బొంబాయి వరకు కూడా కోస్తామీదుగా ఇటూఅటూ తిప్పే విధానమొకటి అమలు పరచాలని ఈ ప్రభుత్వము కేంద్ర ప్రభుత్వానికి సూచించింది. ఈ స్కీము గురించి తమ అభిప్రాయాలు తెలియజేయవలసినదిగా ఇరుగుపొరుగు రాష్ట్ర ప్రభుత్వాలకు అనగా బెంగాల్ కు, ఒరిస్సాకు, మద్రాసుకు, తిరువాన్కూర్-కొచ్చిన్ కు, బొంబాయికి వ్రాసింది. మన ఆలోచనలు వారి పరిశీలన గురించి, వారి అభిప్రాయాలు గురించి పంపబడ్డాయి.

Sri K. PUNNAYYA:— అధ్యక్షా, బారువ, కళింగపట్నము ports ను కూడ పునరుద్ధరించడానికి ప్రభుత్వమేమైనా ప్రయత్నిస్తుందా?

The Hon.Sri G. LATCHANNA:— అవి minor ports జాబితాలో ఉన్నవండీ.

Sri M. NAGESWARA RAO:—అభివృద్ధి చేసే ఓడరేవులలో, చీరాల ఓడరేవు ఒకటేనా, యింకా ఏవైనా ఉన్నవా? అంటే, అందులో కాకినాడ ఓడరేవుకూడ ఉన్నదేమో చెబుతారా?

The Hon. Sri G. LATCHANNA:— కాకినాడ ఓడరేవు సంగతి చెప్పాలంటే యీ ప్రశ్నలో అవకాశములేదు. అన్నిటికంటే, విశాఖపట్టణము ఓడరేవు పెద్దరేవు దాని అభివృద్ధిని గురించి యిప్పుడు స్కీములు శాంక్షను అయినవి. ఆ అభివృద్ధి కార్యక్రమములు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో తీసుకోబడుతాయి.

Sri N. VENKAIAH :— 1949 వ సంవత్సరముకన్న యిటీవల ఓడరేవు వ్యాపారము వృద్ధిచెందింది అని, ఓడరేవు చాలా ప్రధానమైన రేవుగా ఉండిపోతుందని బందరు మొదలు మద్రాసుదాకా, ఉన్న ఓడరేవుకూడ అభివృద్ధి చేయబడలేదని ప్రభుత్వం గుర్తించి, త్వరలో ఓడరేవుల అభివృద్ధికొరకు ప్రభుత్వం ప్రయత్నిస్తుందా?

The Hon. Sri G. LATCHANNA :— ఓడ రేవులను అభివృద్ధి పరచాలనే ఉద్దేశ్యముతోనే కొన్ని స్కీములు ప్రభుత్వము కేంద్ర ప్రభుత్వానికి పంపడము జరిగింది. మద్రాసు యీలోపల కండలేరు అనేచోట ఒక ఓడరేవును పునరుద్ధరించటానికి, దానిని అభివృద్ధి పరచటానికి స్కీములు ఆమోదించబడ్డవి.

Sri A. BAPINEEDU :— అధ్యక్షా! నరసాపురము ఓడరేవు కూడ యీ స్కీములలో చేర్చబడిందా?

The Hon. Sri G. LATCHANNA :— దాని సంగతి ప్రస్తుతము చెప్పటానికి అవకాశములేదు.

13th March 1956]

Sri S. VEMAYYA :— అధ్యక్షా! కండలేరు అనేది కూడ ప్రభుత్వము వారి పరిశీలనలో ఉన్నది, మొదలుపెట్టుతాము అని మంత్రిగారు చెప్పారు. అయితే ఆ పని ఎప్పుడు ప్రారంభిస్తారు ?

The Hon Sri G. LATÇHANNA :— అది పరిశీలనలో ఉన్నదని చెప్పలేదు. దానిని పంచవర్ష ప్రణాళికలో చేర్చబోతున్నారు, మొదలు పెట్టుతారు. దాని స్కీములు accept అయినవి.

Sri PRAGADA KOTAIAH :— అధ్యక్షా! గత చరిత్రను బట్టి చూస్తే అంతగా వ్యాపారము లేదని అన్నారు. కాని యిప్పుడు ఒక్క గుంటూరు జిల్లానుండే కాకినాడరేవు, విశాఖపట్టణమురేవు, మద్రాసు రేవులద్వారా ఎగుమతి అవుతున్న మిర్చి, పొగాకు, యింకా యితర అపరాలు. అన్నీ గూడ ఏవేవి ఉన్నవో, లెక్కలువేసి చూస్తే, ప్రత్యేకంగా దీన్ని minor పోర్టుగా develop చేయటానికి అవకాశము ఉన్నదని అక్కడ ఉన్న అనుభవజ్ఞులు అంటున్నారు. కాబట్టి ప్రభుత్వము యీ విషయములో ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటుందా ?

The Hon Sri G LATCHANNA :— సభ్యులు అడిగిన ప్రశ్నను బట్టి "ప్రత్యేక శ్రద్ధ" అంటే అది వరకు ప్రభుత్వానికి శ్రద్ధ లేనట్టు, యిప్పుడు శ్రద్ధ చూపమని కోరుతున్నట్లుగా కనబడుతున్నది. అటువంటిది యేమీ లేదని మనవి చేస్తున్నాను.

*Special C. L. to the Government servants taking part in Sports.*

509—

*876 Q·- Sri S VEMAYYA — Will the Hon. the Chief Minister be pleased to state .

(a) whether this Government sanctioned special C. L. to the Government servants taking part in sports , and

(b) if so, to what extent ?

The Hon. Dr B. GOPALA REDDI —

[a] Yes Sir, The Special Casual Leave will be granted to Government servants for taking part in sporting events of National or Inter-national importance. However when members of Police teams participate in recognised tournaments, it will be treated as on duty.

[b] 30 days in a Calendar year.

Sri S. VEMAYYA·— National or International Sports లో పాల్గొనటానికి అవకాశము ఉన్నదని అన్నారు. ఈ International Sports అంటే competitors ను ఎక్కడెక్కడికి పంపుతారో చెబుతారా ?

The Hon. Dr. B. GOPALA REDDi — దానికి సమాధానము కావాలంటే ప్రత్యేక ప్రశ్న వేయాలి.

Sri S VEMAYYA — ఈ Sports లో పాల్గొన్నవారికి ఏమైనా accidents జరిగితే వారికి యిచ్చిన Special casual leave తో బాటు యింకా ఏమైనా extra ordinary leave ఉంటుందా ?

Mr SPEAKER — It is a hypothetical question Why do you wish for accidents ?

The Hon Dr B GOPALA REDDI — Accidents జరగాలని ఎందుకు కోరుతున్నారో అర్థము కాలేదు.

Sri P. VENKTASUBBAYYA — ఇప్పుడు అమలులోవున్న Government Servants, Conduct Rules ప్రకారము ప్రభుత్వోద్యోగస్థులు ప్రభుత్వము అనుమతి లేనిదే బహుమతులు పొందకూడదు అని ఉన్నదిగదా, అలాంటప్పుడు sport లో యిచ్చేవి గూడ అలాంటి బహుమతుల క్రిందకు రావా ? వస్తే, అప్పుడు రూల్సును బహుమతులు పొందటానికి వీలుగా సవరిస్తారా ?

The Hon Dr. B GOPALA REDDI - ఇవి అలాంటి బహుమతులు కాదు. పందెములలో ఎవరైనా గెలిచినప్పుడు, గెలిచినవారికి Shields, Cups వగైరాలు బహుమతులుగ యిస్తారు. ఇదికాదు ఆ రూలుయొక్క ఉద్దేశ్యము అసలు Conduct Rules లోని విషయము ఏమిటంటే, ఏ ప్రభుత్వోద్యోగస్థుడైనా ఎక్కడికైనా Transfer అయినప్పుడు, లేక ఏదైనా ఆయనకు ప్రమోషనుమీద కొత్త post కు వెళ్ళేటప్పుడు, అదీగాక, వారియింట్లో పెళ్ళిళ్ళు వగైరాలు జరిగినప్పుడు, ప్రజలు ఏమైనా బహుమతులక్రింద యిస్తారు అటువంటి బహుమతులు accept చేయకూడదు అని ఉన్నదికాని, యీ Sporting activities లో ఏమైనా Shields, Cups యిస్తే, అందులో తప్పుయేమీలేదు ఆ రూలుకు వర్తించవు.

Sri N. C. SESHADRI.— ఈ casual leave నిబంధనలు ఒక్క sportsకుమాత్రమే వర్తిస్తాయా? లేకపోతే Ordinaryగా Gamesకుకూడవర్తిస్తాయా Games కు కూడ వర్తిస్తే, Cricket Matches కొరకు విదేశాలకు వెళ్ళాలంటే, ముప్పయి రోజులు చాలకుండా వుంటవి. అలాంటప్పుడు ప్రభుత్వం ఏమిచేస్తుంది ?

The Hon. Dr B. GOPAL REDDI — ఈ 30 రోజులు చాలకపోతే, వారికి ఉన్న సాధారణ Casual leave, Special Casual leave యింకా ఎమైనా రూల్సు ప్రకారము eligible గా ఉంటే leave అంతా లెక్కవేసి, ఏది న్యాయము అని తోస్తే, అది చేస్తారు.

Sri S VEMAYYA :— ఈ casual leave కు తోడు ప్రభుత్వోద్యోగస్థులకు అవకాశములు కలగజేశారు. ఎక్కడైనా స్థానికంగా local గా ఉండే athletic Associations కు గూడా యిదేమాదిరిగా encouragements యివ్వడానికి గూడ ప్రభుత్వము పూనుకుంటుందా ?

The Hon Dr. B. GOPALA REDDI :— ఇస్తున్నారు గదా ! అటువంటివి ఏమైనా ఉంటే, వాటికిగూడ సన్నద్ధంగా కావలసిన ధనసహాయముగాని, యింకా యితర సహాయముగాని, ప్రభుత్వము చేస్తూనే ఉన్నది.

13th March 1956]

*Extra allowance to the Hindi Pundis in all District Board High Schools*

510—

*482 Q - Sri N C SESHADRI .— Will the Hon. the Chief Minister be pleased to state ·

(a) whether it is a fact that the Hindi Pundits in all District Board High Schools in the State are giving an extra allowance if they work for more than 10 periods in a week, and

(b) if so, the reasons for not giving such allowances to the teachers in Cuddapah District Board ?

The Hon Dr B GOPALA REDDI —

(a) Grade II Hindi Pundits are allowed a special pay of Rs 10 p m if they work in Forms IV to VI in Secondary Schools for more than 12 periods a week.

(b) The special pay was paid to the Grade II Hindi Pundits in Cuddapah District Board during 1954–55 As regards the payment of the special pay during 1955–56 the Special Officer, District Board, Cuddapah, reported on 17-1-1956 that orders were under issue.

*Hazipuram tank, Kanigiri taluk.*

511—

*751 Q -Sri G YELLAMANDA REDDI :— Will the Hon. the Deputy Chief Minister be pleased to state ·

(a) whether the supply channel is not feeding the Hazipuram tank, Kanigiri Taluk, Nellore District, because of the low height of the anicut, and

(b) if so, whether the Government proposed to raise the height of the said anicut ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

(a) It has been reported that the supply channel referred to is functioning satisfactorily.

[b] Does not arise.

The crust level of the Anicut is plus 106. The bed level of the anicut is plus 102 అంటే నాలుగు అడుగులు ఎక్కువగా ఉన్నదన్న మాట. The F T.L of the tank is plus 96 కాబట్టి అది safe level లో ఉన్నది. దానిని యింకా raise చేయవలసిన అవసరములేదు.

[13th March 1956

*Path-way to the Harijans of Chennuvaripalli*

512—

*918 Q - Sri S VEMAYYA — Will the Hon the Minister for Electricity and Social Welfare be pleased to state :

[a] whether the Government provided a pathway to the Harijans of Chennuvaripalli H/O Pamarru of Gudivada Taluk of Krishna District ; and

[b] if not, the reasons for withdrawal of Land Acquisition proceedings in G O Rt No. 481, Education and Endowments dated 3–10–1955 ?

The Hon Sri G. LATCHANNA :—

[a] The answer is in the negative.

[b] There are two pathways running from the Harijan Cheri to the main village, one by the side of R.S No. 6, and the other by the side of R S No 18, and carts can go through these pathways to the main village. The proposed pathway was mainly intended to benefit the caste Hindus, instead of Harijans and that as the village Panchayat Board is taking necessary steps to apply for funds for the acquisition of land under general funds, the proposals were withdrawn in G. O. Rt. No. 481 Education and Endowments dated 3–10–1955.

[A] లేదండి.

[B] ఈ గ్రామానికి సంబంధించిన, హరిజన చేరినుండి main గ్రామానికి వెళ్ళటానికి రెండు రహదారి బాటలున్నవి. అందులో బండ్లు కూడ వెళ్ళే అవకాశము ఉన్నది. ఇప్పుడు proposal కు వచ్చినటువంటి pathway హరిజనులకంటే సవర్ణులకే ఉపయోగపడేదిగా పరిశీలనవల్ల తేలింది. కాని పంచాయితీ బోర్డువారు ఆ రహదారిని acquire చేయటానికి ప్రత్యేకంగా ప్రభుత్వముయొక్క అనుమతి కోరుతూ, వారు తీర్మానించారు. Funds కు కూడ apply చేస్తున్నారు కాబట్టి దానిని ఉపసంహరించడమయింది.

Sri S. VEMAYYA — ప్రత్యేకంగా దారులు ఉన్నందువల్ల యిప్పుడు తీసుకున్న acquisition proceedings 'withdraw చేశామని అంటున్నారు. ప్రత్యేకంగా దారులు ఉంటే, ఆ Land acquisition proceedings ప్రారంభించ వలసిన అవసరము ఎందుకు వచ్చింది ?

The Hon. Sri G. LATCHANNA :— ఎందుకు ఏర్పడింది అనే ప్రశ్న డిపార్టుమెంటులో అడగడము అయింది. ఆ విషయము యిందాకనే మనవిచేశాను హరిజనులకంటే సవర్ణులకే ఉపయోగపడేటట్లుగా యీ proposal పరిశీలనవల్ల తేలింది.

13th March 1956]

Sri S VEMAYYA —యీ Land acquisition proceedings withdraw చేయక పూర్వము ఎంత కాలముగా యీ విషయము దర్యాప్తులో ఉండి తరువాత withdraw చేయబడిందో చెబుతారా ?

The Hon Sri G LATCHANNA:— 16-2-1954 తేదిన propose చేయబడింది. 3-10-1955 తేదిన withdraw చేయబడింది

Sri VAVILALA GOPALAKRISHNAYYA·—Land acquire చేసిన తరువాత యీ ఆలోచన వచ్చిందా ? చేయక పూర్వకమే యీ land యితరులకు ఉపయోగిస్తుంది అని తెలిసిందా ?

The Hon. Sri G. LATCHANNA·—ఇదివరకే acquisition propose చేయబడిన తరువాత ఇటీవల కలెక్టరు అక్కడికి పరిశీలనకు వెళ్ళడం, దాని final position గురించి తెలుసుకోటానికి దానికి వివరాలు అన్నీ చూచి యిది హరిజనులకు ఉపయోగపడేది కాదని తెలుసుకుని దానిని withdraw చేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరినందువల్ల ప్రభుత్వం ఆమోదించడం జరిగింది.

Sri P. VENKATASUBBAYYA.— ఆదారి ప్రత్యేకంగా సవర్ణులకే ఉపయోగపడుతుందని చెబుతున్నారు. ఇది హరిజనవాడకు వేయబడిన మార్గంగా ప్రశ్నలో కానబడుతున్నందున నూటికి 51 మంది సవర్ణులు ఉండినప్పటికినీ నూటికి 48 మంది యితరులు ఉంటే అప్పుడు ఆ దారి ఎందుకు వేయకూడదు ?

The Hon. Sri G. LATCHANNA.— ఈ pathways హరిజనులకు ఉపయోగపడేదిగా ఉంటే, land acquisition proceedings నడపటానికి ప్రభుత్వానికి ఏలాంటి అభ్యంతరము ఉండేదికాదు. కాని హరిజనుల ఉపయోగార్థము రెండు pathways ఉన్నవి. కాబట్టి అది ఏ కారణమువల్ల జరిగిందో కాని యిది సవర్ణులకే ఎక్కువగా ఉపయోగపడుతుందని కలెక్టరుగారి పరిశీలనవల్ల తేలింది. అందువల్ల యిది హరిజనులు ఉపయోగించే సందర్భములో హరిజనులకే వినియోగపరచడము మంచిదని గాని, లేకపోతే అది దుర్వినియోగము అవుతుందన్న ఆలోచనచేతగాని, acquisition proceedings withdraw చేయడము జరిగింది.

Sri S. VEMAYYA:— ఈ pathway సవర్ణులకు మాత్రమే ఉపయోగపడుతుందని అన్నారు. పోనీ, సవర్ణులకైనా ఆ pathway వేయించి, దానికి అయ్యే ఖర్చు సవర్ణుల వద్దనుంచి వసూలు చేయటానికి ప్రభుత్వము ఎందుకు ఆలోచించకూడదు ?

The Hon. Sri G. LATCHANNA·— ఆ బాధ్యత అంతా పంచాయితీ బోర్డువారువహిస్తున్నారు. పంచాయితీబోర్డువారు acquisition కొరకు పెట్టియున్నారు.

Sri P. VENKATA SUBBAYYA.— Land acquire చేస్తే సవర్ణులకు ఏమైనా బాధాకరంగావుంటుందేమోనని యీ మార్పు చేయబడిందా ?

The Hon. Sri G. LATCHANNA — ఇప్పుడు ఆ వివరాలు గౌరవ సభ్యులు అడిగినప్పటికినీ, నా దగ్గర ఆ భోగట్టా లేదు గనుక, నేను చెప్పలేను.

*Introduction of Intensive Milk Supply Scheme in the State.*

513 -

* 842 - Q - Sri P VENKATASUBBAYYA :— Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

[a] whether the Government have proposed to introduce Intensive Milk Supply Scheme in the State ,

[b] if so, which are the places where the scheme would be implemented , and

[c] the amount that the Government have allotted to each of these places ?

The Hon. Sri D SANJIVAYYA :—

[a] and [b] The Government have sanctioned the implementation of a Scheme of intensive milk supply in Kurnool and Guntur towns.

[c] The Government have sanctioned the payment of a subsidy of Rs 45,000/- and an interest bearing loan of an equal amount for meeting the cost of the equipment required by the Co-operative Milk Supply Union and its feeder societies in each of the above two towns The Government have also sanctioned, at their own cost, the employment of a staff of one Co-operative Sub Registrar, one Co-operative Senior Inspector of Co-operative Societies, one Dairy Chemist and one Dairy Assistant for a period of one year from the date of appointment in each of the above two centres to attend to the administrative and technical duties connected with the scheme.

Sri P. VENKATASUBBAYYA :—కడపలో Milk Supply Union feeder society లతో సహా ఏర్పాటు చేయబడిఉంది. Milk Bar అని పెట్టి ప్రజలకు milk ను supply చేస్తున్నారు. అక్కడ intensive supply scheme ఎందుకు పెట్టకూడదో సెలవిస్తారా ?

The Hon. Sri D. SANJIVAYYA:—ఆపట్టణంలో ఉండే demand ని బట్టికూడా మనం చేయవలసి యుంటుంది. మనం ఎక్కువగా milk produce చేసి, అవి అక్కడ అమ్ముడు కాకపోతే నష్టం వస్తుంది.

Sri V. VISWESWARA RAO:—అధ్యక్షా ! గుంటూరులోనూ కర్నూలులోనూ కూడా intensive Milk Supply Scheme క్రింద 40 వేలరూపాయలు ఇస్తున్నామని చెప్పారు. అక్కడ ఎన్నిపాలు తయారవుతున్నాయి. ఎన్ని శేర్లు ఎంత మందికి రోజూ అమ్ముతున్నారు ? లేకపోతే మిగిలి పోతున్నాయా ?

The Hon Sri D SANJIVAYYA — ఇప్పుడు 300 మొదలు 400 Madras measures వరకూ produce అవుతున్నాయి. ఈ scheme పెట్టినతరువాత Thousand Madras measures per day produce చెయ్యాలనిఅనుకుంటున్నాం. అదంతా ఖర్చవుతుందనికూడా అనుకుంటున్నాం

Sri P VENKATASUBBAYYA:— అధ్యక్షా! ఈ primary society ల వారు పంపిన పాలకు sales tax కట్టకోవలసి వస్తోంది. పాలుకూడా perishable article కాబట్టి sales tax నుంచి దీన్ని exempt చేస్తారా?

The Hon Sri D SANJIVAYYA — నేను మదరాసులో మంత్రిగా ఉండగా feeder society ల మీద tax లేదు Union లో అమ్మినప్పుడు మాత్రమే tax వేస్తున్నాం ఇక్కడ అటువంటి ఇబ్బంది ఏదైనా ఉన్నట్లయితే నేను తప్పకుండా పరిశీలించి దాని విషయంలో చర్య తీసుకుంటాను.

Sri A BAPINEEDU — Intensive Milk supply అన్నారు. ఏమి పాలో సెలవిస్తారా మంత్రిగారు.

The Hon Sri D SANJIVAYYA —మామూలుపాలు.

Sri N SRINIVASA RAO — అధ్యక్షా! కనీసం నీరా centre లు ఎక్కడ లేనిచోటనైనా శరీర పుష్టికొరకు ఈ Milk feeder societies ఎక్కువగా improve చేయుటకు ప్రభుత్వం ప్రయత్నిస్తారా? అందులో ముఖ్యంగా West Godavary జిల్లాలో ఏలూరులో పెట్టడానికి ప్రయత్నిస్తారా?

The Hon Sri D. SANJIVAYYA — ప్రయత్నిస్తామండి.

Sri S. VEMAYYA·— ఈ 45 వేల రూపాయిలిచ్చి private వాళ్ళను encourage చేయుడమకన్న ప్రభుత్వమే విశాఖ పట్టణములో ఉన్న టువంటి farm కి attach చేసి ఒక milk supply society ని ఏదైనా పెట్టుటకు ప్రయత్నిస్తారా? అటువంటిదే ఇంకేదైనా town లో పెట్టడానికి ప్రయత్నిస్తారా.

The Hon Sri D SANJIVAYYA :— అది ఆలోచనలో ఉన్నదండి. విశాఖపట్టణములో పెట్టేటటువంటి సందర్భములో అక్కడుండే Farm Live Stock Improvement Board లో తీర్మానం చేశారు. ఆ తీర్మానం ప్రకారం అక్కడుండేటటువంటి farm వారిని consult చేసి ఒక Co-ordinated schem పెట్టాలనుకుంటున్నాం.

Sri S. VEMAYYA .—విశాఖపట్టణంలో మాదిరిగానే మరొక జిల్లా townలో ఈ scheme ని అభివృద్ధి చేయడానికి ప్రభుత్వం ఎంత త్వరలో పూనుకుంటుంది?

The Hon Sri D SANJIVAYYA ,— ప్రభుత్వమే చెయ్యాలంటే కష్టం. Co-operative unions ఉన్నాయి, Societies ఉన్నాయి వారికే వప్ప చెప్పడం మంచిదని భావిస్తున్నాం.

Sri P VENKATASUBBAYYA — ఈ scheme అమలు పెట్టే చోట members కు ఎంత మాత్రంగా అసఖలు ఇస్తారో తెలియజేస్తారా?

The Hon Sri D SANJIVAYYA :— ఈ scheme క్రింద అప్పులు ఇవ్వడం ఏమీ లేదు. బిల్డింగులు కట్టడానికి స్థలం, Pasturisation plant కూ మిగతా వాటికీ కూడా ఖర్చు పెడుతున్నాం.

Sri P. VENKATA SUBBAYYA :— ఆవులు, గేదెలు కొనడానికి ఎంత అప్పు ఇస్తారండీ?

The Hon Sri D. SANJIVAYYA :— మామూలుగా milk supply societies కు ఒక్కొక్క ఆవుకో, లేక బర్రెకో కొనడానికి 300 రూపాయిలు ఇస్తున్నారు. మొదటి ఒకటి రెండు ఏండ్లు interest free loans కూడా ఇస్తున్నాం.

Sri P. BAPAYYA — అధ్యక్షా! ఈ scheme ను బెజవాడలో పెట్టవలసినదిగా బెజవాడలో ఉన్నటువంటి milk supply society వారు applications పెట్టారా అండి? పెట్టినట్లయితే బెజవాడయొక్క ప్రాముఖ్యతను గుర్తించి అక్కడకూడా ఈ scheme ని అమలు జరపడానికి ప్రభుత్వం ప్రయత్నంచేస్తారా?

The Hon Sri D. SANJIVAYYA —బెజవాడ వాళ్ళెవరూ అడగలేదండీ. మేమే కర్నూలు, గుంటూరు, విజయవాడ, విశాఖపట్టణం, రాజమండ్రిలలో పెట్టాలని అనుకున్నాం. కాని మొట్టమొదట experimental గా కర్నూలు, గుంటూరు లో ప్రయత్నం చేస్తున్నాం. విశాఖపట్టణంలో కూడా పెట్టడానికి ఆలోచనలు జరుగుతున్నాయి. తరువాత మిగతా పట్టణాల లో క్రమేణా పెడతాము.

Sri P. GOPALU REDDI.— అధ్యక్షా! కర్నూలు town లో ఆవు పాలు శుభ్రమైనవి కావాలంటే దొరకడం లేదు. ఈ శాసనసభ జరిగే కాలములో hostel లో నైనా ప్రత్యేకంగా sales parlour పెట్టడానికి ఒక ఏర్పాటు చేస్తారా అండి.

The Hon. Sri D. SANJIVAYYA.—ఆలోచిస్తామండి.

Sri T. GOPALAKRISHNA GUPTA:—అధ్యక్షా! మన రాష్ట్రంలో కర్నూలులోనూ, గుంటూరులోనూ ఈ సొసైటీలు రెండూ పెట్టామన్నారు. ఇటీవల శ్రీశైలంలో కాఫీ తయారు చేయటానికి పంపించిన milk powder ఈ Kurnool Society నుంచే పంపబడిందా అనే విషయం తెలియజేస్తారా?

The Hon. Sri D. SANJIVAYYA.—అదేమో నాకు తెలియదండి.

Sri B. APPA RAO.— అధ్యక్షా! పట్టణాలలో ఎక్కడా శుభ్రమైన పాలు దొరకవు. గ్రామాలలో దొరుకుతాయి కాబట్టి, ఈ ఎసెంబ్లీని గ్రామాలలో సమావేశపరచడానికి ప్రయత్నిస్తారా?

The Hon. Sri D. SANJIVAYYA:— ఆ ప్రశ్న ముఖ్యమంత్రిగారికి వెయ్యండి.

Sri B. VENKATASIVAYYA : ఈ యూనియన్‌లు ఉన్న town లలో individuals పశువులను తెల్లవారుజామున ఇంటికి తీసుకువచ్చి society కన్న ముందుగానే పాలు supply చేస్తున్న కారణంచేత ఆ పాల సొసైటీలు feeder society ల నుంచి ముందుగా తెచ్చుకోలేక దెబ్బతింటున్నాయి. కాబట్టి ఈ వ్యక్తులను అట్లా పోటీ చేయకుండా నిరోధిస్తారా ?

The Hon Sri D SANJIVAYYA.—వాళ్ళకది fundamental right.

Sri P. GUNNAYYA — ఈ పాల సొసైటీలు మా శ్రీకాకుళం జిల్లాలో ఏమైనా ఉన్నాయా? అవిలేకపోతే పెట్టడానికి ప్రయత్నం చేస్తారా ?

The Hon. Sri D SANJIVAYYA —ఇప్పటికే ఉన్నాయి పాలసంఘాలు.

Sri V. VISWESWARARAO —అధ్యక్షా ! గుంటూరులో live stock farm ఉంది Guntur లో intensive milk supply scheme 40 వేల రూపాయిలు private subsidy ఇచ్చి ఇవన్నీ చేసేటప్పుడు ఆ live stock farm ని improve చేసి అక్కడే దీన్ని ఎందుకు ప్రవేశ పెట్టకూడదు ?

The Hon Sri D. SANJIVAYYA .— అటువంటి ఆలోచన ఏమీ లేదండి ఇప్పుడు.

Sri M POTURAJU :— అధ్యక్షా ! పూర్వం రైతులు చల్దిఅన్నం తినేటప్పుడు బాగా పనిచేసేవారు. అందరూ coffee త్రాగడం మరిగి పనులు మానేస్తున్నారు. మళ్ళీ రైతులందరూ చల్దిఅన్నం తినేటట్లు చేస్తారా ప్రభుత్వం ?

The Hon. Sri D. SANJIVAYYA .– తింటే ఆరోగ్యం బాగా ఉంటుందని నాకు తెలుసును. అందరూ తినడానికి ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను.

*Competitions in respect of groundnut crop in the State.*

514—

*1048 Q - Sri P GOPALAKRISHNA REDDI :— Will the Hon the Chief Minister be pleased to state ;

whether there is any proposal to start competitions in the State in respect of groundnut crop ?

The Hon. Dr B GOPALA REDDI .–Yes.

Sri N. C. SESHADRI .— What are the details of the scheme ?

The Hon. Dr. B. GOPALA REDDI :— Taluq, District, State levels లో ఈ competition పెట్టాలని ; ఏ తాలూకాలో నైనా 50 మంది competitors ఉంటే ఆ తాలూకాలో ఈ competitions పెట్టాలని అనుకుంటున్నాం.

The following prizes will be awarded

State prize-winner — Rs 300/- in cash and a gold medal worth Rs 100/-.

District prize-winner — Rs. 100/- in cash

Taluk prize-winner — Rs 25/- in cash

తగు వారం ఈ season ఐపోయింది. కాబట్టి ఈ సంవత్సరం చెయ్యడానికి వీలు లేదు 1956-57 లో చేస్తామని Director of Agriculture గారు తెలుపుతున్నారు.

Sri CHITAMBARA REDDI — అధ్యక్షా! ఈ scheme పోయిన సంవత్సరమే అమలులోకి వచ్చింది. కాని ఏ పరిస్థితులలో అమలులోకి రాకుండా పోయిందో మంత్రిగారు సెలవిస్తారా ?

The Hon Dr B GOPALA REDDI :— ఈ మాదిరిగా చెబుతున్నారు Director of Agriculture గారు :

The Director of Agriculture has reported that as the main season for groundnut for 1955—56 was over, the above scheme can be implemented only in 1956—57

Sri R. NATHAMUNI REDDI — చెరకు, వడ్లు, రాగులు, జొన్నలు ఇవి వేసేవారికి బహుమతులు అధికంగా ఇస్తున్నారు. Groundnuts కి మాత్రం అంత తక్కువగా నియమించడానికి కారణం చెబుతారా ?

The Hon.Dr. B GOPALA REDDI:—ఇప్పుడిప్పుడే ప్రారంభిస్తున్నారు. తరువాత అదికూడా క్రమేణాభివృద్ధి చేసుకోవచ్చును.

Sri T. RAMACHANDRA REDDI,— Groundnuts కు prize ఇస్తామని మంత్రిగారు చెప్పినారు. అది wet cultivation కాలేకపోతే dry cultivation కు ఇస్తారా ?

The Hon Dr B. GOPALA REDDI:—రెండింటికీ.

Sri M. NAGI REDDI:— 50 మందికి తక్కువ లేకుండా ఉంటే ఆ competition పెడతామన్నారు. competition లో పాల్గొనే రైతులు Director గారికి గాని, లేక Agricultural Officer గారికి గాని ఎవరికి petition లు పెట్టాలి ? దీని procedure ఏమిటి ?

The Hon Dr. B. GOPALA REDDI:—ఇదంతా Demonstrator ల ద్వారా Agricultural Officer వాళ్ళకు supply చేయవలసి వుంటుంది. ఈ scheme notify చేశారు బహుశః ఆ ప్రాంతాలలో Demonstrators ద్వారా Agricultural Officers కు దరఖాస్తు పెట్టాలి.

13th March 1956]

Sri S. VEMMAYYA — Competition వగైరాలు పెట్టి ఎక్కువగా పంటను అభివృద్ధి చేయడానికి ప్రోత్సహించడానికి తోడు, దాని export కు కూడా అవకాశము లీయకపోతే ఉత్పత్తి కూడా కుంటుపడుతుందని ప్రభుత్వానికి తెలుసా ? దాన్ని గురించి ప్రభుత్వం ఏమి చర్యలు తీసుకుంటుంది ?

The Hon Dr. B. GOPALA REDDI.— అది మేము ఢిల్లీ ప్రభుత్వానికి ఎప్పటి కప్పుడు సిఫార్సు చేయగలం.

Sri N VENKAIAH — వేరుశనగ కాయలకు నాణ్యమైన విత్తనాలకు కూడ ఒక prize ఇచ్చేలాగున ప్రయత్నం చేస్తారా ?

The Hon. Dr B GOPALA REDDI·— ఇవన్నీ కూడా చేస్తారు. నాణ్యము అయినట్టిది, ఎక్కువ ఉత్పత్తిని ఇచ్చేవి చాలా ఉన్నాయి.

Sri M NAGI REDDI —వేరుశనగ ఉత్పత్తి పెరగడానికి తగిన artificial research జరగడము కాని వాటి supply కాని చాలా తక్కువగా ఉన్నది. ఎరువులకు దానికి Agricultural Department ద్వారా పరిశీలన చేయించి ఎరువులు సప్లై చేయించేదానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుందా ?

The Hon Dr B GOPALA REDDI —Groundnut కు స్పెషలు గానా ? అది ఏదో ఆలోచిస్తాము.

Sri C. P. THIMMA REDDI;— ముఖ్యముగా Groundnut పంటకు తెగుళ్ళు 10, 15, 20 రోజులకు వస్తవి దానిని గురించి శ్రద్ధ తీసుకుంటారా ?

The Hon Dr B GOPALA REDDI —తప్పకుండా పరిశీలన చేస్తాము.

*Five Vigyan Mandirs.*

515— SRI P. VENKATASUBBAYYA —

* 777 Q — SRI S VEMAYYA — Will the Hon-the Chief Minister be pleased to state

whether it is a fact that during the Second Five Year Plan Five Vigyan Mandirs are going to be set up in the country and if so, whether one such institution would be started in Andhra ?

The Hon Dr. B. GOPALA REDDI.—

From the draft outline on the Second Five Year Plan received from the Planning Commission, it is observed that provision has been made under "SCIENTIFIC RESEARCH" for the establishment of small rural scientific laboratories Known as (VIGYAN MANDIRS) and that the scheme has large possibilities of disseminating the scientific approach to local problems· No provision has been made in the State Second Five Year plan

for the starting of such institutions in Andhra and there is no information whether the centre proposes to locate any of the Mandirs in this State.

*Entrusting works to the Labour contract co-operative Societies*

516 —

* 844 Q — SRI P. VENKATASUBBAYYA -Will the Hon. the Deputy Chief Minister be pleased to state·

(a) whether the Government have issued orders instructing the Highways, Public Works and other Departments to entrust works below the estimate value of Rs 2,500/- without calling for tenders, to the Labour Contract Co-operative Societies in the State, and

(b) whether the Government propose to enhance limit to Rs 5,000/- ?

The Hon. Sri N SANJEEVA REDDI:—

(a) The answer is in the affirmative

(b) The limit has since been enhanced to Rs 10,000/-

Sri B. SANKARAIAH – కొన్ని Departments లో ఇంకా ఇవ్వడము లేదు. Electrical Department లో works ఎక్కువగా ఉన్నవి. వాళ్ళేమో ఇవ్వడములేదు సరిగా implement చెయ్యడములేదు. దీనికి చర్య తీసుకుంటుందా ?

The Hon Sri N. SANJEEVA REDDI :– ఇప్పుడిప్పుడే ఉత్తరువులు చేసినాము. ఇంకా సరిగా అందలేదేమో. 2000/- ఉన్నది, 5000/- కావాలన్నారు గాని 10,000 కు పెంచాము. ఉత్తర్వులు సరిగా అమలు చెయ్యకపోతే ఆక్షేపించాలి గాని ఇంకా ఉత్తర్వులు జారీచేస్తుండగానే అంటే ఎట్లా.

Sri M. NAGI REDDI – P W D Highways Department లలో ఉన్న engineers రు. 2500/- వరకు టెండర్సు లేకుండా ఎవరికంటేవారికి కంట్రాక్టులు ఇచ్చివేస్తున్నారు. దీనివల్ల individuals కు ఇచ్చేదానికి అవకాశం ఉన్నది. ఆ పద్ధతిని మాన్పించడానికి మంత్రిగారు ఏమైనా చేస్తారా.

Mr. SPEAKER :– ఈ ప్రశ్న Labour Co-operative Societies గురించి.

The Hon. Sri N. SANJEEVA REDDI :—అవకాశం ఉన్నదికాబట్టి పదివేలవరకు Tenders పెట్టకుండా సొసైటీలకు ఇవ్వమనీ ఉత్తర్వులు చేసినాము. ఆ అధికారాలు రదుచేస్తే ఈ టెండర్సు కో-ఆపరేటివ్ సొసైటీలకు ఇవ్వడానికి అవకాశము ఉండదు. Executive Engineer కు 25,000 కాదు 10,000 వరకు టెండర్లు

13th March 1956]

లేకుండా సొసైటీలకు ఇవ్వడానికి వీలుఉన్నది. ఆ ఆర్డర్సు అనుసరించి ఈ సొసైటీలకు టెండర్లు పిలవకుండా ఇవ్వాలని మేము ఉత్తర్వులు జారిచేసినాము. ఆ rule రద్దుచేస్తే ఇదంతా ineffective అగుతుంది.

Sri M NAGI-REDDI —నందికొండ ప్రాజెక్టు నిర్మాణములో కొలతలు త్రవ్వడము విషయములో Labour Co-operative Society లకు ఇవ్వడానికి ప్రభుత్వం ఆలోచిస్తారా.

Mr. SPEAKER .– The question was already answered.

Sri N K. LINGAM — Rs 2500/- estimates individuals కు ఇచ్చినట్లు ఉంది. 10 వేలకు పెంచుతున్నారు ఈ అనుకూలత ప్రైవేటు వ్యక్తులకు వర్తిస్తుందా ?

The Hon Sri N. SANJEEVA REDDI — సొసైటీలకు మాత్రమే.

Sri C SUBBARAYUDU — పదివేల వరకు సొసైటీలకు టెండర్సు లేకుండా ఇచ్చినప్పుడు వాటికి ఎక్కువగా మార్జిను ఉన్నది చాలామంది contractor లు విపరీతముగా సంపాదించుచున్నారు. అటువంటప్పుడు competition వస్తుంది కాబట్టి competition కు అవకాశం ఉండేటట్లు చేస్తారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI .— పేదలు ఉన్నారు. వారికి కొద్దిగా మంచిదని వారికి సహాయము చేయడానికి ఈ మార్పు తీసుకువచ్చాము. వారికి లాభము వస్తుంది ప్రభుత్వానికి నష్టం వస్తుంది అంటే అదికూడా చూస్తాము. రద్దు చెయ్యమంటే కొన్నాళ్ళు పరిశీలన చేసిన తరువాత చూస్తాము.

Sri G. RAMI REDDI -- Co-operative Society లు కొన్ని Bogus వి పెట్టి కొంతమంది వ్యక్తులు ఇటువంటి అవకాశాన్ని వాడుకుంటున్నట్లు తెలుస్తున్నది. అటువంటి వాటిమీద ప్రభుత్వం ఏమైనా చర్య తీసుకుంటారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI.— అది పరిశీలన చెయ్యాలి. దానిలో కొంత సత్యం ఉంది. కొన్ని సొసైటీలు 10 మంది వ్యక్తులపేర వ్రాసి సొసైటీ రిజిష్టరుచేసి డబ్బుసంపాదించడానికి కృషిచేయవచ్చును. అలాంటిది ఎక్కువగా ఉంటే ప్రభుత్వము చర్యతీసుకొని ఈ ప్రివిలేజి రద్దు చెయ్యవలెననేది తప్పకుండా ఆలోచిస్తాము.

Sri S. VEMAYYA:— సొసైటీలకు ఇస్తాము అని చెప్పినప్పటికి కూడా వారు సొసైటీతోసహా టెండర్లు call for చేసి తరువాత ఇవ్వడం జరుగుతూ ఉంది. అట్లాకాకుండా మొదటే వారిని అడిగివాళ్ళు తీసుకోవలిస్తే వారికి ఇవ్వడము చేస్తే అనవసరంగా correspondence చెయ్యడము టెండర్సు call for చెయ్యడము తప్పుతుంది. మొదటవారిని అడిగి వారు తీసుకొనకపోతే టెండర్సు call for చేసే విధానము అవలంబించడానికి ఉత్తర్వులు జారిచేస్తారా ?

The Hon. Sri N SANJEEVA REDDI :— Nature of work various circumstances ను బట్టి చూడాలి. Machinary కావలసి ఉంటుంది. ఇంకా ఎన్నో విషయాలను చూడాలి. Societies కు preferance ఇవ్వాలంటే works ఏమి జరుగుతాయి. వారిని అడిగి వారు వద్దు అనేవరకు wait చేసి season అయిపోయి, Next season మళ్ళీవచ్చి ఇవి అన్ని చెపితే పనులుజరుగవు. preferential అంటే ఎలాగు. Realistic approach చెయ్యవలెను. ఎక్కడ వీలైతే అక్కడ వారలకు ఇవ్వాలని చెప్పాము. Individual cases on merits చూడాలి గాని ప్రతిదానికి General rules apply చేస్తామంటే ఎట్లా.

Sri N SRINIVASA RAO :— చల్లావారి సలహా లేబరు హృదయంలో బల్లెంలా గుచ్చుకుంటుంది. కాబట్టి ఆ సలహాను గురించి ఆలోచించకుండా ఉండడానికి ప్రయత్నం చేస్తారా ?

The Hon Sri N SANJEEVA REDDI :— దానిని గురించి కూడా ఆలోచిస్తాము.

Sri PRAGADA KOTAIAH :— అక్కడక్కడ ఈ సొసైటీలలో స్వార్థపరులు చేరుతూఉన్నారు. స్వంతానికి ఉపయోగించుకుంటున్నారు. అని allegations వస్తున్నవి. కాబట్టి ఈ సొసైటీలకు co-operative Junior inspectors ఈ సొసైటీలు పనిచేసేటట్లు ప్రభుత్వం సహాయం చేస్తుందా.

The Hon Sri N. SANJEEVA REDDI :— ఇవి allegations counter allegations ఇప్పుడే ఉత్తర్వులు సంపాదముజరిగింది. పరిశీలన చేస్తాము ఎంత వరకు work చేస్తుంది, పేదవారికి ఎంత ఉపయోగపడుతుందో తరువాత misuse అగుతుంది. అంటే ఏమిచెయ్యాలో ఆలోచిస్తాము. ఇప్పుడే misapprehension తో బయలుదేరితే పనిసాగదు.

Sri G. NAGESWARA RAO:— కొన్ని సొసైటీలు అభివృద్ధికరంగా చేస్తున్నవి. ఉదా : Razole society లేబరు కాంట్రాక్టు సొసైటీ యీ సంవత్సరం 1800 రూపాయలు పని తీసుకొని చేస్తున్నది. అటువంటి వాటికి ఈ 10 వేలు చిన్న మొత్తము కాబట్టి అభివృద్ధికరంగా పనిచేస్తున్నటువంటి సొసైటీల విషయములో యీ మొత్తాన్ని 25,000 రూపాయల వరకు పెంచడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందా ?

The Hon. Sri N. SANJEEVA REDDI:—ఇంకా పదివేలు కావాలంటే అందరితోపాటు టెండరుపెట్టుకొని పనిచెయ్యడానికి మంచి సొసైటీ ఉంటే ప్రయత్నం చెయ్యవచ్చును.

Sri P VENKATA SUBBAYYA .— పదివేలకు మించని Contracts లను అధికారులు టెండర్సు ఇస్తే ఇవ్వవచ్చును లేకపోతే లేదు అని తెలుస్తున్నది. అది లేకుండా తప్పనిసరిగా 10 వేలకు మించని Contracts టెండరు లేకుండా Co-operative Societies కు ఇవ్వవలసిన ఉత్తర్వులు జారీచేస్తారా ?

The Hon Sri N SANJEEVA REDDI .— ఇప్పటికు జారీచేసిన ఉత్తరువేఅది. Nature of the workనుబట్టివుంటుంది.Manual labourగల work

13th March 1956]

అయితే పదివేలైనా ఫరవాలేదు. కొంచెం machinery కావలసివచ్చినచోట Society చెయ్యలేకపోవచ్చును. Discretion ఆఫీసరుకు ఉండవలెను. ఏమిటంటే పదివేలకు మించకుండా ఉన్నవాటిని Co-operative Society లకు ఇచ్చి encourage చెయ్యండి అని ఉత్తరువులు జారీచేసినాము. ఇది ఎట్లా పనిచేస్తున్నదో చూస్తాము.

Sri P GUNNAYYA — అధ్యక్షా ! కంట్రాక్టు మైనరు పంచాయితీలకు ఒక గ్రామంలో 30, 40 వేలవరకు P. W. D. ఖర్చుచేస్తున్నారు Minor పంచాయితీలకు ఇచ్చి ఆ పనులు చెయ్యడానికి ప్రభుత్వం పూనుకుంటుందా అని మనవిచేస్తున్నాను.

The Hon Sri N SANJEEVA REDDI – ఈ ప్రశ్న కో-ఆపరేటివు సొసైటీలకు సంబంధించింది. ఇప్పుడు Minor పంచాయితీలకు అంటున్నారు. అది కూడా ఆలోచిస్తాము.

Sri P GOPALU REDDI – అధ్యక్షా ! ఈ contracts ను Labour Co-operative Societies కు ఇవ్వడంలో సాధారణంగా ఇంజనీయరింగు డిపార్టుమెంటుకు ఇచ్చే మామూళ్ళున్నాయని ప్రభుత్వానికి తెలిసే ఉంటుందనుకుంటాను. ఆ మామూళ్ళను యిచ్చి labour co-operative society ఏవిధంగా ఖర్చు వ్రాయగల్గిందో ప్రభుత్వం గుర్తించిందా ?

The Hon Sri N. SANJEEVA REDDI .— ఇది పాటా ఖర్చులక్రింద వ్రాసుకోవచ్చును.

*Six Major Panchayats having the benefit of provision of housing facilities.*

517—

*523 Q - Sri N. C SESHADRI :— Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state:

[a] whether it is a fact that six Major Panchayats have been given the benefit of provision of housing facilities in the State,

[b] if so, what they are ; and

[c] the reasons for which the scheme was extended to those Panchayats ?

The Hon Sri D. SANJIVAYYA :- [a] and [b]. Yes, Sir. They are Madanapalli,

| | | |
|---|---|---|
| and Pakala | in | Chittoor District, |
| Kavali | in | Nellore District, |
| Tanuku | in | West Godavari District, |
| Vinukonda | in | Guntur District and |
| Tadepalligudem | in | West Godavari District. |

[c] The six Major Panchayats referred to have been selected considering the importance of the locality and ready availability of plots for the construction of houses

Sri N C SESHADRI·—అధ్యక్షా! మంత్రిగారు చదివిన గ్రామాలలో ఇంకా అంతకంటె కూడా పెద్ద పంచాయితీలు కొన్ని ఉన్నవి. అక్కడ house sites కని కావలసిన స్థలాలు ఉన్నవి. అటువంటి పంచాయితీల దగ్గరనుంచి యేమైనా అర్జీలు వచ్చిఉంటే అవి entertain చేయడానికి అవకాశం ఉందా.

The Hon Sri D SANJIVAYYA —అదికాదండీ! అక్కడే Societiesకు ఉండే sites రెడీగా ఉండి acquire చేసి plots వేసి డబ్బుతేకుండా నిలిచిపోయిన పంచాయితీలను ఇప్పుడు సెలెక్టు చేశామని నేను చెప్పాను

Sri VAVILALA GOPALAKRISHNAYYA·— అధ్యక్షా! సత్తెన పల్లిలో కొంత స్థలం ఆక్రమించి ఇదివరకు Co-operative Society ని పెట్టాలని రిజిష్టరు చేశారు. స్థలం కూడా వేరే allot చేసి ఉంచారు· ఆ స్థలాన్ని యిప్పుడు ఎవరో యిద్దరు వ్యక్తులకు 30 వేల రూపాయలకు యివ్వటానికి sanction చేశారట. అది ఏ విధంగా అన్యాయం అవుతుందో ఏ విధంగా చేస్తారో తెలియబరుస్తారా?

The Hon. Sri D SANJIVAYYA:—Notice.

*Working staff in the Ayurvedic dispensary at Guntakal.*

518 –

* 199 – Q – Sri M RAJARAM :— Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state :

(a) the number of working staff in the Ayurvedic dispensary at Guntakal ;

(b) the number of daily attendance of patients ; and

(c) the amount spent on medicines in the Ayurvedic Dispensary, Guntakal, for the year 1954—55 ?

The Hon Sri A. B NAGESWARA RAO :—

(a) One Medical Officer, one compounder, one male Nursing Orderly, one female Nursing Orderly, one Watchman

(b) The daily average attendance of patients treated at the Ayurvedic dispensary, Guntakal during the year 1954–55 was 157.

(c) Rs. 3,259—2—6.

(a) గుంటకల్ మునిసిపల్ ఆయుర్వేద ఆస్పత్రిలో ఒక మెడికల్ ఆఫీసరు, ఒక కాంపౌండరు, ఒక మేల్ నర్సింగు ఆర్డర్లీ, ఒక ఫీమేల్ నర్సింగు ఆర్డర్లీ, ఒక కాపలా మనిషి ఉన్నారు.

13th March 1956]

(b) సగటున జూను 157 మంది అక్కడ వైద్యం చేయించుకోడానికి వస్తున్నారు.

(c) మందుల ఖర్చు క్రింద రు. 3259-2-6 అయింది.

Sri M. RAJARAM.-అధ్యక్షా ఆయుర్వేద డిస్పెన్సరీకి ఖర్చుపెట్టేడబ్బు చాలా తక్కువగా ఉందని ఇంకా ఎక్కువమందులు లేవని ప్రజలలో అక్కడ అలజడిగా ఉంది కాబట్టి ఎక్కువ మొత్తం కేటాయించేటట్లు ఉత్తర్వు జారీ చేయిస్తారా?

The Hon Sri A B NAGESWARA RAO.— గౌరవ సభ్యులు చేసిన సూచనను గుంతకల్లు మునిసిపాలిటీ వారికి తెలుపుతాము.

Sri V. VISWESWARA RAO.—అధ్యక్షా! ఇక్కడ staff ను గురించి చెప్పారు. Staff జీతాలక్రింద ఎంత ఖర్చు పెట్టుతున్నారు? తరువాత మందుల క్రింద ఎంత ఖర్చు పెట్టుతున్నారు? ఇది ఎంత proportion ఉంది?

The Hon Sri A. B NAGESWARA RAO.—1954-55 లో మునిసిపల్ ఆయుర్వేద ఆస్పత్రికి మొత్తం ఖర్చుఅంతా రు. 6,000-0-6 అందులో మందులు ఖర్చు రూ. 3,259-0-0

*Constitution of a Board for preservation of wild animals.*

519 -

* 372 - Q - Sri S VEMAYYA .— Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether the Government have constituted a Board for the preservation of wild animals etc , and

(b) if so, the names of the members ?

The Hon Dr B. GOPALA REDDI .—

(a) Yes Sir.

(b) The names of the members are furnished below :—

| | | |
|---|---|---|
| 1 | Patron | Governor of Andhra |
| 2 | Chairman. | State Minister in charge of Forests |
| 3. | Vice-chairman | Secretary to Govt Industries, Co-operation and Labour Department. |
| 4. | Secretary | Chief Conservator of Forests, Andhra. |
| 5. | Ex-officio members. | 1. Senior Professor of Zeology, Andhra University. |
| | | 2. Inspector General of Police, Andhra. |
| | | 3. Regional Secretary, Southern Region Indian Board for Wild Life, Sandur. |

[13th March 1956

| | |
|---|---|
| | 4. Sri N Bhagawandas, I.A.S, Collector of Guntur (in his personal capacity). |
| 6. Non-official members. | 1. Raja Sri Rama Krishna Rangarao, Rajah of Bobbili, Bobbili |
| | 2 Sri Raja Sri V. J. Krishna Yachendra Bahadur, Raja of Venkatagiri Venkatagiri. |
| | 3. Sri Vallivedu Raja Reddy, Chittoor. |
| | 4 Sri Vijaya Apparao Zamindar of Brivaram, Nuzvid, Krishna Dist. |
| | 5. Sri N Dorayya Reddy of Anaparthi East Godavari District. |
| | 6. Sri Raja Veerabasavachikka Royal, Zamindar of Punganur. |
| | 7. Raja Sri Vetsavaya Venkata Krishnamaraju, Bahadur, M. L A. Tuni. |

Sri S. VEMAYYA:—ఈ స్కీమును అమలు పరచేదానికి కేంద్ర ప్రభుత్వం వారు మనకు డబ్బు కేటాయిస్తున్నారా ?

The Hon. Dr B. GOPALA REDDI:— డబ్బుయేమీ ఇవ్వటం లేదు.

Sri PILLALAMARRI VENKATESWARLU:— ఈ రాజాలంతా "ఈ డబ్బంతా మేం పెట్టుకుంటాం" అన్నారా ? ఈ స్కీములో అందరు రాజాలుండటానికి గల కారణం ఏమిటి ?

The Hon. Dr. B. GOPALA REDDI:—అవస్యంతో యేమో షికారు అంటె యేమో, అక్కడ wild animals కు సంబంధించిన విషయాలు అన్నీ బాగా తెలుసు కాబట్టి వీరిని nominate చేశాం.

Sri M. NAGI REDDI:— ఈ బోర్డువారు క్రూరమృగాలను సంరక్షించడానికి తీసుకొంటున్న చర్యలు ఏమిటి ? వీళ్లయొక్క కార్యక్రమాలేమిటి ? ఇదివరకు ఏమిచేశారు ? తర్వాత ఈ కమిటీలో సభ్యులందరిని పెద్దపెద్ద రాజాలనూ, తుపాకీ లైసెన్సులుండేటటువంటి వారినే వేసుకొన్నారే ? ఈ లైసెన్సు వేసుకొన్నవాళ్ళు కమిటీలో ఉంటే వీళ్ళయినా కాల్చకుండా ఉంటారనియా ప్రభుత్వ ఉద్దేశ్యం !

The Hon Dr. B. GOPAL REDDI:— ఈ షికారు అంటే ఏమో తెలుసును కాబట్టి దానివల్ల వచ్చేటటువంటి అపాయాలూ, ఉపద్రవాలు అన్నీకూడా వారికి ఎక్కువగా తెలుసు. అందువల్లనే అటువంటివారిని వేసి ఈ indiscriminate

killing of wild animals ఎట్లా అరికట్టాలనే విషయం వారిని అడిగి వారి సలహాలు తీసుకొని ఇదంతాకూడా జాగ్రత్తచేయాలని ప్రభుత్వంవారి ఆలోచన.

Sri B. RAMA REDDI — అధ్యక్షా! క్రూరమృగములు ఎక్కువైతే మనుష్యులకూ, పశువులకూ, కేవలం బాధాకరంగా ఉంటుందే! అటువంటి క్రూరమృగ సంరక్షణ కొరకై ఇంతబాధ ఎందుకో, ఇంతకష్ట మెందుకో సెలవిస్తారా?

The Hon Dr. B. GOPALA REDDI —అదిసరే కొన్నికొన్ని rare animals మృగ్యమై పోతున్నాయి. లోపించిపోతున్నాయి. పూర్వము చిత్తూరు జిల్లాలో ఏనుగులు ఉంటుండేవి. ఇప్పుడు లేకుండా పోయినాయి, అట్లనే ఇండియాలో అనేక అడవుల్లో సింహాలన్నీ ఉండేవి. ఇప్పుడు లేకుండా పోయినాయి. కాబట్టి వీటి నన్నిటినీ preserve చేయాలి. మనకు అనేక రకాలైన పక్షులు ఉన్నై. అవి కూడా నాశనం అయిపోతున్నాయి. వీటి నన్నిటినీ preserve చేయవలసిన అవసరం చాలా వున్నది. ఇది ఒక National Asset

Sri N. K LINGAM.—అధ్యక్షా! ప్రభుత్వమువారు ఇంత డబ్బు ఖర్చుపెట్టి కమిటీలువేసి పరిశోధనలు చేయించడానికి ప్రయత్నిస్తున్నారు, కానీ దీనికంటె ఆ క్రూరమృగములను గానీ జంతువులను గానీ చంపకుండా ఒక చట్టాన్ని చేస్తే బాగుంటుందేమో ఆలోచించారా?

The Hon. Dr. B. GOPALA REDDI – చట్టాలు ఇప్పటికే ఉన్నాయి. దాన్ని అమలుపెట్టడంలో వీరియొక్క సలహాలు తీసుకొంటున్నాం. ఆ మృగాలను చంపకుండా సంరక్షించడానికి అన్నివిధాలా ప్రయత్నం చేస్తున్నాం.

Sri T GOPALAKRISHNA GUPTA – ఈ Wild Animals Preservation Board లో ఉండే సభ్యుల్లో కొందరు wild గా కాక mild గా ఉండేటటువంటివారుకూడా ఉన్నారా? అటువంటివాళ్లుంటే వాళ్ళను తొలగించేదానికి ప్రభుత్వం పూనుకొంటుందా?

The Hon. Dr. B GOPALA REDDI :— Wild గా ఉండేవాళ్ళలో Minister incharge of Forests ఉన్నారు. తర్వాత Senior Professor of Zeology, Andhra University mild గా ఉండేవారు ఉన్నారు.

Sri S. VEMAYYA.— ఇప్పుడు మన రాష్ట్రంలో లేనటువంటి క్రొత్తరకమైన జంతువులను ఇతర ప్రాంతాలనుంచి తెచ్చి ఒక zoo గా ఏర్పాటు చేయడానికి ప్రయత్నం ఉన్నదా?

The Hon Dr. B. GOPALA REDDI.— Next question లో ఆ విషయం వస్తుంది.

*Game sanctuaries.*

520 —

*782 Q – SRI P. VENKATASUBBAYYA :–Will the Hon. the Chief Minister be pleased to state :

whether there is any proposal now with the Government for opening GAME SANCTUARIES in the forests of the State?

The Hon Dr B GOPALA REDDI —
Yes, sir

Sri P. VENKATASUBBAYYA :— మన రాష్ట్రంలో ఎక్కడెక్కడ పెడతారో తెలియచేస్తారా?

The Hon Dr B GOPALA REDDI — గౌరవ సభ్యులు ఊరిదగ్గరే పెడతాము — మా సంగమూరు forest దగ్గర.

Sri V VISWESWARA RAO .— ఇందులో zoo ఏర్పాటు చేయడానికి ప్రయత్నిస్తారా?

The Hon Dr B GOPALA REDDI — ప్రత్యేకంగా చూడవలసి యున్నది. Games sanctuary, national parks వంటివి కొన్ని ఏర్పాటు చేయాలనే ఉద్దేశం ఉన్నది. Vizag లో acquarium పెట్టాలని వున్నది.

Sri P. VENKATASUBBAYYA .— దీనికి సంబంధించిన నియమావళి తెలియచేస్తారా?

The Hon. Dr. B GOPALA REDDI :— అక్కడ కొన్ని మైళ్ళ విస్తీర్ణం కలిగిన అడవిలో ఎవరూ వేటాడకుండా చేయడానికి ప్రయత్నించేసి అడవులు ఎక్కువగా పెంచి మృగాలు అభివృద్ధి కావడానికి ప్రయత్నాలు చేస్తారు. తరువాత అనుకొన్న సంఖ్యకు వచ్చినప్పుడు ఎవరైనా కావాలంటే licence మీద షికారు చేయవచ్చును.

[Note—An asterrisk * at the commencement of a speech denotes revision by the Member]

## *II. ADJOURN MOTIONS Re —*

[1] Rise in the prices of food grains.

[2] Out-break of smallpox at Maddeswaram jatara.

Mr. SPEAKER :— Sri Pragada Kotaiah and Sri Vavilala Gopalakrishnayya have given notice of adjournment motions.

In this connection I wish to bring to the notice of the hon. Members the rule regarding adjournment motion' Rule 129 (3) of our Assembly Rules says :—

'(3) On a day allotted under sub-rule (I) for the voting of demands for grants, no other business shall be taken up before 5 p. m. except with the consent of the Speaker.'

13th March 1956]

So on all days when we have budget discussion it is better no adjournment motions are given, of course except for extraordinary reasons

* Sri VAVILALA GOPALAKRISHNAYYA — అధ్యక్షా ! అయిదు గంటలు తరువాత అధ్యక్షులవారి అనుమతి లేకుండా ఏ business జరుగ కూడదు అన్నారు. అయిదు గంటల తరువాత అధ్యక్షులవారి అనుమతితో ఏ చర్చ నైనా చేయవచ్చు ననే విషయం rule out చేయడం లేదు ఏ తీర్మానాలైనా తమ అనుమతికి పరిమితమయే తీసుకొనివస్తాము. Budget కు నియమించిన time లో కూడా adjournment motion తీసుకోవచ్చును. Rule వున్నమాట నిజమే. Merits of the motion గురించి త్రోసివేస్తే త్రోసివేయవచ్చును. ఈ కారణం మీద త్రోసివేయవలసిన అవసరం లేదు.

Mr SPEAKER — I must also inform the hon Members that the matters which are raised in the adjournment motions can be discussed in the budget discussion under the relevant Demands

The Hon Dr B GOPALA REDDI .— They are not of recent occurrences.

Mr SPEAKER ·— As the Chief Minister says, it is not a a matter of recent occurrence.

Sri VAVILALA GOPALA KRISHNAYYA — ఒకే ఊరిలో 500 మంది చచ్చిపోవడం recent occurrence కాదా ?

Mr SPEAKER · What is your adjournment motion, Mr. Kotiah ?

Sri PRAGADA KOTAIAH ·—Sir, My adjournment motion runs thus .—

"డబ్బు ఉన్నవారు నిలువ చేయడమువల్ల రోజు రోజుకు పెరిగి పోవుచున్న ఆహార ధాన్యాల ధరలు రోజూ కూలినాలి చేసికొని, పొట్ట నింపుకోవలసియున్న లక్షలాది శ్రమజీవులకు అందుబాటులో లేని ఫలితంగా సంభవించిన భయాందోళనలను అదుపులో పెట్టుటకు ప్రభుత్వం చర్యలు తీసుకోనందున యేర్పడిన ప్రజా సంబంధమైన అత్యవసర పరిస్థితులనుగూర్చి చర్చించుటకు యీ సభా కార్యక్రమమును వాయిదా వేయవలసిందిగా కోరుచున్నాను."

Mr. SPEAKER—.This can be discussed in the Revenue Demand.

Sri PRAGADA KOTAIAH ·— ఇంతవరకు జరుగుతున్న పరిస్థితులను గూర్చి వారు ఏమైనా తెలుసుకున్నారేమో? అది అదుపులో పెట్టి రోజుకూలి చేసుకుని బ్రతికేవారికి అందుబాటులో సరుకులు దొరికేట్లా చేయాలని కనీసం ముఖ్యమంత్రిగారిని అడగాలని కోరుతున్నాను.

[13th March 1956

The Hon Dr B GOPALA REDDI :– చాలా విపరీతమైన పరిస్థితిగా వున్నది. ఎక్కువమంది corner చేస్తున్నారని, ధరలు ఎక్కువ అవుతున్నాయనే విషయం తప్పకుండా పరీక్షచేస్తాము. Price linking scheme కావాలి అని నిన్నటివరకు సభ్యులు చెబుతూ వచ్చారు. అప్పుడే ధరలు ఎక్కువ అవుతున్నాయని చెబుతున్నారు.

The position will be constantly reviewed and the Government will watch the situation.

Mr. SPEAKER.–, Mr Vavilala Gopalakrishnayya's adjournment motion is:

> This House stands adjourned to discuss the grave situation arisen out of the smallpox out-break at Maddeswaram jatara and near in Rayadrug taluk by which resulted in 400 deaths for not taking precautionary measures

This can be discussed in the course of the budget discussion. So I rule out both the adjournment motions The House will now proceed to the next item in the agenda

## *III, BUDGET FOR THE YEAR 1956-57 (Contd.)*

Voting of Demands for Grants for 1956-57 [Contd.]

## DEMAND XV-EDUCATION.

The Hon Dr. B. GOPALA REDI :– Mr Speaker, Sir, on the recommendation of the Governor, I beg to move.

That Government be granted a sum not exceeding Rs. 4,78,75,100/– under Demand XV-Education.

అధ్యక్షా, ఈ డిమాండు మొత్తం పెద్దదే అయినా చాలదనే విమర్శ ఉన్నది అని నాకు తెలుసు. 4 కోట్ల 78 లక్షలుపైగా విద్యక్రింద ఈ ప్రభుత్వంవారు ఖర్చు చేస్తున్నారు. ఆ సందర్భములో ప్రభుత్వంవారి పరిశీలనలోవున్న కొన్ని విషయాలను గురించి కొంత క్లుప్తముగా చెప్పాలని వుద్దేశిస్తున్నాను.

* శ్రేయోరాజ్యపు ముఖ్యమైన ఆదర్శాలలో, లక్ష్యములలో ఒకటి సార్వజనీనమైన విద్య. ప్రజలు యావన్మందీ విద్య నలవఱచు కొనినప్పుడు ప్రజాస్వామ్యమనేది వాస్తవంగా, స్థిరంగా సిద్ధిస్తుంది. స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత దేశంలో ప్రతిరాష్ట్రము విద్యావ్యాప్తికై తీవ్రంగా కృషిచేస్తోంది. ఈ విషయంలోనూ ఆంధ్ర రాష్ట్రం వెనుకబడి యుండలేదు. మన ఆదాయములో ఇంచుమించు నాల్గవవంతు ప్రతి

* An English version of the speech is printed as appendix 'A' at page 202 infra

13th March 1956] (Dr. B. Gopala Reddi)

సంవత్సరమూ విద్యపై ఖర్చుచేస్తున్నాము. ఖర్చుఇంత హెచ్చుగాఉన్నప్పటికి చదువుకొనే వయస్సుగల బాలబాలికలలో 100 కి 50 మందికే ప్రాథమిక విద్య లభిస్తోంది. ఇక సెకండరీ విద్య 100 కి షుమారు 10.4 మందికే లభిస్తోంది.

2. మన ప్రథమ పంచవర్ష ప్రణాళిక త్వరలో ముగింపుకు రాబోతోంది. దాని స్థానే ద్వితీయ పంచవర్ష ప్రణాళిక 1956 - 57 నుండి ప్రారంభ మవుతుంది. అయితే వివిధ కారణాల మూలంగా ప్రథమ ప్రణాళికవలన విద్యారంగంలో చెప్పుకో తగిన ప్రయోజనం ఫలించలేదు. 1953 అక్టోబరులో మన రాష్ట్రం మనకు ఏర్పడిన తర్వాతనే మనకున్న సాధనసంపత్తిని, మన అవసరాలను ప్రత్యేకంగా, సమగ్రంగా సమీక్షించు కొనుటకు అవకాశం చిక్కింది. ఈ విషయాలను, రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని లెక్కలోకి తీసుకొని, తదనుగుణంగా ద్వితీయ ప్రణాళిక గడువులో విద్యాభివృద్ధికై ప్రభుత్వం కొద్దిపాటి స్కీము నొకదానిని తయారుచేసింది. దీని అంచనా ఖర్చు రు. 8 కోట్లు.

3. కులమత ఆర్థిక భేదములతో ప్రసక్తి లేకుండా పిల్లలందరికు, వయోజనులకు 8 వ ఫారం వరకు వుచిత విద్యను సమకూర్చ వలెనని ప్రభుత్వం తీవ్రంగా యోచిస్తోంది. ఇట్టి ఏర్పాటు మూలంగా వ్యవసాయం చేసుకొనేవారికి ఇతర వర్గాలకు చాలామందికి ఎంతో అవసరమైన సహాయం చేకూరుతుంది. రాష్ట్రంలో విద్యావంతుల సంఖ్య హెచ్చుతుంది.

## ప్రా థ మి క వి ద్య

4. ప్రాథమిక విద్యారంగంలో పురోగమనం చురుగ్గా సాగుతోంది. ఈ సంవత్సరపు ఆరంభంలో వివిధ యాజమాన్యముల క్రింద 17,664 ప్రాథమిక పాఠశాలలున్నవి. ఇప్పటి సంఖ్య 17,935. పాఠశాలల్లోని బాలుర సంఖ్య 10.32 లక్షలు. బాలికల సంఖ్య 6.42 లక్షలు.

5. ప్రథమ పంచవర్ష ప్రణాళిక కింద రాష్ట్రంలో 1,592 క్రొత్త పాఠశాలలను నెలకొల్పాలని అనుకొన్నాము. 1954 - 55 చివరకు 751 పాఠశాలలు నెలకొల్పబడినవి. ఈసంవత్సరము 446 పాఠశాలలు ఏర్పాటు చేయబడినవి. ఇక 395 పాఠశాలలను ఏర్పరచ వలసి యున్నది. క్రొత్తగా రాష్ట్రం ఏర్పడినందువల్ల కలిగిన ఇబ్బందుల మూలంగా ఈ కొరత ఏర్పడింది.

ఏకోపాధ్యాయ పాఠశాలలు:—

6. విద్యావంతులైన నిరుద్యోగుల సహాయార్థం కేంద్ర ప్రభుత్వం తలపెట్టిన స్కీముక్రింద, 1955—56 లో మన రాష్ట్రానికి 1,000 మంది ఉపాధ్యాయుల నియామకం మంజూరు చేయబడింది. వీరిలో 799 మంది 1955 డిసంబరు ఆఖరువరకు నియమింపబడ్డారు. వీరికింత ఖర్చుయావత్తు కేంద్ర ప్రభుత్వమే భరిస్తోంది.

ప్రాతిపదిక విద్య :—

7. 61 ప్రాథమిక పాఠశాలలు ప్రాతిపదిక పాఠశాలలుగా మార్చబడినవి. ఈ సంవత్సరం రెండు ప్రభుత్వ ప్రాతిపదిక శిక్షణాలయాలుకూడా ప్రారంభింప బడినవి.

(Dr. B. Gopala Reddi) [13th March 1956

అదనపుఖర్చు, తగిన సిబ్బందిలేమి మొదలగు కారణాల మూలంగా ఈ కార్యక్రమం కొంచెం తగ్గుస్థాయిలోనే జరగక తప్పదు.

కుప్పుస్వామి కమిటీ సిఫార్సులు :—

8. ప్రాథమిక పాఠశాలలన్నిటినీ ఒకేఒక యజమాన్యంక్రిందకు తీసుకొని రావలె నని, అందుకు ప్రాతిపదికగా ఇప్పటి 'ఎయిడెడ్' పద్ధతిని రద్దుచేయవలెనని కుప్పుస్వామి కమిటీ సిఫార్సు చేసింది. 'ఎయిడెడ్' విధానాన్ని రద్దుచేయటానికి ఆర్థికమైన చిక్కులే కాక వివిధమైన ఇతర అవరోధాలున్నవి. అయినప్పటికి 1956—57 నుండి నెల్లూరు జిల్లాలోని 'ఎయిడెడ్' ప్రాథమిక పాఠశాలలను ప్రభుత్వమే నిర్వహించేందుకు ఏర్పాటు చేయబడింది. ఈ జిల్లాలో అనుభవం ప్రోత్సాహకరంగా వుంటే, మిగతా జిల్లాలలోకూడా ఈ కార్యక్రమాన్ని త్వరగా అమలు జరుపవచ్చు.

## ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

9. 1955—56 లో పాఠశాలల్లో 6—11, 11—14, వయస్సుఉన్న బాలబాలికలు 14.60 లక్షలని, 4.05 లక్షలని అంచనా వేయబడింది. ప్రణాళిక కాలంలో యీ వయస్సుల పిల్లల సంఖ్యను 100 కి 15 మందికి, 20 మందికి పెంచవలెనని సంకల్పం. ఇలా జరిగితే ప్రణాళిక ముగింపునాటికి 6—11 వయస్సు పిల్లలు కొత్తగా 2.19 లక్షలమంది, 11—14 వయస్సు పిల్లలు కొత్తగా 81,000 మంది పాఠశాలల్లో చేరివుంటారు.

ప్రణాళికక్రింద 60 కొత్త పాఠశాలలను, 1,710 కొత్త సెక్షన్లను ఏర్పరచి, ఇప్పటి ఉన్నత ప్రాథమిక పాఠశాలల్లో నూటిని మాధ్యమిక పాఠశాలలుగా మార్చాలని వున్నది. అయితే యీ సంకల్పం ఆర్థిక పరిస్థితిపై ఆధారపడి వుంటుంది.

## సెకండరీ విద్య

10. రాష్ట్రంలో ఇప్పుడు 675 హైస్కూళ్లు వున్నవి. వీటిలో ప్రభుత్వ యాజమాన్యంక్రింద 32, స్థానిక సంస్థలకింద 519, మిగతా 124 ప్రైవేటు సంస్థలకింద వున్నవి.

## స్థానిక సంస్థల పాఠశాలలకు విరాళాల సేకరణ

11. స్థానికంగా వున్న కొంతమంది దాతలు, సంఘాలు విరాళాలు ఇస్తామని చేసిన వాగ్దానాల ఫలితంగా స్థానిక సంస్థలు ప్రారంభించిన సెకండరీ పాఠశాలల్లో చాలావాటివిషయం సమస్యగా పరిణమించింది. వాటి నికముందుకూడా నడిపే సందర్భం గురించి ప్రభుత్వం ఖచ్చితంగా వుత్తర్వులు జారీచేయవలసివచ్చింది. ఈ ప్రస్తావన గత సంవత్సరం చేశాను. ఈవుత్తర్వుల ఫలితంగా ఇప్పటివరకు రు. 10.86 లక్షల మొత్తం సేకరింపబడింది. మిగతా మొత్తం యీ ఏడాది ముగింపులోపు వసూలు కావచ్చు. అలా కాని పక్షంలో, ఆయా సంస్థలపట్ల ఖచ్చితమైన చర్యలు తీసుకోనవలసి వస్తుంది.

## సెకండరీ విద్యాసంఘపు సిఫార్సులు

12. హైస్కూళ్ళ కోర్సు మూడేళ్ళపాటు వుంచవలెనని, వృత్తివిద్యతో సహా అన్ని విషయాల్లోనూ విద్యార్థులకు బోధన గరపవలెనని [illegible]

13th March 1956]    (Dr. B, Gopala Reddi)

స్కూళ్ళనుంచి బైటకురాగానే తగిన సంపూర్ణ సామర్థ్యమును పొందగలరని సెకండరీ విద్యాభివృద్ధి సంఘం సిఫార్సుచేసింది. ఇందునిమిత్తం క్రొత్తగా హయ్యర్ సెకండరీ పాఠశాలలనైనా ఏర్పాటుచేయాలి. లేదా వున్న హైస్కూళ్ళను హయ్యర్ సెకండరీ స్కూళ్ళగానైనా మార్చాలి. ఈ మార్పుకు ఇప్పటి హైస్కూలు శిక్షణకాలాన్ని మరొక ఏడాదికి పొడిగించి, పాఠ్య విషయాలను సవరించాలి. అన్ని రాష్ట్రప్రభుత్వాలు అమలు జరుపవలసిన భారీ సంస్కరణ ఇది. అయితే అమలుజరిపే వేగంలో ఆయా రాష్ట్రాలమధ్య వ్యత్యాసాలు ఉంటవి.

**13.** సెకండరీ విద్యాసంఘం సిఫార్సుచేసిన పెద్దసంస్కరణలను అమలు జరపడానికి రాష్ట్రప్రభుత్వం యీ ఏడాది పూనుకొన్నది. 15 హైస్కూళ్ళను సకలార్థక పాఠశాలలుగా మార్చటానికి, యీ పాఠశాలల్లో విజ్ఞానబోధనకు, గ్రంథాలయాల అభివృద్ధి అదనపు సౌకర్యాలను సమకూర్చటానికి ఏర్పాటుచేసింది. ఇదికాక, 90 స్కూళ్లలో బోధనాభివృద్ధి, 100 స్కూళ్ళలో గ్రంథాలయాలు, 20 మాధ్యమిక పాఠశాలల్లో వృత్తివిద్యను ప్రవేశపెట్టుట మొదలగు కార్యక్రమాలుకూడా ఏర్పాటుచేయబడుచున్నవి. పాఠశాలలు తెఱచిన కొంతకాలానికి యీ సంస్కరణలను ప్రవేశపెట్టినందువలన, అమలు జరుపుటలో కొన్ని యిబ్బందులవలన, యీ ఏడాది వీటిపై తగు ఖర్చు చేయటానికి వీలు లేకపోయింది. తత్ఫలితంగా కేంద్రప్రభుత్వపు పూర్తిగ్రాంటును వినియోగించుకొనటానికి సాధ్యంకాలేదు. అయితే వచ్చే సంవత్సరంలో, తదనంతర సంవత్సరాల్లో కూడా తమ సహాయాన్ని కొనసాగిస్తూనే ఉండవలసిందిగా కేంద్ర ప్రభుత్వాన్ని కోరటమైనది.

## ఉపాధ్యాయులకు శిక్షణ

**14.** ప్రాథమిక పాఠశాలల్లో బోధనను అభివృద్ధి పఱచటానికిగాను, హయ్యర్ ఎలిమెంటరీ గ్రేడ్ ట్రైనింగ్ రద్దు విధానాన్ని ప్రభుత్వం అంగీకరించింది. సెకండరీ గ్రేడ్ టి. ఎస్. ఎల్. సి శిక్షణపొందినవారు ఇందుమూలంగా ప్రాథమిక పాఠశాలల్లో నియామకానికి లభిస్తారు. ఈ విధానాని కనుగుణంగా, ఇప్పటి ఎలిమెంటరీ గ్రేడ్ ట్రైనింగ్ సెక్షన్లలో 100 కి 50, 1955—56 లో సెకండరీ గ్రేడ్ ట్రైనింగ్ సెక్షనుగా మార్చబడినవి. మిగతా సెక్షన్ల మార్పిడి వచ్చే రెండుమూడు సంవత్సరాల్లో పూర్తి అవుతుంది. ఇంకా బోధనను అభివృద్ధి పఱచేందుకు, శిక్షణపొందిన వారిని తగినంతమందిని సమకూర్చుటకు ప్రభుత్వం ట్రైనింగ్ కాదలచినవారికి ఇప్పటికన్న ఎక్కువ అర్హతలను నిర్దేశించింది. సెకండరీగ్రేడ్ ట్రైనింగ్ కాలాన్ని (అన్నిస్కూళ్ళలో కాదు) రెండేళ్ళనుంచి ఒకఏడాదికి తగ్గించటానికి నిశ్చయించింది. దీనికి నాందిగా 1956—57 నుంచి 8 ప్రభుత్వ సంస్థల్లో ఒకఏడాది ట్రైనింగ్ విధానం ఆరంభించ బడుతుంది. ఈ ఏడాదికోర్సు విషయంలో ఇంటర్మీడియట్ పరీక్ష నెగ్గినవారికి లేదా పూర్తిచేసిన వారికి, ఎస్. ఎస్. ఎల్. సి లో హెచ్చు మార్కులు పొందిన వారికి ప్రవేశమప్పుడు ఆధిక్యత చూపబడుతుంది.

**15.** ఖర్చు తగ్గింపుకొఱకుగాను, సెకండరీగ్రేడ్ ట్రైనింగ్ స్టయిఫెండ్లు షెడ్యూల్డు కులాలకు, షెడ్యూల్డ్ జాతులకు, వెనుకబడిన వర్గాలకు చెందినవారికి, శిక్షణపొందే స్త్రీలందఱకూ పరిమితం చేయబడినవి. అయితే నిర్ణీతమైన ఎనిమిది సంస్థలో ఒక ఏడాది విధానం ప్రకారం శిక్షణపొందే వారందఱకూ మట్టుకు స్టయిఫెండ్లు ఇవ్వబడుతవి,

(Dr. B. Gopala Reddi) [13th March 1956

## విద్యా సలహా సంఘం

16. రాష్ట్రంలోని విద్యావ్యాప్తికి, అభివృద్ధికి సంబంధించిన విషయాలగురించి ప్రభుత్వానికి సలహా లిచ్చేందుకుగాను విద్యాసలహా సంఘమను ఒక ప్రత్యేక సంఘాన్ని ప్రభుత్వం నియమించింది. విద్యాశాఖ మంత్రి, విద్యాశాఖ అధికార్లు, రాష్ట్రంపు రెండు విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులు, కొన్ని నిర్ణీత పాఠశాలల ప్రధానోపాధ్యాయులు, ఇతర విద్యావేత్తలు యీ సంఘానికి సభ్యులుగా ఉంటారు. ఈ సంఘం యీ ఏడాది రెండుసార్లు సమావేశమై, చాలా సిఫార్సులను చేసింది. వాటిలో అత్యంత ముఖ్యమైన వాటిని పేర్కొంటున్నాను.

1. మాధ్యమిక పాఠశాలస్థాయికి విద్యార్థులను ప్రవేశపెట్టేప్పుడే వారి అర్హత, వయస్సు, విషయాలనుగురించి దిగువ చెప్పిన నియమాలను నిర్దేశించటం.

(i) ప్రస్తుతం ప్రైవేటుగా చదువుకొన్న విద్యార్థులు యూడవ ఫారంవటుకు, ప్రవేశ పరీక్షకు లోబడి లేక లోబడకుండా, చేర్చుకోబడు తున్నారు. అట్టి విద్యార్థులు అవసరమైన అర్హతను పొందియుండరు. ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్ష సమయానికి వారిలో చాల మందికి 15 ఏళ్ళ వయస్సు ఉండదు.

(ii) కాబట్టి ప్రైవేటుగా చదువుకొన్న ఏ విద్యార్థినీ, 15-8-1956 న 11 ఏళ్ళ వయస్సు పూర్తి అయివుంటే తప్ప, 1956-57 నుంచి రెండవఫారంకన్న ఎక్కువ తరగతికి చేర్చుకొనకూడదు. ఈ ఏడాది మొదటిఫారంలో చేరదలచుకునే ప్రైవేటు విద్యార్థికి 15-8-1956 నకుపదేళ్లు పూర్తిఅయి వుండాలి.

(iii) 1957-58 విద్యా సంవత్సరంనుంచి, తదనంతరమూ ఆయా సంవత్సరాల ఆగస్టునెల 15-వ తేదీన 10 ఏళ్ళు పూర్తిఅయివుంటే తప్ప, ఏ ప్రైవేటు విద్యార్థినీ మొదటి ఫారంలో చేర్చుకొనకూడదు.

2. స్కూళ్ళలో తగిన సాధనపరికరాలనుసమకూర్చి, ఎక్కువ అర్హతలున్న ఉపాధ్యాయులను నియమించి, ఉపాధ్యాయుల ఉద్యోగ స్థితిగతులను బాగుపరచి, ప్రైవేటు ట్యూషన్లను కొన్ని అంశాలకు పరిమితంచేసి బోధనాస్థాయిని అభివృద్ధి పరచటం.

3. తప్పిన విద్యార్థుల ప్రవేశాన్ని పరిమితం చేయుట వంటి విధానాలద్వారా సెకండరీస్కూళ్ళ విద్యార్థుల స్థాయిని అభివృద్ధిపరచుట.

ప్రభుత్వం వీటిలో కొన్నిటిని అమలుజరిపింది. మిగతావి పరిశీలనలో ఉన్నవి.

## హింది

17. హైస్కూళ్ళలో హింది 1955-56 నుంచి నిర్బంధపుటంశాల్లో ఒకటిగా చేయబడింది. కేంద్ర ప్రభుత్వ సలహా ప్రకారం రాష్ట్ర ప్రభుత్వం ప్రజల్లో హింది వ్యాప్తికి 1955-56 లో దిగువ స్కీములను మంజూరు చేసింది.

13th March 1956] (Dr. B. Gopala Reddi)

| | | | ఒకేసారి ఖర్చు |
|---|---|---|---|
| | | రు. | రు. |
| క. | హిందీ విశారద విద్యాలయాల ప్రోత్సాహము ... | 33,000 | — |
| గ. | విజయవాడలో హిందీ టైపు రైటింగ్, షార్టుహాండ్ సంస్థ నిర్వహణ ... | 5,800 | ౪,200 |
| చ. | 20 హిందీ ప్రేమీ మండలులకు సహాయం ... | 12,000 | — |
| జ. | ప్రచార విద్యాలయాల నేర్పాటు ... | 9,000 | — |

ఈ ఖర్చులో 100 కి 66 పాళ్ళు కేంద్ర ప్రభుత్వం భరిస్తోంది. మిగతా భాగం రాష్ట్ర ప్రభుత్వమూ, విజయవాడలోని ఆంధ్ర హిందీ ప్రచారసభ కలసి సమానంగా భరిస్తవి. 1956–57 లో యీ స్కీములను కొనసాగించే విషయమై కేంద్ర ప్రభుత్వంతో విచారించాలి.

## సంస్కృతం

18. సంస్కృతభాషా వ్యాప్తి విషయంలో రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ చూపి, కొన్ని ముఖ్యమైన కార్యక్రమాలను ప్రారంభించింది.

19. (క) పెద్దతరగతుల్లో తెలుగును బోధించేవిషయంలో సంస్కృతపండితులపట్ల ప్రస్తుతము నిర్దేశించినఆంక్ష తొలగింపబడినట్టే విద్యాప్రవీణ లేక విద్వాన్ లేక శిరోమణి శిక్షణ పొందిన సంస్కృత పండితుడు తెలుగు భాషలో ఉభయభాషా ప్రవీణ గాని లేక భాషాప్రవీణగాని లేక విద్వాన్ తెలుగు గాని పొందియున్నట్లయితే, లేక పొందునట్లయితే, అతనికి మూడు అడ్వాన్సు ఇంక్రిమెంట్లు ఇవ్వబడుతవి. అలాగే, సంస్కృతంలో ప్రాచ్య పరీక్ష నెగ్గిన తెలుగు పండితునకు కూడా మూడు అడ్వాన్సు ఇంక్రిమెంట్లు ఇవ్వబడుతవి. ఇప్పుడు 85 పాఠశాలలలో సంస్కృతం బోధింపబడుతోంది. వీటిలో 82 బాలుర పాఠశాలలు. 3 బాలికలవి. 1956–57 లో ఇంకొక 11 స్కూళ్ళలో 5 బాలికలకు, 6 బాలురకు సంస్కృత బోధనను ప్రవేశపెట్టవలెనని ప్రభుత్వం నిర్ణయించింది.

## ప్రాచ్య సంస్థలు

19. (గ) రాష్ట్రంలో 55 ప్రాచ్య సంస్థలున్నవి. ఇవి కేవలం ప్రాచ్య భాషలనే బోధిస్తవి. వీటిలో 49 సంస్థలో సంస్కృతం చెప్పుతారు. ఈ 49 లో ప్రాథమిక పాఠశాలలు 12, మాధ్యమిక పాఠశాలలు, హైస్కూళ్ళు 28, కళాశాలలు 9 ప్రభుత్వం ఒక్క సంస్థను మట్టుకే నిర్వహిస్తోంది. అది విజయనగరంలోని ఎం. ఆర్. సంస్కృత కళాశాల మరియు హైస్కూలు. ప్రస్తుతం ప్రాథమిక పాఠశాలల్లో 640 మంది, సెకండరీ స్కూళ్ళలో 875 మంది, ప్రాచ్యకళాశాలల్లో 404

(Dr. B. Gopala Reddi) [13th March 1956

మంది విద్యార్థులు సంస్కృతం చదువుతున్నారు. జిల్లాబోర్డు సంస్థలకు, ప్రైవేటు సంస్థలకు ప్రభుత్వం సహాయంచేస్తున్నది. ఓరియంటల్ (ప్రాచ్య) సెకండరీ స్కూళ్ళలో 6 వ ఫారము వరకు చదివే విద్యార్థులందరికీ 1956-57 నుంచి ఉచితవిద్య గరపబడాలని ప్రభుత్వం ఇటీవల ఆదేశించింది. తల్లి తండ్రుల ఆదాయం ఏడాదికి రు. 1,800 కు మించకుండా ఉంటే విజయనగరంలోని ఎం ఆర్. ప్రాచ్య కళాశాల సంస్కృత విద్యార్థులకు రు. 1,000 వరకు స్కాలర్ షిప్పులు ఇవ్వబడుతున్నవి.

## సంస్కృత విశ్వ పరిషత్తు

20. అఖిల భారత సంస్కృత విశ్వ పరిషత్తు నాల్గవ సమావేశాన్ని మన రాష్ట్రంలో జరిపించుట గౌరవము మనకు లభించింది. ఈ సమావేశం 1955 నవంబరులో 11 నుండి 13 వరకు తిరుపతిలో వైభవంగా జరిగింది. రాష్ట్రపతి, వివిధరాష్ట్రాల గవర్నర్లు తదితర ప్రసిద్ధులు సమావేశ కార్యకలాపాల్లో పాల్గొన్నారు. దేశంలో సంస్కృత భాషాభివృద్ధికి చేయవలసిన కార్య క్రమాలగురించి తగు సలహాల నిచ్చారు. అన్నివిధాలా యీ సమావేశం జయప్రదమైనదని ప్రశంసించారు. రాష్ట్ర ప్రభుత్వం గర్వించదగిన విషయం.

## ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

21. ప్రస్తుతం 14—17 వయస్సుగల విద్యార్థులు 1,43,355 మంది పాఠశాలల్లో చదువుకుంటున్నారు. ఇంకా 100 కి 20 మందిని అనగా 28,700 మందిని ప్రణాళిక కాలములో పాఠశాలల్లోకి తీసుకురావాలని ప్రణాళిక లక్ష్యం. ఈ వయస్సుఉన్న పిల్లలు స్కూళ్ళలో ఇప్పుడు 100 కి 10.37 మంది ఉన్నారు. ప్రణాళిక ముగింపునాటికి 100 కి 11.7 మంది ఉంటారు.

22. ప్రణాళికకాలంలో 15 పాఠశాలను సకలార్థక పాఠశాలలుగా మార్చాలని 80 హైస్కూళ్ళను హాయ్యరు సెకండరీ స్కూళ్ళగా మార్చాలని సంకల్పం. క్రొత్తగా 5 హాయ్యర్ సెకండరీ స్కూళ్ళను, 20 హైస్కూళ్ళను, ఉన్న స్కూళ్ళలో క్రొత్తగా 620 సెక్షన్లను ఏర్పాటు చేయాలనికూడా ఉన్నది. కాని యీ స్కీములను ప్రతి ఏడాది జరపటమనేది ఆర్థిక స్థితిగతులపై ఆధారపడివున్నది.

## విశ్వ విద్యాలయాలు

23. విశ్వ విద్యాలయాలకు 1955—56 గడ్డు సంవత్సరం. సెకండరీ విద్య క్రొత్త స్కీము ఫలితంగా, ప్రస్తుతం ఇంటర్మీడియట్ విధానం స్థానే మూడేళ్ళ డిగ్రీ కోర్సును విశ్వ విద్యాలయాలు ఏర్పాటు చేయవలసి వచ్చింది. ఆంధ్ర, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయాలు రెండూ యీ యావద్భారత విధానాన్ని అనుసరించటానికి నిశ్చయించినవి. 1956-57 నుంచి ప్రీ - యూనివర్సిటీ కోర్సును ప్రారంభించాలని సంకల్పించినవి.

## ద్వితీయ ప్రణాళిక

24. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కింద శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయ అభివృద్ధి స్కీముకుగాను రు. 35.0 లక్షల మొత్తం కేటాయించాలని ఉద్దేశింప బడింది.

13th March 1956] (Dr. B. Gopala Reddi)

పెట్టుబడి ఖర్చులో ఇది రాష్ట్ర ప్రభుత్వపు వాటా. మామూలు సాంవత్సరిక నిర్వహణ గ్రాంటు రు. 3.5 లక్షలను యీ విశ్వవిద్యాలయం పొందుతూనే ఉంటుంది.

25. ద్వితీయ ప్రణాళికకాలంలో ఆంధ్ర విశ్వవిద్యాలయపు పెట్టుబడి కార్యక్రమాల సందర్భంలో ప్రభుత్వపువాటా కింద రు. 10.0 లక్షల మొత్తం ఉద్దేశింపబడింది.

## ఆర్ట్సు, సైన్సు కళాశాలలు

26. రాష్ట్రంలో 31 కళాశాలలున్నవి. వీటిలో పురుషులకు 28, స్త్రీలకు 3. వీటిలో ఆరు ప్రభుత్వ కళాశాలలు (పురుషులకు 5, స్త్రీలకు-1). ఎయిడెడ్ కళాశాలలు 25 (పురుషులకు-23; స్త్రీలకు-2). 29,513 మంది విద్యార్థులు, 1,872మంది విద్యార్థినులు కళాశాలలో చదువుతున్నారు.

27. ద్వితీయ ప్రణాళికకాలంలో క్రొత్తగా ఏకళాశాలను తెరువాలని ప్రభుత్వానికిలేదు. తగిన సాధనపరికరాలను సమకూర్చి, అవసంగా కోర్సులను ప్రారంభించి ఉన్న సంస్థలను సరిగా అభివృద్ధిచేయాలని ప్రభుత్వసంకల్పం.

28. ప్రణాళికకాలంలో ప్రభుత్వం తలపెట్టుతున్న భవన నిర్మాణ కార్యక్రమం శ్రీకాకుళంలోని ప్రభుత్వ ఆర్ట్సు కళాశాలలకు క్రొత్త కట్టడాలనిర్మాణం.

29. ప్రైవేటు ఆర్ట్సు కళాశాలలకు నిర్మాణాలు, బోధన, సామగ్రి, సందర్భాల్లో ఆర్థిక పరిస్థితికనుకూలంగా ప్రభుత్వం సహాయం చేస్తూనే వున్నది.

## సాంకేతిక విద్య

30. వాల్తేరు ఇంజనీరింగ్ కళాశాలకు, కాకినాడ, అనంతపురం ఇంజనీరింగ్ కళాశాలల్లో ఏర్పాటు చేయబడిన సంక్షిప్త డిప్లొమాకోర్సులకు కేంద్ర ప్రభుత్వం ఇంకా సహాయాన్ని మంజూరుచేయలేదు. అయినప్పటికి రాష్ట్ర ప్రభుత్వం 1956-57బడ్జెట్‌లో వీటికిగాను ఖర్చు కేటాయించింది.

31. అనంతపురం ఇంజనీరింగ్ కళాశాల విస్తరణ కార్యక్రమం చురుగ్గానే సాగుతోంది. కాకినాడ ఇంజనీరింగ్ కళాశాల క్రొత్తకట్టడాల నిర్మాణం ఆరంభమైంది. ఈ రెండుకళాశాలల అభివృద్ధికిగాను యీ సంవత్సరం కేంద్ర ప్రభుత్వం రు. 6.5 లక్షల వరకు గ్రాంట్లనిచ్చింది, వచ్చే సంవత్సరంలోకూడా ఇదే మొత్తం మంజూరు కావచ్చు.

32. స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత యువతీయువకుల సైనికశిక్షణ చాలా ముఖ్యమైనదిగా పరిగణించబడింది. ఈ లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకొని, యువతీ యువకుల్లో సంఘీభావాన్ని, దేశభక్తిని, నాయకత్వానికి కావలసిన శక్తిని పెంపొందించాలని రాష్ట్రాలన్నిటిలోనూ కళాశాల విద్యార్థులకు ఎన్. సి. సి. సీనియర్ దళాలు, హైస్కూలు విద్యార్థులకు ఎన్.సి.సి. జూనియర్‌దళాలు, ఎ.సి.సి. దళాలు ఏర్పాటుచేయబడినవి. మన

(Dr. B. Gopala Reddi) [13th March 1956

## ఎన్. సి. సి.

33. పూర్వ సంవత్సరంవలెనే ఎన్.సి.సి. మీద రు. 4.05 లక్షల మొత్తం ఖర్చు చేయబడింది. 1955-56 లో రు. 3.72 లక్షల అదనపు ఖర్చుతో యీ దిగువ అదనపు దళాల ఏర్పాటు మంజూరు చేయబడింది.

1. స్వతంత్ర పదాతి దళాలు ... 3
2. గుంటూరులో వైద్యదళం ... 1
3. ఆర్టిలరీ బాటరీ దళం ... 1
4. ఇంజనీరింగ్ దళాలు ... 2
5. సిగ్నల్ సెక్షన్ ... 1
6. ఆర్మర్డ్ సెక్షన్ ... 1
7. జూనియర్ దళపు ట్రూపులు ... 60

బాలురకు ... 40
బాలికలకు ... 20

ఒక సబ్-ట్రూప్ బాలికల డివిజన్ (సీనియర్ శాఖ)

పై అదనపు దళాలతో సహా మన రాష్ట్రంలో ప్రస్తుతమున్న ఎన్.సి.సి. దళాల వివరాలు ఇలా ఉన్నవి.

| | బాలురు | | | బాలికలు | | |
|---|---|---|---|---|---|---|
| | డివిజన్లు | ఆఫీసర్లు | కేడెట్లు | డివిజన్లు | ఆఫీసర్లు | కేడెట్లు |
| సీనియర్ | 4 | 54 | 2185 | 2 | 4 | 120 |
| జూనియర్ | 5 | 59 | 5607 | 2 | 24 | 720 |
| మొత్తం | 9 | 113 | 7[illegible]92 | 4 | 28 | 840 |

ప్రస్తుతం సీనియర్ డివిజన్ ఎన్. సి. సి. దళాలు 19 కళాశాలల్లో మాత్రమే పనిచేస్తున్నవి.

## ఎ. సి. సి.

34. ప్రస్తుతం 280 ఎ.సి.సి. సెక్షన్లు పనిచేస్తున్నవి. ప్రతి హైస్కూలులో ఒక సెక్షన్ చొప్పున వీటిలో బాలికల సెక్షన్లు 51. బాలుర సెక్షన్లు 229. 1955-56 లో ఎ.సి.సి. లో 300 అదనపు ఉపాధ్యాయుల శిక్షణను ప్రభుత్వం మంజూరు చేసింది. ఇందుకు ఖర్చు రు. 89,600 లు.

## ద్వితీయ ప్రణాళిక

35. ద్వితీయ ప్రణాళిక కాలంలో ఎన్.సి.సి. విస్తరణకు ఎట్టి ఖర్చులమైనప్పటికీ మంజూరు చేయబడలేదు. ఎ.సి.సి. విషయంలో 1955-56 నుండి [illegible]

13th March 1956] (Dr. B. Gopala Reddi)

కాలానికి ప్రతి సంవత్సరం 200 ఉపాధ్యాయులు, 10,000 బాల కేడెట్ల శిక్షణ ఆమోదింప బడింది. ఇందుమూలంగా చాల హైస్కూళ్ళకు ఎ.సి సి. సౌకర్యాలు చేకూరుతవి.

వీటి ఖర్చు ఇలా ఉంటుంది :—

| | | |
|---|---|---|
| 1955–56 | రు. | 34,965 |
| 1956–57 | | 53,565 |
| 1957–58 | | 72,160 |
| 1958–59 | | 90,765 |
| 1959–60 | | 1,09,365 |

ఆర్థికపరిస్థితి ఇబ్బందిగా ఉన్నందువలన 1956-57 లో ఎన్.సి.సి. ఎ.సి.సి. విస్తరణకు రు. 1.00 లక్ష మొత్తం కేటాయింపబడినది.

## స్కౌట్లు, గైడ్లు

36. విద్యార్థులలో క్రమశిక్షణను, నాయకత్వానికి కావలసిన అర్హతను సంపాదించటంలో స్కౌట్ గైడ్ ఉద్యమానికి ఎంత ముఖ్యస్థానమున్నదో నొక్కి చెప్పనక్కర్లేదు. భారతస్కౌట్, గైడ్ల సంఘం ప్రభుత్వంచే గుర్తింపబడిన సంస్థ. దీని శాఖలు అన్ని రాష్ట్రాల్లోను ఉన్నవి.

రాష్ట్రంలో 11,282 మంది స్కౌట్లుఉన్నారు. 3,119 మంది గైడ్లు ఉన్నారు. సెకండరీ స్కూళ్ళలో 242 మంది స్కౌటు మాష్టర్లు, 1,246 కబ్ మాష్టర్లు ఉన్నారు. 1955-56లో భారత స్కౌటు మాష్టర్లు 1,246 కబ్ మాష్టర్లు ఉన్నారు. 1955-56లో భారత స్కౌట్లు గైడ్లు సంఘానికి రు. 34,000 ల గ్రాంటు మంజూరు చేయబడింది. ఇందులో రు. 19,000 లు సంవత్సరపు రికరింగ్ గ్రాంటు మిగతాది ఒకేసారి గ్రాంటు. 1955-56 లో స్కౌట్ మాష్టర్లు గైడ్ కేప్టన్లకు 33 శిక్షణ శిబిరాల నిర్వహణ ప్రభుత్వం ఆమోదించింది. వీటిలో ఆరు శిబిరాలు గైడ్ కేప్టన్ల శిక్షణకు ప్రత్యేకించబడినవి, వివిధ సెకండరీస్కూళ్ళలో స్కౌటుసంస్థ ఎ. సి. సి.ల ఏర్పాటును ప్రోత్సాహ పరచేందుకు స్కౌటు మాష్టర్లగా లేక ఎ. సి. సి. ఆఫీసర్లగా పూర్తిగా అర్హత పొందిన ఉపాధ్యాయులకు దుస్తులు కొనుగోలుకై నెలకు రు. 5 ల చొప్పున ఏడాదికి రు. 15 ల చొప్పున అలవెన్సును ప్రభుత్వం మంజూరు చేసింది. అయితే ఇందుకు ఒకషరతు ఉంది. పదిస్కౌట్లకుగాని పది గైడ్లకుగాని తక్కువకాని ఒక పెట్రోల్ నైనా కనీసం వారు నిర్వహించాలి.

## సంస్కృతి, కళల అభివృద్ధి

37. సంగీత నాటక అకాడమీ లలిత కళా అకాడమీ సాహిత్య అకాడమీలకు రాష్ట్రంలో శాఖలను ఏర్పాటుచేసే విషయమై ప్రభుత్వం యోచిస్తోంది.

రాష్ట్రంలో ఆటలయందు ఆసక్తిని పెంపొందించేందుకు ప్రభుత్వం రాష్ట్రంలోని ఆటల సంఘలకు తగినవారికి ధనసహాయం చేస్తోంది.

(Dr. B. Gopala Reddi) [13th March 1956

38. రాష్ట్రంలోని విద్యార్థులలో క్రమశిక్షణ, విద్యాస్థాయి క్షీణిస్తున్నదని అందరూ అంటున్నారు. విద్యార్థుల సామర్థ్యాన్ని పెంచి, క్రమశిక్షణారాహిత్యాన్ని నిర్మూలించటానికి ప్రభుత్వం తగిన చర్యలు తీసుకుంటోంది. ఈ విషయాల్లో కూడా ప్రజల సహకారం ప్రభుత్వానికి అవసరం. ఇది మనం అందరం గుర్తించాలి. లేకపోతే విద్యారంగంలో ఏమాత్రం ముందుకు పోలేము.

39. ఉపన్యాసాన్ని ముగించే ముందు ఒకమాట. ప్రాథమిక పాఠశాలలు, హైస్కూళ్ళు, కళాశాలల ఉపాధ్యాయులకు జీతాలు పెంచవలెనని ఉపాధ్యాయులేకాదు, అందరూ కూడా చెప్పుతూన్నారు. ఉపాధ్యాయులపట్ల సానుభూతి ప్రభుత్వానికి పూర్తిగా ఉన్నది. కాని యీ విషయం అనేకమైన చిక్కులతో ముడివడి యున్నది. ఇందుకవసరమైన ఖర్చు పెద్ద అవరోధం. రాష్ట్రపు ప్రస్తుత ఆర్థిక పరిస్థితినిబట్టి యీ విషయంలో ఏమి చేయటానికి వీలు లేకుండా ఉంది. ఇందుకు ప్రభుత్వం మనః పూర్వకంగా చింతిల్లుతోంది.

Mr SPEAKER :— The Opposition have agreed that Sri Vavilala Gopalakrishnayya alone will move his cut motion and the discussion will then take place.

Sri PILLALAMARRI VENKATESWARLU :— No, Sir.

Mr. SPEAKER :— 'It is agreed amongst us that Sri Vavilala Gopalakrishnayya should move the cut motion to-day on behalf of the Opposition.' This is what you and Sri Ratnasabhapathy have written to me.

Sri PILLALAMARRI VENKATESWARLU :—No, Sir. He will begin the debate.

Let all the cut motions be moved.

Mr. SPEAKER :— All right

Sri B P. SESHA REDDY :— Mr. Speaker, Sir,
I beg to move :

To reduce the allotment of Rs. 4,78,75,100/- for Education by — Rs. 100/-

(Secondary Education : To restrict the opening of new schools till qualified teachers *are available.*)

Sri B. P. SESHA REDDY :— Mr. Speaker, Sir,
I beg to move :

To reduce the allotment of Rs. 4,78,75,100/- for Education by — Rs. 100/-

(*Primary Education* : To discuss the increase of the supervisory staff.)

13th March 1956]

Sri PILLALAMARRI VENKATESWARLU :—

Mr. Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs. 4,78,75,100/- for Education by — Rs 100/-

(to discuss the failure of the Government to implement the recommendations of Kuppuswamy Committee as regards the salaries to be paid to the elementary school teachers.)

Sri PILLALAMARRI VENKATESWARLU :—

Mr. Speaker, Sir, I beg to move .

To reduce the allotment of Rs, 4,78,75,100/- for Education by — Rs. 100/-

(to discuss the failure of the Government for taking over the privately managed and other schools by the Government )

Sri V. VISWESWARA RAO .—Mr. Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs. 4,78,75,100/- for Education by — Rs. 100/-

(10 సంవత్సరముల వయస్సు బాలుడు 1 వ ఫారములో చేరాలని నిర్భందించుతూ ఆ బాలుడు 3 భాషలు చదవాలనే నిర్భందమును గురించి.)

Sri V. VISWESWARA RAO.—Mr. Speaker, Sir, I beg to move

To reduce the allotment of Rs. 4,78,75,100/- for Education by — Rs. 100/-

(గ్రాంట్లు యివ్వకపోవుటను గురించి ఎయిడెడ్ స్కూల్సు ప్రభుత్వమే నిర్వహించుటకు పూనుకోక పోవుటను గురించి.)

Sri V. VISWESWARA RAO.—Mr Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs. 4,78,75,100/- for Education by — Rs. 100/-

(విజయవాడలోనున్న వ్యాయామ కళాశాలను ప్రభుత్వం తీసుకొని నిర్వహించక పోవుటను గురించి.)

[13th March 1956

Sri M NAGI REDDI·— Mr Speaker, Sir, I beg to move ·

To reduce the allotment of Rs 4,78,75,100/- for Education by — Rs 100/-

(హిందీని మొదటి ఫారమునుండే నిర్బంధంగా నేర్చుకొను పద్ధతిని ప్రవేశ పెట్టుటకు ప్రభుత్వం పూనుకొంటున్నందులకు)

Sri M NAGI REDDI —Mr Speaker, Sir, I beg to move

To reduce the allotment of Rs 4,78,75,100/- for Education by — Rs. 100/-

(ఇంగ్లీషు భాషను మొదటి ఫారంనుంచి ఆరవ ఫారమువరకు ఐచ్ఛికంగా నేర్చుకొనదలచినవారికే కాక ప్రతివారికి నిర్బంధంగా బోధిస్తున్న పద్ధతిని రద్దుచేయుటకు ప్రభుత్వం పూనుకోనందున.)

Sri M NAGI REDDI:—Mr. Speaker, Sir, I beg to move ·

To reduce the allotment of Rs. 4,78,75,100/- for Education by — Rs 100/-

(సాంకేతిక శిక్షణ, వైద్యం, తదితర వృత్తి కళాశాలల్లోను, విశ్వవిద్యాలయ కోర్సులలోను, ట్రయినింగు స్కూళ్ళలోను చదువదలచుకొన్న వారందరికి ప్రవేశం దొరికేటట్లు ప్రభుత్వం సదుపాయములు కల్గించనందుకు.)

Sri M. NAGI REDDI —Mr. Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs. 4,78,75,100 for Education by — Rs. 100/-

(నిర్బంధ ప్రాథమిక విద్యావిధానము అమలుజరుగుచున్న గ్రామాలలోని బీద విద్యార్థులకు మధ్యాహ్నం ఉచిత భోజన సౌకర్యములను కల్గించుటకు ప్రభుత్వం పూనుకోనందులకు)

Sri PILLALAMARRI VENKATESWARLU :—
Sri VAVILALA GOPALAKRISHNAYYA :—

Mr. Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs. 4,78,75,100/- for Education by — Rs. 100/-

(to discuss the failure of the Government to introduce free education in Andhra State up to third form.)

13th March 1956]

Sri S VEMAYYA — Mr. Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs 4,78,75,100/- for Education by Rs. 100/-

(To point out the failure of the Government to appoint Social Welfare School Teachers as Deputy Inspectors of Schools in the State in pursuance of G O Ms. 737, Education dated 2-4-1952 )

Sri M NAGI REDDI —
Sri G YELLAMANDA REDDI — } Mr. Speaker, Sir, I beg to move

To reduce the allotment of Rs 4,78,75,100/- for Education by Rs 100/-

(ఉత్తీర్ణులయిన ఉపాధ్యాయులు అనేకమంది నిరుద్యోగులుగా వుండినప్పటికి అర్హతలులేని టీచరు మేనేజర్ల క్రింద అనేక గ్రాంటు స్కూళ్ళ మేనేజిమెంటులు వుంటున్నందుకు.)

Sri M NAGI REDDI —Mr. Speaker, Sir, I beg to move

To reduce the allotment of Rs 4,78,75,100/- for Education by Rs. 100/-

(తిరుపతి విశ్వవిద్యాలయమునకు తగినంత ధనసహాయం కేటాయించనందులకు.)

Sri S. VEMAYYA —Mr Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs 4,78,75,100/- for Education by Rs. 100/-

(To urge on the Government not to give effect to the retrenchment of the teachers in the State by opening single teacher schools and by taking over the aided elementary schools in Nellore district )

Sri B. RATNASABHAPATHY — Mr. Speaker, Sir, I beg to move .

To reduce the allotment of Rs. 4,78,75,100/- for Education by Rs 100/-

(To criticise the general policy of Education in particular reference to the reduction

(Sri B. Ratnasabhapathy) [13th March 1956

of stipends to the Higher Elementary Grade Training School students )

Sri B. RAMA REDDI -Mr Speaker, Sir, I beg to move ·

To reduce the allotment of Rs. 4,78,75,100/- for Education by — Rs. 100/-

(To criticise the Government for not bringing out desired changes in elementary education for not increasing the salaries of the teachers )

Sri G NAGESWARA RAO :- Mr Speaker, Sir, I beg to move

To reduce the allotment of Rs. 4,78,75,100/- for Education by — Rs. 100/-

(హాయ్యర్‌గ్రేడు ఉపాధ్యాయుల జీతాలు పెంచేవిధానాన్ని ఉపాధ్యాయు లందరకు ఒకేస్కేలు ఉండే విధానాన్ని ప్రభుత్వము అవలంభించకపోవడము గురించి చర్చించుటకు.)

Sri G. NAGESWARA RAO :- Mr Speaker, Sir, I beg to move

To reduce the allotment of Rs 4,78,75,100/- for Education by — Rs. 100/-

(ప్రాథమికపాఠశాలల్లో ఒక్కొక్క ఉపాధ్యాయుడు 2-3 తరగతులకు పాఠాలు చెప్పడంవల్ల ఆయా తరగతులకు స్టాండర్డు లేకపోవడము జరుగుతూంది. ఒక్కొక్క తరగతికి కనీసము ఒక్కొక్క ఉపాధ్యాయుని నియమిస్తే ప్రాథమికవిద్య అభివృద్ధికరంగా ఉంటూందనేవిషయాన్ని ప్రభుత్వము గుర్తించకపోవడము గురించి చర్చించేందుకు.)

Mr. SPEAKER -The main Demand and the cut motions are now before the House for discussion. Sri Vavilala Gopala krishnayya will begin the debate.

* Sri VAVILALA GOPALAKRISHNAYYA.—అధ్యక్షా, ముఖ్యమంత్రిగారు విద్యాశాఖా బడ్జెటును ప్రవేశ పెడుతూ కొన్ని వివరములు ఇచ్చారు. తెలుగులో ఉపన్యాసము యిచ్చినందుకు (సగం ఇంగ్లీషులో చదివినా) సంతోషం తెలుపుచ్చాలి. రాష్ట్రబడ్జట్ మొత్తములో పెద్దమొత్తముగా ఐఖ్యకట్టగలిగినది విద్యాశాఖా బడ్జట్. ఈ నాడు మనం రెండవ పంచవర్ష ప్రణాళికను ప్రారంభించ బోతున్నాము. దానిని అమలు జరుపడానికి ప్రారంభించిన ఈ బడ్జట్టులో ప్రధానముగా ఏవిషయములు ఉన్నాయని మనం ఆలోచించాల్సిన అవసరము ఉన్నది. మొట్టమొదట ప్రాథమి

విద్యావిధానము గురించి మాట్లాడవలసిన అవసరము ఉన్నది. ఈ నాడు దేశంలో అనేక మంది విద్యార్థులు ప్రాథమిక పాఠశాలలలో ప్రవేశించి చివరవరకు పోలేనందుకు ప్రధానకారణము ఏమిటని మనము ఆలోచించాలి. మన దేశంలోని రైతులలో అధిక సంఖ్యాకులు సామాన్య కుటుంబీకులు. ఆ కారణంచేత వారు తమ పిల్లలను పాఠశాలలకు పంపలేకుండా ఉన్నారు. ఒకవేళ పంపినప్పటికి ఈ విద్యావిధానమువల్ల ప్రయోజనము లేదని విద్యాభ్యాసము కొనసాగింప యిష్టము లేకుండా ఉన్నారు. అందువల్ల వారు విద్యావంతులు అవాలంటే వాళ్ళయొక్క పనిపాటలు చెడకుండా చదువు చెడకుండా ఉండే పద్ధతులలో వారికి విద్య గరపాలి. అయిదు సంవత్సరములనుంచి పదమూడు సంవత్సరముల వరకు వయస్సుగల పిల్లలందరూ పాఠశాలలకు పోవాలంటే ప్రభుత్వం తగిన సౌకర్యాలు కలుగచెయ్యాలి. కాని, ఈనాడు పదమూడు సంవత్సరములలోపు వయస్సుగల బాలురలో నూటికి 46 మంది మాత్రమే చదువుకొంటున్నారు. మిగతావారు అనేక కారణాలవల్ల చదువుకోవడం జరగడములేదు. 46% కూడా స్కూలుకు పోవడములేదంటే నూటికి నూరుమంది విద్యావంతులు కావలయునంటే ఎంతకాలం పడుతుంది అనే ఉద్దేశ్యముతోటె మేము ఆ నాడు కుప్పుస్వామి కమిటీలో తీవ్రంగా ఆలోచించి, దానికి కావలసిన సూచనలు చేసినాము. ఈ విషయములో ముఖ్యమంత్రిగారు కుప్పుస్వామి కమిటీ నివేదికగురించి మాటలాడుతూ వారు చేసిన సూచనలు ఆర్థికమయిన బాధ్యతలను గుర్తించకుండా చేయబడినవిలాఉన్నాయన్నారు. నేను వాటి వివరములు అన్నీ మాట్లాడవలయునంటే వ్యవధి చాలా తక్కువగా యున్నదని భయపడుతున్నాను. అప్పుడు విద్యాశాఖ డిప్యూటీ డైరెక్టరు గారు యిప్పుడు డైరెక్టరుగా ఉన్న రంగారావుగారు కూడా ఆ కమిటీలో సభ్యులు.

The Hon. Dr. B. GOPALA REDDI:— ఆ సంవత్సరపు బడ్జెటులో 5 కోట్ల 17 లక్షల లోటు వస్తుందని వారికి తెలుసునా ?

Sri VAVILALA GOPALAKRIHNAYYA :— ఆ రోజు మేము ఒక్కళ్ళమూ కూర్చొని responsibility లేకుండా ఊహతో తయారుచేసిన లెక్కలు కావు. ఆ నాటి డిప్యూటీ డైరెక్టరు ఈ నాటి డైరెక్టరు హాజరవుతూ ఉండేవారు. వారు వివిధ కార్యక్రమాలపై ఎంతెంత ఖర్చవుతుందో నిత్యము అవగాహన చేసుకొనేవారు. అన్ని విషయాలను కూలంకషంగా చర్చించి, ప్రభుత్వపు సులువు బలువులను గమనించి ప్రభుత్వానికి విశేష భారం కాని విధంగానే మా సూచనలను రూపొందించాము. ఉదాహరణకు ఒకటి చెబుతాను. ఈ నాడు అనేక స్కూళ్ళు అనేక రకముల మానేజిమెంట్ల క్రింద ఉండడము వల్ల చాల over lapping గా ఉపాధ్యాయులు ఉంటున్నారు. ఒక్కొక్క స్కూలులో అదనంగా ఉపాధ్యాయులు ఉంటున్నారు. అదనంగా ఉన్న వారిని తగ్గించే విధానమును ఆలోచించాము. కొంతవరకు విద్యార్థులు ఉండవలసిన సంఖ్యకన్నా ఎక్కువమంది ఉంటే ఎక్కువమంది ఉపాధ్యాయులను వేసుకోవడానికి వీలున్నదా అంటే అది కూడా తగ్గించే విధానమును ఆలోచించాము. అదనంగా ఉండే ఉపాధ్యాయులను కొత్తగా స్థాపించబోయే స్కూళ్ళకు పంపబడే విధానము కూడా సూచించాము. అందువల్ల ఈ retrenchment రాకుండా ఉంటుంది. తిరువాన్కూరు-కొచ్చిన్ రాష్ట్రములో విద్యాశాఖ పద్దుక్రింద వచ్చే లోటును,

(Sri Vavilala Gopalakrishnayya) 13th March 1956

పాఠ్య పుస్తకాలు ప్రభుత్వమే ముద్రించు చున్నందువల్ల వచ్చే లాభముతో ఖర్చు చేస్తున్నారని తెలుసుకొని మన రాష్ట్రములో కూడా అటువంటి పద్ధతిని అమలుపరచ బడినట్లయితే లాభదాయకంగా ఉంటుందనే ఉద్దేశముతో అటువంటి సూచనను చేశాము. ఈ విషయములు అన్నీ తప్పకుండా చెప్పవలెను గాని, ముఖ్య విషయాలను చెప్పడము మరచి పోతానేమో అని భయంగా ఉన్నది. అందువల్ల ఈ విషయమును గురించి నేను ఎక్కువగా చెప్పటములేదు. ఈ నాడు 100 కి 46 మంది విద్యార్థులు మాత్రమే పాఠశాలలకు వస్తున్నారు. 100 కి 100 మంది రావలెయునంటే యిప్పుడు ఖర్చుచేస్తున్న దానికి రెట్టింపు ఖర్చు చేయవలయును. అయితే కుప్పుస్వామి కమిటీవారు అన్ని విషయములను చర్చించి 100 కి 100 మంది బాలురకు విద్య గరిపినను ఈ నాటికన్న 10% మాత్రమే అధికంగా ఖర్చు కాగలదని మనకు సూచనలను ప్రతిపాదించడం జరిగింది. కమిటీవారు బాధ్యతా రహితంగా సూచనలు చేశారనడం ఎంతమాత్రము సబబుగా లేదు. అన్ని విషయములను సమగ్రముగా చర్చించి రెండవ పంచవర్ష ప్రణాళిక కాలములో 100 కి 100 మందిని విద్యావంతులుగా చేయాలనే కారణముతో అటువంటి సూచనలు చేయడము జరిగింది. వాటిని అమలు పరిచిననే కాని మనం అందరినీ విద్యావంతులుగా చేయలేము. రెండవ పంచవర్ష ప్రణాళికలో ఆంధ్రరాష్ట్రం విద్యాభివృద్ధికిగాను కేంద్ర ప్రభుత్వమువారు సూచించిన target ను సాధించలేక పోయినదనే అపఖ్యాతి తీసుకొని రావద్దని విద్యా శాఖా మంత్రిగా ఉన్నటువంటి ముఖ్యమంత్రిగారిని కోరుతున్నాను. ముఖ్యమంత్రిగారే విద్యా మంత్రిగా యుండడం చాలా సంతోషించదగ్గ విషయము. కుప్పుస్వామి కమిటీ సూచనలను అమలు జరపడములో తగిన శ్రద్ధ వహించవలెనని వారిని కోరుతున్నాను.

ఈ నాడు మాధ్యమిక, ప్రాథమిక విద్యావిధానములు రెండూ కూడా కలసిపోయిన సమస్య ఉన్నది. ఈ నాడు ప్రభుత్వమువారు మాధ్యమిక వరకు ఉచితంగా అందరికీ చదువు చెప్పాలనుకుంటున్నారన్నారు. ఆ విధంగా ప్రకటన చేసిఉంటే మేము cut motions తీసుకురావలసి వచ్చేదికాదు. ఇప్పటికైనా ఆ విధంగా చేయమని కోరుతున్నాను. అటువంటి ప్రకటన యివ్వడముతోటే మా cut motions withdraw చేసుకొనుటకు తయారుగా ఉన్నాము. మీరు దానిని అమలు జరుపుతారని, మాకు విశ్వాసము ఉన్నది. అయినా ప్రకటన చేయండి అని కోరుతున్నాను. మాధ్యమిక వరకు ఉచితంగా విద్య గరిపితే, అప్పుడు హయ్యరు ఎలిమెంటరీ స్కూల్సు ఉండే అవసరములేదు. అందువల్ల హయ్యరు ఎలిమెంటరీ విద్యావిధానములో మార్పు రావలసిన అవసరము ఉన్నది. హయ్యరు ఎలిమెంటరీ విద్య, సెకండరీ విద్యకు మెట్టుగా ఉండవలయును. ఈ నాడు ఉన్న హయ్యరు ఎలిమెంటరీ స్కూల్సులో కొన్నింటిని మిడిల్ స్కూల్సుగా చేస్తాము అంటున్నారు. అట్లు గాకుండా అన్ని హయ్యరు ఎలిమెంటరీ స్కూల్సును మిడిల్ స్కూల్సుగా చేయమని కోరుతున్నాము. అన్ని మిడిల్ స్కూల్సులోను ఉచితంగా విద్యాబోధన జరిగేట్లు చూడమని కోరుతున్నాము.

హైస్కూల్సు కట్టేటప్పుడు వాటికి మీరు కొన్ని షరతులు పెట్టండని మనవి చేస్తున్నాను. పెద్ద భవనములు కావలయునని మంచి లేబరేటరీలు కావలయునని షరతులు పెట్టినట్లయితే చాల కష్టము అవుతుంది.

13th March 1956] (Sri Vavilala Gopalakrishnayya)

ఇప్పుడు సెకండరీ విద్య చాలా ప్రమాద స్థితిలో ఉన్నదని నేను మనవి చేస్తున్నాను. ఇంతకు ముందునుంచి ఎలిమెంటరీ విద్యమీద పరిశోధనలు జరుగుతూ ఉండేవి. ఈ నాడు అవి సెకండరీ విద్యమీద ప్రారంభము అవుతున్నాయి.

అశితోష్ ముఖర్జీగారు బెంగాలు యూనివర్శిటీ వైస్‌ఛాన్సలరుగా యుండగా బెంగాలు దేశంలో గ్రాడ్యుయేట్సు కానివారు ఉండడానికి వీలులేదని వారికి ఏమాత్రము standard ఉన్నా సరే గ్రాడ్యుయేట్సు కావలయునని చెప్పారు. ఈ విధంగా వారు తన దేశమును గురించి గౌరవముగా చెప్పుకుందామని ప్రయత్నము చేశారు. కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖా మంత్రి అయిన అజాద్‌గారు మన దేశంలో ఎంత తక్కువమంది గ్రాడ్యుయేట్సు ఉంటే అంత మంచిదని ఒక పర్యాయము ఉపన్యాసము ఇచ్చినారు. గ్రాడ్యుయేట్లలో నిరుద్యోగ సమస్య చాలా ప్రబలంగా ఉన్నది. దానిని తగ్గించాలని Education Seminar జరిగినప్పుడు వారు చెప్పినారు. విద్య నేర్చుకున్న వారికి ఉద్యోగము చూపించడానికి కావలసిన పారిశ్రామిక పద్ధతి తయారు చేయడము మరచిపోయి, విద్యావంతులైన నిరుద్యోగులు ఎక్కువ అవుతున్నారు గనుక విద్యను తగ్గిస్తాము అని అంటున్నారు. ఈ విధానము చాలా ప్రమాదకరమైనదని మనవి చేస్తున్నాను. ఆంధ్ర రాష్ట్రంలో మంచివని చెప్పుకునేటువంటి హైస్కూల్సు ఉన్నాయి. వాటిలో VII Form ప్రవేశ పెట్టదలచినట్లు వింటున్నాము. అటువంటి వాటికి M. A. pass అయిన ఉపాధ్యాయులు కావాలి. విద్యావంతులైన నిరుద్యోగులు ఎక్కువ అవుతున్నారు, గనుక విద్యావంతులను తగ్గించాలనే విధానం మనం అవలంబించినట్లయితే M. A. చదువుకున్న వారు కావలయునంటే ఎక్కడనుంచి తీసుకురాగలము? విద్యాధికులైన ఉపాధ్యాయులు లేనిదే హైస్కూల్సు అన్నీకూడా, మిడిల్ స్కూల్సుగా చెలామణి అయ్యే దౌర్భాగ్య స్థితి ఏర్పడుతుంది. అందువల్ల సెకండరీ విద్యావిధానం చాలా ప్రమాదస్థితిలోకి పోవుచున్నదని నేను మనవిచేస్తున్నాను. దీనిని చాలా serious గా ఆలోచించవలసిన అవసరము ఉన్నది. ఈనాడు సెకండరీ విద్య పూర్తి చేసిన వారిలో నిరుద్యోగము ఎక్కువగా ఉన్నది యూనివర్శిటీ చదువులకు హెచ్చుమంది రాలేకుండా ఉన్నారు. High schools లో VII Form ఏర్పాటు చేయడము మూడుయేండ్ల డిగ్రీకోర్సుల ఏర్పాటు అనే విధానము వల్ల నిరుద్యోగ సమస్య పరిష్కారము కాదు. దీనివల్ల నిరుద్యోగం, పెరిగే ప్రమాదము కూడా ఉన్నది. రాష్ట్రములోని అన్ని హైస్కూల్సును ప్రభుత్వమే నిర్వహించి సెకండరీ విద్యయొక్క standard ను పెంపుచేయవలసిన అవసరము ఎంతేని కలదు. కనుక ఈ నాడు ఉన్న హైస్కూల్సు లన్నింటిని ప్రభుత్వము తీసుకొని VII Form వరకు కూడా పెట్టి వాటికి కావలసిన సౌకర్యాలుచేసి, ఉపాధ్యాయులను ఇచ్చి వాళ్ళ గ్రేడు ప్రకారంగా జీతాలు ఇచ్చి మేము నడుపుతామంటే తీసుకోండి.

(At this stage Mr. Deputy Speaker occupied the Chair)

ప్రభుత్వంవారు High Schools, Colleges అన్నీ తీసుకొని నిర్వహించలేరని నాకూ తెలుసు. లేనిపోని ambitions పెట్టుకొని విద్యావిధానానికి దెబ్బకొడతారెందుకు ? ఈ విధంగా చేసినట్లయితే చాలామంది lower education తో పూర్తి చేస్తారు. చదువుకున్నవాళ్ళు లేకుండాపోతారు. ఇప్పుడు విద్యార్థులలో standard

బాగా తక్కువగా వున్నది. ఈ standard ను పెంచే విధానాన్ని అవలంబించాలి కాని 3rd form లో చదువు పూర్తిచేసే పరిస్థితులు తీసుకురావద్దని మనవి చేస్తున్నాను. ఇప్పుడు Board schools చాలా వున్నాయి. గుంటూరు జిల్లాలో Board నిర్వహిస్తున్న schools 120 వరకూ వున్నాయి. వీటన్నింటికి గవర్నమెంటు buildings యిస్తే డబ్బు యిస్తామని చెప్పారు. Buildings కోసం చాలా ప్రయత్నం చేశాము. ఇప్పటికీ ప్రయత్నిస్తూనే వున్నారు. వాటికి ప్రభుత్వము కూడా కొంత సహకారాన్ని యివ్వవలసిన అవసరం వుంది ఈ మధ్య Local Development grants వస్తే దానిని ఉపయోగించుకొని buildings కట్టుటకు ప్రయత్నిస్తే 11 వ తారీకువరకు చేసుకొన్నటువంటి పనికైతే మేము డబ్బు యిస్తామని తరువాత నైతే యివ్వము అని చెప్పారు. గోడలన్నీ కట్టినారు. Slabs వారం రోజులలో వేయ బోతున్నారు. కనుక యివ్వమని మేము అడిగితే slabs వేసేటప్పుడు ఎంత ఖర్చయింది, మొత్తం ఎంత ఖర్చవుతుంది అన్నారు. అందుచేత Local Development grant complete గా ఉపయోగపడేటట్లు చూడవలసిందని, వాళ్ళు యీ సంవత్సరంలోగానే పనిచేయించి grant తీసుకొనే అవకాశం 25 తేదీవరకు కల్పించ వలసిందని నేను కోరుతున్నాను ఈ విధంగా చేసినట్లయితే వాళ్ళు default కాకుండా వుంటారు. సంస్కృతానికి ఒక ప్రత్యేకమైన book పెడుతున్నామని మంత్రిగారు చెప్పారు. Humanities ని develop చేస్తామన్నారు. ఇప్పుడు మనం science లో వెనుకబడ్డాము. అందువల్ల మనం science ని అభివృద్ధి చేసుకోవాలి. Science మీద concentrate చేద్దామనే ఉద్దేశ్యంతోటి యూనివర్శిటీలు వున్నాయి. కాని యిప్పుడు science students ఎక్కువై పోతున్నారు. వాళ్ళందరికి ఉద్యోగాలు కనిపించుట లేదు. ఇది చాలా చిక్కు సమస్యగా పరిణమించింది. అందుచేత యిదంతా humanities గా మార్చి అంతాకూడాB. Aఅని చెప్పేదాంట్లోనేఒకscience section పెడితేబాగానే ఉంటుంది. Science students నిరుద్యోగం, అనే విధంగాతీసుకు పోకుండా science ని, science students ని అభివృద్ధి చేయాలి. దేశంలో వాళ్ళకు సులభంగా ఉద్యోగాలు దొరికే ప్రయత్నాలు చేసి Nation ను build up చేయబోతున్నాము. Nation building అంతాకూడా science మీదనే ఆధారపడి వున్నది. ఏ వస్తువైనాసరే science లేకుండా చేయలేము. Humanities వారికి Moral character వరకూ ఉపయోగ పడుతుంది. Science develop అయినపుడే సహజంగా కావలసిన పటుత్వాలన్నీ కలుగుతాయి. మొన్న మంత్రిగారు చెప్పిన సమాధానాన్నిబట్టి చూస్తే అసలు B. Sc. తీసేసి B. A. అని చెప్పి పెట్టి science అంతా తీసిపారేస్తారేమో అని అనుమానంగా ఉంది.

The Hon. Dr. B. GOPALA REDDI :—Courses లో కొంతవరకు B. A., B. Sc. అనే తేడాలు పోతాయి.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— Course లో తేడా పోతే అంత బాధలేదు. అసలు Science subject పోతుందేమోనని భయ పడుతున్నాను. Science students ఎక్కువై పోతున్నారు. వాళ్ళకు ఎక్కడా ఉద్యోగాలు దొరకుటలేదు. అసలు Science నేర్చుకున్నవాడికి కావలసిన పరికరాలు యిక్కడ లేనందువల్ల ఆంధ్రదేశం వదలి బయటకు పోయినవాడు బ్రతుకుతున్నాడు.

13th March 1956] (Sri Vavilala Gopalakrishnayya)

ఇక్కడ వున్నవాళ్ళు ఉద్యోగం దొరకక ఎందుకూ పనికిరాకుండా పోతున్నారు. Science వాడికి కావలసిన post create చేయడంకోసం ముఖ్యంగా పరిశ్రమలు అభివృద్ధిచేయాలి. ముఖ్యమంత్రిగారివలెనే మన గోపాలరెడ్డిగారు కూడా నా ఆంధ్రదేశంలో graduate కానివాళ్ళు వుండటానికి వీలులేదని ఒక ప్రతిజ్ఞతీసుకొని, ఆ చరమదశ నందుకోటానికి ప్రాథమిక విద్యతో ప్రారంభించాలి. అది సాధించేవరకూ ఆంధ్రజాతి అంతా కూడా కలిసి ప్రయత్నించేవిధంగా గోపాలరెడ్డిగారు నాయకత్వం వహించాలని నేను కోరుతున్నాను. దీనికితోడుగా యితర విషయాలనుకూడా పరిశీలించాలి. ఈ నాడు teachers లో వుండే హెచ్చుతగ్గుల విషయంచూస్తే చాలా అగోచరంగా వుంది. రోజురోజుకీ పరిపాలనా విధానం మారిపోతుంటే ఎవడి rules వాడివి. ఎవడి grade వాడిది. ఎవడి increment వాడిది. అందుచేత ఏ Department వదలిపెట్టి యే Department కి పోయే అవకాశం వుందో తెలియటంలేదు. ఈ నాడు గుంటూరు లోని Board High School లో చూసినట్లయితే B Sc, teachers ఎవరూలేరు. ఎందుచేతనంటే వాళ్ళకు తగినటువంటి జీతాలు రావడంలేదు. రేపు M A వాళ్ళని తీసుకుంటామంటున్నారు. M. A. వాళ్ళను ఎక్కడనుంచి create చేస్తారని నేను ప్రశ్నిస్తున్నాను. మీరు యిప్పుడు Multi-Purpose High Schools పెట్టాలన్నప్పటికినీ, లేకపోతే High Schools లో 7th form పెట్టాలన్నప్పటికీ M.A. వాళ్ళు యెక్కడ వున్నారు? grades మార్చేసి Preuniversity education అమలుజరుపుతారా? అలాచేసినట్లయితే మొత్తం education దెబ్బతింటుందని మనవిచేయుచున్నాను. యూనివర్శిటీలు యిప్పుడు బాగా అభివృద్ధి చెందుతున్నాయి. గుంటూరులో ఒక university పెట్టాలని ఆంధ్ర యూనివర్శిటీ Vice-chancellor గారు చెప్పారు. అయితే విద్యామంత్రిగా ఒప్పుకున్నా రేపు ఆర్థికమంత్రిగా ఏమంటారో? ఇదివరకు మద్రాసు university లో Coimbatore లో graduate course పెట్టి కొన్నాళ్ళు అమలు జరిపారు. తరువాత తీసేశారు. మదరాసు university లో post-graduate course కొన్నాళ్ళు అమలుజరిపి తీసేశారు.

The Hon Dr B. GOPALA REDDI – మళయాళంలో అనర్సుకోర్సు Palaghat Victoria college లో పెట్టినారు. Coimbatore లో యీ course ఎప్పుడూ పెట్టలేదు.

Sri VAVILALA GOPALAKRISHNAYYA - మొత్తంమీద దీంట్లో వున్న అంశమేమిటంటే యూనివర్శిటీలోనే కాకుండా బయటకూడా యీ Post Graduate Course పెట్టవచ్చుననేది తేలిపోయింది. గుంటూరులో యీనాడు ఇంజనీరింగ్ కాలేజీకూడా పెట్టడానికి 6 లక్షల రూపాయలు గుంటూరువాళ్ళు యివ్వడానికి సిద్ధంగావున్నారు. అందుచేతవీటన్నింటినికలిపిగుంటూరు Planning Committee లో తీర్మానముచేసి పంపించాము. ఎంతకావలెనో కోరండి $\frac{1}{3}$ కావాలంటే యిస్తాము. చందాలు వసూలుచేసి యిస్తాము. మీకు అనుమానంగావుంటే డబ్బు deposit చేసిన తరువాతనే యివ్వండి. మాకేమీ అభ్యంతరంలేదు. Medical college, Agriculture College, Veterinary College వున్నాయి. Engineering College కూడా

పెట్టండి. Politechnic College మంగళగిరి దగ్గర పెడతా మంటున్నారు. Post graduate course లే సందర్భంలో పెట్టినా గుంటూరులో సావుకాశం వుండి కనుక Politechnic College గుంటూరులో పెట్టమని కోరుతున్నాను. అలాచేసినట్లయితే మనమందరం సంతోషింతో వెళ్ళగల్గుతాం. నేను Cutmotion move చేయవలసిన అవసరంలేకుండా చేయమని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

Sri S. B P PATTABHIRAMA RAO అధ్యక్ష మహాశయా! ఈ 2 వ తేదీన నూతనవర్షపు బడ్జెటును డాక్టరు గోపాలరెడ్డిగారు ప్రతిపాదించగా వినే భాగ్యము కలిగింది. ఈవేళ వారు విద్యకు సంబంధించిన బడ్జెటునుగురించి చేసిన ప్రసంగమునుకూడా విన్నాము. డాక్టరు గోపాలరెడ్డిగారు గురుదేవులు, రవీంద్ర కవీంద్రుల కడ విద్యాభ్యాసముచేసి విశ్వభారతిలో కృషిసల్పి విశేషప్రజ్ఞను ఆర్జించారు. ఆ ఉపాసన వేర్పిన లలిత కళలతో కూడిన సంస్కృతి రత్నాకరునా అన్నారు. ఆ పోకడలన్నీ వారు ప్రవేశపెట్టిన బడ్జెటులో పాటు చేసిన ఉపన్యాసమే తెల్పక చెప్తుంది. ఎంత రీవిగా చదివినారు! ఆ వయ్యారము ఆ హుందాతనము చూస్తే ఆయనకు అయనే ప్రత్యేకమని చెప్పాలి. అంతేకాదు. ఆర్థికమంత్రి తెలుగులో బడ్జెటు చదవడం ఇదే ప్రథమం. దీనికి ఒక క్రొత్తదనము వచ్చింది. శైలికి ఒక మధురత్వం వచ్చిందనిపించింది నాకు. అందున్నా, పూర్వకవుల సంస్మరణ నన్నయ, పెద్దన, పోతన, తిక్కన, భట్టుమూర్తి వీరందరిని ప్రశంసించడం ఎంతో గొప్పవిషయము కాని, అధ్యక్షమహాశయా, నాకు ఒక సందేహం మాత్రం కలిగింది. శ్రీ జనాభ్యుదయ శాఖామాత్యులయ్యు కవయిత్రిమొల్ల ఊసేని పల్కకుండుట నాకు విశేషంగా కన్పించింది. కొంచెము యాసగాకూడ కనిపించింది, గోపాలరెడ్డిగారు దానిని వదలడం. మొత్తంమీద, మంచి భావములో చక్కగా ఉపన్యాసం చేశారు. అందుకు వారిని పూర్తిగా మనసారా అభినందిస్తున్నాను. ఈవేళ వారు చెప్పిన ప్రసంగంలో III Form వరకు మాధ్యమికవిద్యలో కులతత్వభేధాలు లేకుండా ప్రతి వారికి కూడ ఉచితంగా విద్యగరిపే సదుపాయము గురించి దీర్ఘమైన యోచనలో ఉన్నట్లు సెలవిచ్చారు. సాధారణంగా వారు చూస్తాము అంటె చేస్తారనే మా అభిలాష. పూర్వము అటువంటి పేరు కూడ ఉన్నది వారికి. అందుచేత చేస్తారనే నమ్ముతున్నాము.

The Hon. Dr. B. GOPALA REDDI.— చూస్తామంటే చేస్తామేమో గాని ఆలోచిస్తామంటే మాత్రం కాదు.

Sri S. B. P PATTABHIRAMA BAO — దీర్ఘంగా ఆలోచిస్తున్నామన్నారు. అందుచేత కొంచెముదీర్ఘము సుదీర్ఘమైంది గనుక తప్పకుండా మంచిఫలితాలనే ఇస్తారని ఆశిస్తున్నాము. ఇది మద్రాసు రాష్ట్రములో ఇదివరకు నాయుడుగారు అమలుజరిపారు. అందుచేత ప్రక్కన ఉన్నటువంటి మనముకూడ ఇప్పుడుపెట్టడం ఎంతో వాంఛనీయము అది చాలామంచి సంస్కరణ అని కూడ మనవిచేస్తున్నాను. శ్రీ గోపాలరెడ్డిగారు ఆర్థికమంత్రే కాకుండా ముఖ్యమంత్రి, విద్యామంత్రికూడా అనడము ఎంతో లాభము అని దేశము ముచ్చట పడుతూంది. విద్యకు ఎంతో ధనము ఆయన చేకూరుస్తారు. లక్ష్మి, సరస్వతుల నిద్దరిని ఒకేచోట మిళితంచేసి ఆంధ్రానికి మేలుచేస్తారని ఆశిస్తున్నది దేశము. కాని మొత్తము మీద పంచవర్ష ప్రణాళిక పరిశీలిస్తే మన ప్రణాళికలో విద్యకే కాకుండా మొత్తం అంతటికి 116 కోట్లు మాత్రమే వచ్చాయంటే కేంద్ర ప్రభుత్వము కొంచెము

13th March 1956] (Sri S. B. P. Pattabhirama Rao)

చిన్నచూపు చూసినారేమో, మనవారు గట్టిగా వొత్తిడిచేసినప్పటికీ; అనిపిస్తుంది. అందులో ఈసంవత్సరము మొదటి సంవత్సరమే ప్రణాళికలో 6వ వంతు ఖర్చుపెడుతున్నారు, ఐదవ వంతు ఖర్చు పెట్టవలసినప్పటికిని. అయితే విద్యకై మొత్తముమనప్రణాళికలో మన లెక్కలు బట్టి 760 లక్షలుమాత్రమే ఖర్చుపెడుతున్నారు. అందుతో 1956-57 సంవత్సరానికి కేటాయించింది 46,46,000 మాత్రమే అంటె రూపాయలలో ఒక అంశాభాగము 16 వ వంతు అన్నమాట. ఇది నిజంగా హాస్యాస్పదమైన తక్కువమొత్తమని అనుకోడానికి తావిస్తుంది. కేంద్ర ప్రభుత్వం పంచవర్ష ప్రణాళికకు గాను 4,800 కోట్లు ధైర్యంగా వేసి చూపింది. కాని మనకు మొత్తము 116 కోట్లు మాత్రమే ఇచ్చినప్పుడు కొంచెము మనకు విచారము కలుగక మానదు పోనీ ఇచ్చిన దాన్ని అయినా సరిదిద్దుకొని మన ప్రణాళికలో మొదటి సంవత్సరమే అయిదవ వంతు ఖర్చుపెట్టుకో గలిగితే మనము చక్కగా నిర్మాణాత్మకమైన ప్రణాళికలను మన రాష్ట్రానికి వేసుకొన్నట్లు అవుతుందని మనవి చేస్తున్నాను. మన ప్రక్కన ఉన్నటువంటి మద్రాసు రాష్ట్రములో చూస్తే అక్కడ విద్యాప్రణాళికకుగాను పంచవర్ష ప్రణాళికలో 16 కోట్లు ఇచ్చినట్లు తెలుస్తుంది. నిజంగా మన రాష్ట్రములో విద్యకుగాను కేటాయించిన మొత్తాన్ని ఇతర రాష్ట్రములలో కేటాయించిన మొత్తాలతో పోల్చిచూస్తే మనది సముద్రములో ఒక బిందువు మాదిరిగా ఉన్నదని చెప్పాలి. ఈ సందర్భములో ఆర్థికమంత్రిగారు మనది లోటుబడ్జెట్ లోటు బడ్జెట్ అని భావిస్తే లాభములేదు. బెంగాల్ చూడండి. మొదటి పంచవర్ష ప్రణాళికకు కావలసిన ధనాన్ని ప్రోగు చేయడానికి వాళ్ళ బడ్జెట్ 10 కోట్ల 47 లక్షల లోటుతో ముగుస్తున్నది. ఇకవారితోటి సహాచర్యం పొంద సిద్ధంగా ఉన్న బీహారు వాళ్ళు ఆదాయాన్ని మించి 29.47 కోట్లు ఖర్చు పెట్టడానికి సిద్ధం చేసుకొన్నారు. అంటె 29.47 కోట్లు లోటుతో చేసుకొంటున్నారు అన్నమాట ఈ సంవత్సరానికి అవసరపు ఆదాయము చేకూర్చడానికి ఇదివరకే మన శాసనసభ శాసనాలు చేసినట్లు ముఖ్యమంత్రిగారు చెప్పారు. అయితే మన శాసనసభ ఇంత మంచిపని చేసినప్పుడు, ఇంకా అవసరపు ఆదాయానికి మార్గాన్వేషణలు జరుగుతున్నప్పుడు మన విద్యావ్యాపక సామాజిక పథకాలను అభివృద్ధి చేసుకోవటం సమంజసమని సవినయంగా నేను మనవి చేసుకొంటున్నాను. నిజము చెప్పవలసివస్తే, మనము కొత్తగా రాష్ట్రము ఏర్పరచుకొనిన తరువాత, ఈ మాత్రపు ఖర్చుఅవడం సహజం, ఆ విధంగా కాకపోవడం అసహజం అని మనవిచేస్తున్నాను. ఇప్పుడున్న పరిస్థితులలో ఈ మాత్రపు లోటు మనకంత హెచ్చుకాదని కూడా నేను అనుకొంటున్నాను ఇంకా మనము చురుకుగా ముందుకు సాగిపోవాలంటె, మనం ధైర్యంతో సాహసంతో పోవాలేమో అని నేనుఅనుకొంటున్నాను. మనగతఅనుభవాన్ని బట్టి, ఇతర రాష్ట్రములలోనిపరిస్థితులను బట్టి చూచినట్లైతే ఈ హంస నడకలతో నడిస్తే మాత్రం వ్యాపారం నడవదని నా అభిప్రాయము. ముఖ్యంగా మనము పొదుపు, పొదుపు అంటూ ఎంతో పొదుపుతో పరిపాలన చేసుకొంటూ ఉంటే, ఇండియా ప్రభుత్వముగాని, మరెవరుగాని దీనిని గుర్తించినట్లు కన్పడడంలేదు. ఖర్చుచేసిన రాష్ట్రాలకే కేంద్రమునుంచి అన్నిలాభాలు కలుగుతున్నాయి. ఒక్క ఆర్థిక సహాయమె కాకుండా, పారిశ్రామికంగా కూడ, పెద్దపెద్ద factories, mills fertiliser factory మొదలైనవి, ఇవన్నీ ఖర్చుచేసే రాష్ట్రాలకే ఇస్తున్నారుగాని, పొదుపు చేసుకొంటున్న ఈరాష్ట్రానికేమి ఇవ్వలేదు. మనము ఇంత పొదుపు జీవనముచేసుకొని జాగ్రత చేసుకొంటున్నా మనేది కేంద్రప్రభుత్వం ఏమైనా గుర్తించిందా అంటె,

నా దృష్టికి నాకు అటువంటిదేమి కన్పించడంలేదు. అంతేకాదు, ఖర్చుచేస్తున్న రాష్ట్రాలు తమ ప్రజలకు లాభము కలుగజేసుకోవడమే కాకుండా కేంద్రమునుంచి మెప్పుతెచ్చుకో గలిగిన గౌరవంకూడ వాళ్ళకే కలిగిందని నా అభిప్రాయం. General debate లో బదులు చెప్పుతూ, తరువాత ఈ వేళ గోపాలక్రిష్ణయ్యగారికి చెప్పుతూకూడ ముఖ్యమంత్రి గారు సహజంగానె బాధపడుతూ 1954-55 బడ్జెట్ లో అయిదుకోట్లు లోటు వచ్చిందని పలుసార్లు చెప్పారు. నిజమే అప్పటి పరిస్థితులు ఊహించుకొని ఉంటె ఇదేమి అంతపెద్ద లోటుకాదని నేను భుజంమీద చెయ్యివేసి చెప్పుతున్నాను విపరీతమైన పరిస్థితులలో సరిక్రొత్తగా రాష్ట్రము ఏర్పడింది ఖర్చులు పెరిగినాయి. తగినంత ఆదాయము లేక పోయినమాట నిజమే. రాష్ట్రము ఏర్పరచుకొనినప్పుడే లోటు బడ్జెట్ లో ఏర్పరచు కొన్నామని ప్రజలకుకూడ తెలుసు. ఆ పరిస్థితులలో మనకు అయిదుకోట్ల రూపాయలు లోటు బడ్జెట్ ఏర్పడిందంటె, నిజంగా మన నిత్యావసరాలకైతే నేమి చేయవలసినటువంటి పనులకైతే నేమి, అదేమి అంత హెచ్చుకాదని వారికి మనవిచేస్తున్నాను. కాక, అతి సమర్థతతో 5 కోట్లు లోటు బడ్జెటును ప్రవేశపెట్టిన ఆ నాటి ఆర్థిక మంత్రిగారిని మళ్ళీ ఒక్కసారి ఈ వేళ అభినందిస్తున్నాను. నేనే కాదు ' యోచించి చూడండి ఆ ఆర్థికమంత్రి ప్రతిభను ఇండియా ప్రభుత్వము కూడా గుర్తించారని నా నమ్మకము. ఎందువల్లనంటే, నిన్న మొన్ననే ఆర్థిక శాఖలోను, company Law లోను ప్రవీణుల సలహా సంఘాన్ని ఒకదాన్ని ఏర్పరచి ఆయనను అధ్యక్షునిగా కోరి, పిలిపించి నియోగించారు. అంతేగాక, ఆ అధ్యక్షుని గురించి ప్రజానీకానికి తెలుపుతూ ఆంధ్రరాష్ట్ర మాజీ ఆర్థికమంత్రి అయినట్టి తెన్నేటి విశ్వనాథంగారిని ఈ ఉద్యోగానికి ఆహ్వానించినట్లు సగౌరవంగా చాటారు, కేంద్ర ప్రభుత్వంవారు. ఇంతకన్నా వేరే certificate ఆయనకు ఏమికావాలి ! ఇంతకన్నా వేరే అభినందనలు ఆ నాటి Budget కు ఏమికావాలి ! .

ముఖ్యంగా చెప్పాలంటే, మనము ఎంతో ఆశించినటువంటి యీ విద్యకే పెద్ద దెబ్బ తగులుతుందేమోనని నా అనుమానము. ఉన్నత మాధ్యమిక పాఠశాలలలోనూ, సకలార్థ సాధక పాఠశాలలలోనూ, ప్రభుత్వానికి నమ్మకమనేది ఉండినట్లైతే త్వరలో మార్పు అనేది తీసుకునిరావాలంటే, అది అతిత్వరగానూ, reasonable time లోనూ జరిగితీరాలి. ప్రభుత్వము సంవత్సరము ఒకటింటికి పదినుంచి పదిహేనుస్కూళ్ళ చొప్పున క్రమేణ మార్పుచేస్తామని అంటున్నారు. అలాంటప్పుడు రాష్ట్రములోని అన్ని స్కూళ్ళలోనూ మార్పుతీసుకొని రావటానికి కనీసము నలభై సంవత్సరాలకు తక్కువ పట్టదని నా అభిప్రాయము. దీన్నిబట్టి యీ తరములోనివారు ఎవరూగూడ ఆ మార్పును పూర్తిగాచూచే భాగ్యము లేదన్నమాట. ప్రణాళికల ఏర్పాటు ప్రకారము అయిదు సంవత్సరములలో వెయ్యి పాఠశాలలు, అరవై మాధ్యమిక పాఠశాలలు, ఇరవైనైదు హైస్కూళ్లు మాత్రము మార్పుచేయటానికి వీలుఅవుతుందని అంటే, ప్రస్తుత జనభా పెరుగుదలనుబట్టి, విద్యఎంత అధ్వాన్నముగా వుంటుందో మనకు బోధపడుతుంది. అన్ని స్కూళ్ళలోనూ, ఒక్కసారిగానైనా, మార్పుజరగాలి, లేకపోతే, జనాభా పెరగకుండా అరికట్టటానికైనా ప్రభుత్వం ప్రయత్నించాలి. ఇందులో ఏదో ఒకటి జరిగితేనేగాని ప్రయోజనము ఉండదు. ఇప్పుడు ఉన్న జనాభాకంతటికి పూర్తిగా చదువు చెప్పించే మార్గాలు ప్రభుత్వం చూడకపోతే, విపరీత పరిస్థితులు ఏర్పడుతాయని నాభయము. ముఖ్య

13th March 1956] (Sri S. B. P Pattabhirama Rao)

మంత్రిగారి దృష్టిలో జనాభాను అరికట్టే ప్రణాళికలు ఏవైనా ఉన్నవేమోగాని, ఉంటే మాత్రము అవి త్వరలో అమలుపరచటానికి ఆలోచించవలసి వుంటుంది. (Laughter)

ఇక కళాశాలనుగురించి చెప్పాలంటే, ప్రస్తుతము మనకు ఉన్నవి గవర్నమెంటువి ప్రైవేటువి, తరువాత విశ్వవిద్యాలయాలు ఇవి మేనేజ్ మెంటుక్రింద ఉంటున్నవి. ఇవి ఏవిఉన్నప్పటికిని, అందులో నెరవేర్చబడే కార్యము అంతాఒకటే అంటే మనబిడ్డలకు విద్యను నేర్పించు కోవడము ఒక్కటేకాని అన్నికళాశాలలలోను standard సమానంగానూ, ఒకే విధముగాను ఉంటేనే విద్యయొక్క ఫలితము మన బిడ్డలకు ఎక్కడ చదివిననూ అందగలదు. అన్నిచోట్లలోనూ చదువుయొక్క standard సమానంగా ఉండకపోతే, విద్యార్థులైనవారు ఎక్కడ అయితే చదువు బాగా చెబుతారో ఎక్కడ అయితే standard అన్నిచోట్లకంటే బాగా ఉంటుందో, అక్కడికి పరిగెత్తి చదవటానికి ప్రయత్నిస్తారు తల్లితండ్రులుకూడ ఆ విధముగా చేయటానికి ఉత్సాహ పరుస్తారు. కాని అందరూకూడ ఒకేచోటుకు వెళ్ళితే, వెళ్ళినవారందరికీ అక్కడ సీట్లు ఉండవు, అలాంటప్పుడు వెళ్ళినవారు యిబ్బందులపాలు కావలసివస్తుంది. అందుచేత అన్ని కళాశాలలలోనూ standard ఒకేవిధముగా ఉండేటట్లైయితే, విద్యార్థులైనవారు, వివిధచోట్లకు పోకుండ, వారికి సమీపములోఉన్న కళాశాలలోనే చదవటానికి అవకాశము కలిగించుకుంటారు. అన్నిచోట్లలోను standard ఒకేవిధముగా సమానముగా జరగాలి అంటే కళాశాలలలో laboratary కి కావలసిన equipments అన్నీ సమానంగా ఏర్పరచాలి. ఇదిచేయాలంటే ప్రభుత్వం తగిన ధనసహాయము చేయడము చాలా అవసరము. ప్రభుత్వము తగినంత ధనసహాయముచేస్తేగదా, కళాశాలలకు కావలసిన equipment ను తెప్పించుకొని, విద్యయొక్క standard సమానంగాఉండేటట్లుగా maintain చేయటానికి అవకాశము ఉంటుంది? ఈమధ్య University Grants Commission వారు ప్రైవేటు కళాశాలలకుగూడ కొంతవరకు ధనసహాయము చేయటానికి తీర్మానించుకున్నట్లుగా తెలుస్తున్నది ఆకమిషనువారిని యీవిషయములో మనము అభినందించవలసియున్నది. అయితే University Grants Commission వారు యిచ్చేటటువంటి సహాయముమీద, తరువాత మన ప్రభుతము యిచ్చేసహాయముమీద, యీ కళాశాలలు ఆధారపడియుండవలసి ఉంటుంది. ప్రభుత్వమువారు సహాయము కొంతవరకుయిస్తే, తరువాత University Grants Commission వారు యిచ్చేదానితో కళాశాలలకు కొంతవరకు ఉపయోగముగా ఉంటుంది అంతేకాని కేవలము Grants Commission వారు యిచ్చేదానిమీద ఆధారపడితే ప్రయోజనముఉండదు. అందుచేత University Grants Commission యిచ్చే మొత్తమునుబట్టి, యిప్పుడు మనకు ఉన్నటువంటి కొద్ది కళాశాలలను సరిజేసుకోటానికే సరిపోతుందికాని, రాబోవు అయిదు సంవత్సరములలోను, యింకా మనయొక్క అవసరములనుబట్టి ఎక్కువగా కళాశాలలను ఏర్పాటు చేసుకోవాలని తలంచినప్పటికినీ, ఏర్పాటు చేసుకోవటానికి అవకాశమే ఉండదు. అందుచేత ప్రభుత్వము యీ కళాశాలల విషయములో కొంతవరకు ఉదారముగా ఉంటేనే బాగుంటుంది. కాని ప్రభుత్వమునకు అటువంటి ఉదార స్వభావము ఉన్నట్లు కన్పించదు.

ఇకపోతే, తిరుపతి వెంకటేశ్వర విశ్వవిద్యాలయము క్రొత్తగా నెలకొల్ప బడిందని మనకందరికి తెలిసిన విషయమే. ఈ విశ్వవిద్యాలయమునకు ప్రభుత్వము ఎంతో సహా

(Sri S B P Pattabhirama Rao) [13th March 1956

గనుక చేయవలసి ఉన్నది. శైశవావస్థలో ఉన్న యీ విశ్వవిద్యాలయము పుష్టికరమైన ధనసహాయము పొందకపోతే, దానికి చాలా రిష్టము సంభవించి, దానియొక్క అభివృద్ధియే కుంటుపడిపోవచ్చు. ఎన్నో కష్టములను ఎదుర్కొని, యీ విశ్వవిద్యాలయమును నెలకొల్పిన భాగ్యము శ్రీ ప్రకాశం పంతులు గారికి దక్కింది. కాని అదివృద్ధికి రాకుండా ముగించేసే భాగ్యము ఎవరైనా దక్కించుకోతలుస్తారేమో నేను యిప్పుడు చెప్పలేను కాని, దానియొక్క ప్రస్తుత పరిస్థితులను బట్టి మన ఆర్థిక మంత్రిగారు దానిని ఉదారముగా చూడకపోతే, దానియొక్క అభివృద్ధికి అనర్థకములు, అడ్డంకులు కలుగుతాయేమోనని నేను భయపడుతున్నాను. అందులో యీ విశ్వవిద్యాలయము అభివృద్ధికి రావాలంటే, ప్రభుత్వము యొక్క ఆదరణ ఎంతో అవసరము. ప్రభుత్వము యొక్క ఆదరణ, ధనసహాయము సరియైన పద్ధతిలో వుంచాగా యీ విశ్వవిద్యాలయమునకు కలుగకపోతే, అది వెనుకబడిపోతుంది. పైగా అక్కడ చదివే విద్యార్థులు నిరుత్సాహ పడిపోతారు. తరువాత ప్రభుత్వము ఎంత ప్రయత్నించినను, ఆ విశ్వవిద్యాలయమును ముందుకు తీసుకుని రాలేరని నేను హెచ్చరిక చేస్తున్నాను. పైగా ప్రక్కన ఉన్న చిన్న విశ్వవిద్యాలయముల దృష్టి ప్రభుత్వము చిన్న పేరు సంపాదించుకుంటుందేమోనని నాకు భయములేకపోలేదు. మొట్టమొదటలో యీ విశ్వవిద్యాలయము బాగా పైకి వచ్చినప్పుడు దానియొక్క స్థాయి తగ్గిపోకుండా ఎప్పటికప్పుడు సరియైన పద్ధతిలో ప్రభుత్వము ముందుకు తీసుకొని రావటానికి ప్రయత్నిస్తూ ఉండకపోతే యీ విశ్వవిద్యాలయము వెనుకబడిపోతుంది. ఈవిశ్వవిద్యాలయము ఎంతో ముందుకువచ్చి, దేశంలో ఉన్న అన్ని విశ్వవిద్యాలయములకంటె ఎక్కువ పేరు సంపాదించగలదన్న ఆశయములతో ఎంతో ఉత్సాహపూరితముగా నెలకొల్పబడింది. ఎన్నో అవకాశములున్న యీ విశ్వవిద్యాలయము అభివృద్ధికాకుండా, కుంటుబడేటట్లు చేసేబదులు, చివరకు ప్రభుత్వం ఆదరణకూడ దీనికి లేకపోయిందనేమాట రాకుండా, దీన్ని నానాటికి కృశింపజేసి తుదకు క్షీణదశకు తీసుకునివచ్చేబదులు, యీ విశ్వవిద్యాలయమును తీసివేయడమే మంచిదికాని, అక్కడే మనఎదుట పేరుకు ఒకవిశ్వవిద్యాలయము ఉంచి, మనఎదుటనే దానిని క్షీణింపచేయడం మంచిదికాదని నాసలహా. ఈ వెంకటేశ్వర విశ్వవిద్యాలయమునకు University Grants Commission వారు ఇరవై అయిదు లక్షలు ధనసహాయము చేయటానికి పూనుకోవటము మనము నిజంగా సంతోషించవలసిన విషయమే కాని దానికితోడు సరియైన భాగము మన ప్రభుత్వంకూడా యివ్వవలసిందే. అంతవరకు కాకపోయినా కనీసము పది లక్షలుఅయినా ప్రభుత్వముయిస్తే బాగుండేది. కాని అందులో అయిదింట నాలుగు వంతులు ప్రభుత్వం యివ్వటానికి, మిగతా ఒక వంతు విశ్వవిద్యాలయమువారు యివ్వటానికి ఏర్పాటు చేసుకున్నారు. ఆ డబ్బుకూడ కొద్దిగా యివ్వకపోతే యీ విశ్వవిద్యాలయము యొక్క పురోభివృద్ధికి దెబ్బతగులుతుందని నేను మనవిచేస్తున్నాను. ఆ విధముగా చేస్తే అది ఆంధ్రుల అదృష్టమేనని అనుకోవలసి ఉంటుంది. ఇప్పుడు మనకు ఉన్న రెండు విశ్వవిద్యాలయములు చేసిన పూజాఫలితము బాగా ఉందని నా అభిప్రాయము. మన ఆర్థిక మంత్రిగారైన గోపాలరెడ్డిగారు విద్యాశాఖకు మంత్రిగా ఉండడము, ముఖ్యమంత్రిగా ఉండడము, ఒకే కాలమందు మన ఆంధ్ర యూనివర్సిటీకి, వెంకటేశ్వర యూనివర్సిటీకి యీ రెండింటికీ కూడ prochancellor కావడము, నిజముగా యీ రెండు Universities చేసుకున్న పూజాఫలితమేనని నా అభిప్రాయము. ఇది వారి జీవితములో

13th March 1956] (Sri S. B. P. Pattabhirama Rao)

అపూర్వ సంఘటన అనే నేను తలంచుచున్నాను. అట్టితెరిని యీ రెండు విశ్వవిద్యాలయములను గూడ ఉదార స్వభావముతో జాగ్రత్తగా కనిపెట్టి, పోషిస్తూ, వాటిని ఉన్నత స్థాయిలోనికి ప్రభుత్వము తీసుకొని రాగలిగితే, విద్యాశాఖా మాత్యులుగా ఉన్నందుకు, ఆర్థిక శాఖకూడ వారిచేతులలోనే ఉన్నందుకు, ఆంధ్రచరిత్రలో గోపాలరెడ్డిగారి కీర్తి ప్రతిష్టలు చిరస్థాయిగా నిలవటానికి అవకాశ ముంటుంది. University education విషయములలో వారు నిజంగా ఎంతో కృషిచేసి ఆంధ్రదేశములోని విద్యార్థిలోకానికి, అమూల్యమైన లాభము కలిగించిన వారవుతారని నేను నమ్ముతున్నాను.

ఇక ప్రాథమిక పాఠశాలలను గురించి చెప్పాలంటే, అసలు అది నాకు ఎంతో అగమ్యగోచరముగా కనబడుతున్నది. దానికోసము నేనుగూడ ఎంతో తంటాలు పడినాను గాని, నాకు మాత్రము వాటిని అన్నివిధములుగా అభివృద్ధి చేయటానికి మార్గము ఏమీ కన్పించలేదు. ఏది అయినా ఈ పాఠశాలల విషయములో సరిజేసిచూస్తే మంచిదని ప్రయత్నించాను. కారణమేమిటంటే అసలు యీ ప్రథమికవిద్య అనేది విద్యాలయమునకు పునాదిరాయి అని నానమ్మకము. అసలు యీ ప్రాథమికవిధ్య అనేది సరియైన పద్ధతిలో నడిపించకపోతే, అందులో పనిచేసే ఉపాధ్యాయులు, చదువుకునే విద్యార్థులు సరియైన పద్ధతిలో లేని రోజున అసలు దేశానికే పెద్ద అరిష్టమని నానమ్మకము. ఈ ప్రాథమిక విద్యను ఎట్టి పరిస్థితులలోనైనా ఎంత ఉన్నత స్థాయికి తీసుకుని వస్తే దేశము అంత త్వరగా బాగుపడుతుందని నేను అభిప్రాయపడుతున్నాను. ప్రాథమిక పాఠశాలలు భవనాలు ఎక్కడ చూచినా, అందులో పనిచేసే ఉపాధ్యాయులను ఎక్కడ చూచినా, ఎంతో అధ్వాన్నపు స్థితి తెలుపు చున్నది. ఆ స్థితినుంచి వెంటనే తప్పించి, మంచిస్థాయిలోనికి ప్రభుత్వము తీసుకునిరాకపోతే, యిక మనకు మోక్షము చాలా దూరములో ఉన్నదని భావించవచ్చు. ఉపాధ్యాయ వర్గముయొక్క కష్టమును నివారణకాకుండాఉంచి, పాఠ్యగ్రంధాలు యధాప్రకారముగానేఉంచి, యిప్పుడుజరిపే మాదిరిగానే ముందుకూడ జరిపేటట్లు అయితే, లక్షలాదిగాఉన్న మన బిడ్డలు క్రమశిక్షణ విషయములోగాని standardలోగాని, శీలపద్ధతులలోగాని, మార్పుచెంది ముందుకు రావటానికి అవకాశము ఏమాత్రము ఉండదు. మన భావిభాగ్యోదయములు యీ పశికందులమీద ఆధారపడి ఉన్నవని గుర్తించాలి. పాథమికవిద్యలో ముందుకు పోవటానికి తగినమార్పులు వెంటనేచేసి, మనబిడ్డలను ముందుకు తెచ్చుకోకపోతే మన బిడ్డలు ఏవిధముగా ఉన్నతవిద్యకు ముందుకు పోగలరో ఆలోచించాల్సిఉన్నది. అందుకనే ప్రాథమికవిద్యకుగాను ప్రభుత్వానికి హెచ్చుగా ఖర్చుఅయినప్పటికినీ, ముందుకాలాని కనుగుణముగా సరియైన పద్ధతిలో మనబిడ్డలను ముందుకు తీసుకుని రావలసినబాధ్యత, అవసరము, ప్రభుత్వముమీదనే ఉన్నది. ఆర్థికమాత్యులుగా ఉన్నారుగనుక, డబ్బు దేనిమీదనైనా invest చేస్తే మంచి dividends రావాలి, చాలా కాలముపాటు రావాలి అనే ఆలోచన కలుగవచ్చు. బిడ్డలమీద ఎంతసొమ్ము invest చేసినను, అందులోనుంచి ఒక్క దమ్మిడీ కూడా పోకుండా return రాగలదు. బిడ్డలమీద చేసే investment కంటె, వేరే అంతకు మించినవి ఉండవు. బిడ్డలమీద invest చేస్తే, వారు బాగుగా చదువుకొని, ఉన్నత విద్య నభ్యసించి, ఉత్తీర్ణులై, మన రాష్ట్రమునకే ఎన్నో విధాలుగా ఉపయోగిస్తారు. వారు పనిచేసే సంస్థలమూలంగా ప్రభుత్వానికి వచ్చే డబ్బు అంతా, ఆదాయము క్రింద లెక్కవేయవచ్చు. కాబట్టి ఇది long term investment గా

(Sri S. B. P Pattabhirama Rao) [13th March 1956

నున్న ప్పటికినీ long term dividends ను యిచ్చేదిగా ఉండగలదని విద్యాశాఖా మాత్యులైన గోపాలరెడ్డిగారికి మనవి చేస్తున్నాను.

ఇక కుప్పుస్వామి కమిటీ సిఫార్సుల గురించి ఒక విషయము మనవిచేయదలచాను. అదేమి దురదృష్టమో గాని, ఆ కమిటీని వేసిన ముహూర్త లక్షణమో, ఎటువంటిదో, ఏమో గాని, ఆకమిటీ నివేదిక వచ్చినది లగాయితు అందులోని సిఫార్సులన్ని గూడ ఇంతవరకూ ప్రభుత్వ పరిశీలనలోనే ఉండిపోయినవి. మాసాల తరబడి కాకుండా, సంవత్సరాల తరబడిగా పరిశీలించబడుతున్నవి. కాని అందులోని సిఫార్సులు కొన్ని అయినా ఆచరణలో పెట్టినట్లయితే ఆంధ్రదేశము బాగుపడుతుందని నమ్మేవారిలో నేను ఒకణ్ని. ఆకమిటీని వారు విద్యా నిపుణులు, రాజ్యాంగ నిర్వహణలో బాగుగా ఆరితేరిన అనుభవశాలురు, అటువంటి అనుభవజ్ఞులు ఎంతో కష్టించి, బాగుగ ఆలోచించి వారికి ఉన్న అనుభవము, బుద్ధిబలము, విజ్ఞానము ఉపయోగించి ముందు కాలాను గుణ్యముగ విద్యను వృద్ధిలోకి తీసుకుని రావటానికి సిఫార్సులను చేశారు. ఆ సిఫార్సులన్నీ కమిటీ వారు ఏకగ్రీవంగా ఆమోదించి ప్రభుత్వానికి అందజేశారు. ఆ సిఫార్సులు అన్ని జన సమ్మతముగా ఉన్నవని మనవి చేస్తున్నాను.

అధ్యక్షు మహాశయులు యిప్పుడు తన స్థానములో లేరు. ఇతరులమాట అటు ఉండనిండి, అధ్యక్షుల వారుకూడ ఆ కమిటీలో ఉన్నవారే. కాబట్టి ఆ సిఫార్సుల విలువ వారికి పూర్తిగా తెలుసు. ప్రజలుగూడ ఆ సిఫార్సులమీద ఎన్నో ఆశలు పెట్టుకుని ఉన్నారు. నిజమే. కాని ఒక్క రాత్రిగా, over-night యీ సిఫార్సులన్నీ అమలులో పెట్టటానికి అవకాశము ఉండదు. అందుకు నేనుకూడ ఒప్పుకుంటున్నాను. కాలాను గతిని బట్టి, అందులో కొన్ని సిఫార్సులు అయినా ఆచరణలో పెట్టినప్పుడే, విద్య విషయములో మనబిడ్డలకు లాభము చేకూరగలదని నేను పూర్తిగా నమ్ముతున్నాను. అయితే ఆర్థికబాధ్యతలు గుర్తించి చేసిన సిఫార్సులు కావేమోనని మన ఆర్థికశాఖా మాత్యులకు అనుమానం ఉంటే ఉండవచ్చు. అందులో అనుమానము కాదు కాని, అది వారి నిశ్చితాభి ప్రాయమే.

వారుచేసినకొన్ని సూచనలనైనా ఆచరణలో పెట్టి ఉంటే, ఆర్థికలాభంకూడా కని పిస్తుందనే నమ్మకం నాకుంది అది ఒక పూచీఅని భయపడుతున్నంతకాలం ఈవిషయంలో మనమేమీ చేయడానికే అవకాశంలేదు. అందులో ఎన్ని ఆచరణలో పెట్టడానికి అవ కాశాలుంటాయో అని ఆలోచించి ఒకనిర్ణయం తీసుకుని కొన్నయినా చెయ్యడానికి ప్రయత్నిస్తే ఆకమిటీచేసిన సిఫార్సులు దేశానికి ఉపకరిస్తాయని నా నమ్మకం. ఉపాధ్యా యుల జీతాలు పెంచ్చించాలని మంత్రిగారు చదివారు. దాన్నిగురించి కేవలం ఉపాధ్యా యులే కాకుండా ఇతరులుకూడా నినాదంచేస్తున్నారని అన్నారు. నిజమే. చేయకుండా ఎల్లా సాధ్యమౌతుంది ? డొక్క మాడుతూ ఉపాధ్యాయుడుగా ఉండమంటే అది సాధ్య మయ్యే విషయంకాదు. నేను ఈనాడేకాదు. మంత్రిగా ఉండగాకూడా చెప్పాను ఆమాట. అది సాధ్యమయ్యే విషయంకాదు. అదిన్యాయమూ కాదు. అందుచేత మరో వృత్తిచేసి అతడు సంపాదించుకోకపోతే రెండుపూట్ల భోజనంచేయడానికే గతిలేదు. ఆపరిస్థితులలో అతడు ఈపని వదలుకుని, ఇంకోపనిలోకి వెళ్ళడానికి మనం అవకాశం కల్పిస్తున్నాం ఏదోవిధంగా కొంతైనాచేస్తే తప్ప వీలులేదను కున్నప్పుడు అది ప్రాథమిక

దశలోనే మనం మొదలుపెట్టి, ఉపాధ్యాయునికి కొంత సహాయంచేయడం అవసరమని నేననుకుంటున్నాను. మనం విడిపోయివచ్చిన తరువాత మదరాసు రాష్ట్రంలో 5 రూపాయిలు ఒక్కొక్క ప్రాథమిక ఉపాధ్యాయుడికి ఇచ్చారు. వాళ్ళిచ్చిన తరువాత ప్రక్క రాష్ట్రంలోయున్న మన వాళ్ళకి ఎంతబాధకల్గి ఉంటుందో మీరే ఆలోచించండి. ఇంతవఱకూ ఓపికతో వాళ్ళున్నారంటే నాకే ఆశ్చర్యంగాఉంది. ఇది బెంగాలులో వలె ఉద్రిక్త పరిస్థితులకు దారితీయకుండా పోయినందులకు సంతోషిస్తున్నాను. ఏదో విధంగా సహాయం చెయ్యాలని కూడా నేను ఆశించాను. అప్పటి ఆర్థిక పరిస్థితులనుబట్టి అది సాధ్యం కాకపోయింది. ఇప్పుడు కూడా పరిస్థితులల్లాగే ఉన్నాయి. కాని అందులో ఒక సూచన ఉన్నది. పుస్తకాలు publish చేసి దానివల్ల వచ్చె లాభం ఏమైనా ఉంటే అది సర్దడానికి వీలుంటుం టేదేమో నని ఒక ఆశ ఉన్నది. ఆదే వారు సూచన చేశారు. ఐతే పుస్తకాలు publish చేయడం ఎంత వఱకూ వీలవుతుందో కాదో విచారించ డానికి ప్రభుత్వమువారు ఈ మధ్య ఒక కమిటీ వేశారు. ఆ Committee report ఏమయిందో నాకు తెలియదు కాని ఆ విషయమై ప్రయత్నించి దాని వల్ల వచ్చే డబ్బు ఈ విధంగా ఉపయోగించుట వలన అనేక లాభాలున్నాయి. ఉపాధ్యాయులకు జీతం ఇవ్వడమే కాకుండా ఇప్పుడున్నటువంటి అవినీతి పద్ధతులలో పుస్తకాలు ఉపయోగించ బడడం ఒకటి తగ్గుతుంది. Standards maintain అవుతాయి. ఇటు అనంతపురం లగాయతు అటు శ్రీకాకుళం వఱకూ విద్యార్థులందరకూ ఒక పద్ధతిలోనే పాఠాలు చెప్పడానికి వీలుంటుంది. రాజమండ్రిలో గవర్నమెంటుకు paper mill ఉన్నది. ఆ paper mill లో తెల్ల కాగితం తయారుచేసి, ఆ తెల్లటి కాగితాలను పుస్తకాలుగా bind చేసి దానికి అక్కడే ఒక binding section, ఒక ruling section పెట్టి ఆ note books స్కూళ్ళకు supply చేయగలిగితే దానివల్ల ఏకొద్దిపాటైనా లాభం రాకపోదు. ఈ రోజు పైగా అమ్ముకునే వర్తకుడు మరల మరల లాభాలు చేర్చుకునే విద్యార్థులకు ఇస్తున్నాడు. కాని లాభం లేకుండా ఇవ్వడం లేదు. దానివల్లకూడా కొంతలాభం రావడానికి అవకాశం ఉంటుందని నేను మనవి చేస్తున్నాను. Aided schools అన్నిటినీ కూడా ప్రభుత్వాధి కారములోకి తీసుకు రావాలని సూచించారు అది మంచిదే. అది నెల్లూరులో కొంతవఱకూ మొదలు పెట్టారని అంటున్నారు. అక్కడ ఏ విధంగా లాభము వస్తుందో చూచి extend చెయ్యడం మంచిదని నా అభిప్రాయం. ఇంతకు ముందే ముఖ్యమంత్రిగారు printed memorandum వచ్చే పద్ధతి చూపించి, నాచేతి కిచ్చారు. నాకు కూడా తెలుసది. జీతాలు ఎక్కువ కావాలి, అట్లాంటి విషయాలు represent చేయవలసియుంటే Print చేసి పంపించేస్తారు. అందులో సంతకాలో, వేలు ముద్రలో మారుస్తారు. ఒకడే పెడతాడని నాకనుమానమే. ఈ పద్ధతిలో ఆందోళన చెయ్యడం వల్ల నిజంగా అసలు సమస్యకు దెబ్బతగులుతుందేమో నని నాకనుమానం లేకపోలేదు. ఎందుకు printed కాగితాలు ? ఒకరో ఇద్దరో సరియైన పద్ధతిలో విషయం చెప్పినప్పుడు ప్రభుత్వం దాని విషయమై యోచన చెయ్యడానికి వీలవుతుంది, కాని ఆసేతు హిమాచలపర్యంతం ఒకటే పద్ధతిలో Print చేసి ఆ కాగితాలు పంపిస్తే, Postal Department కు, అంటే కేంద్ర ప్రభుత్వానికి లాభం కలిగితే కలగవచ్చునేమో కాని ఇక్కడ ప్రభుత్వానికి పని హెచ్చుతుంది, అంతకంటె లాభం ఉంటుందని

(Sri S. B. P. Pattabhirama Rao) [13th March 1956

నేననుకోవడంలేదు. ఇక విద్యార్థులకు వయస్సు నిబంధనలు ఏర్పరిచారు. అది అవసరమా అని నా ప్రశ్న. పది సంవత్సరాలు పూర్తి అయితేనే Ist Form లో చేర్చుకోమన్నారు. కాని 19 సంవత్సరాలకు పూర్వం ఆ విద్యార్థి చేయవలసినది ఏమిటి? మేనమేకలు కాచిపెట్టుకుంటూ కాయవలసినదేనా? లేక ప్రాథమిక పాఠశాలలు తగినన్ని ఉండి వసతులన్ని ఉండే అంతగా ఏర్పడవా? లేక విద్య నేర్పడానికి, క్రీడా వినోదాలకు ప్రభుత్వం వసతులు ఏర్పరచడానికి వీలవుతుందా? అంటే దానికి డబ్బులేదు. అది సాధ్యంకాదు అందుచేత ఈ 10 సంవత్సరాల age limit పెట్టడం అనవసరమేమోనని నా అభిప్రాయం. నాకు తెలిసినంత మట్టుకు విద్యార్థులు 15 సంవత్సరాల వయస్సులోనే కాదు 14 సంవత్సరాలకు కూడా school final పాసై మెరికలవలె సైకె వెళ్ళి పై పరీక్షలలో కూడా ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులైన వారిని నేనెరుగుదును. ఒక విద్యార్థి 14 సంవత్సరాలలో school final పాసై Intermediate లో 5 subjects లో 4 distinction లు తెచ్చుకున్నాడు. University లో Honours లో 1st Class లో వచ్చాడు. University records break చేశాడు. రెండు gold medals తెచ్చుకున్నాడు, ఏమి తేడా వచ్చింది అతనికి, ఏమీ తేడారాలేదే. ఈవిధంగా ఉన్నారు. లేకపోలేదు. Rules అన్నింటికీ exception లుంటాయి. ఆ exception లు తీసుకువచ్చి ఈవిధంగా 10 సంవత్సరాల నిబంధన చేయడం సరియైనపద్ధతి కాదు. బీదవాళ్ళు అంతకాలం ఊరికేనే ఇంట్లో కూర్చోపెట్టుకుని చదువు చెప్పించకుండా ఉండడం సాధ్యమయ్యే విషయంకాదని నేననుకుంటున్నాను. సంస్కృత బోధనకు తీసుకొనుచున్న శ్రద్ధకు ప్రభుత్వాన్ని మనసారా అభినందిస్తున్నాను. అది అవసరమే. కాని అది 'at the expense of Telugu' చేయకూడదని మాత్రం మనవి చేస్తున్నాను. ఎందుచేతనంటే మాతృభాషకు ఎంతో ఉపకారం చేయవలసిన కాలం ఇది. ఇంతకాలం ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో ఉండడం చేతనైతే నేమి, పరాయి ప్రభుత్వాల చేతులలో ఉండడంచేతనైతేనేమి తెలుగుకు ఏమీ చేసుకోలేక పోయినాము. తెలుగుకు సరియైన స్థానం లేకపోయింది. ఈ రోజున తెలుగుకు సరియైన స్థానం ఇచ్చి తరువాత సంస్కృతానికి స్థానం ఇవ్వడం మంచిదని నేను మనవి చేస్తున్నాను. సంస్కృత భాష వస్తేచాలు, తెలుగులో కూడా పాఠాలు చెప్పవచ్చనే orders జారీ చేసినట్లు తెలుస్తున్నది. ఇది విద్యార్థులమీద experiment చెయ్యడం అవుతుందేమోనని నాకు భయం లేక పోలేదు. సంస్కృతం వచ్చినంత మాత్రాన సకల విద్యాపారంగతుడు అంటే మాత్రం నేను నమ్మేవాణ్ణికాను. తెలుగులోకూడా సరియైన ప్రోత్సాహం ఉండాలి. అందులో నన్నయామాత్యులతో అధ్యక్షోపన్యాసం చేసినటువంటి శ్రీ విద్యామంత్రిగారు తెలుగు భాషకు తగినంత ప్రోత్సాహం ఇస్తారనీ అది వారి కనీస ధర్మమనికూడా నేను మరీ మరీ మనవిచేస్తున్నాను. నన్ను అపార్థం చేసుకోకుండా ఉంటే ఇప్పుడున్న యదార్థం గ్రహించమనికూడా నేను కోరుతున్నాను. అనేక పాఠశాలలలో middle schools లో ఐతేనేమి, high schools లో అయితేనేమి తెలుగులో qualified teachers లేరు. అర్హతలులేని ఉపాధ్యాయులనే వేసి తెలుగు చెప్పమంటున్నారు. వారిని తెలుగు చెప్పమనడం సరియైన పద్ధతికాదు. ఇప్పుడు సంస్కృతం చదివినవారిని తెలుగుకూడా చెప్పమంటే ఇంక తెలుగే చదవరు. ఆసంస్కృతంకూడా వారికి పూర్తిగా వచ్చునోరాదో! మా ఊళ్ళో high school లో ఈ సంవత్సరం qualified తెలుగు

13th March 1956[ (Sri S. B. P. Pattabhirama Rao)

మాస్టరేలేరు. అంటే నాబోటిగాడెవరో తెలుగు చెప్పారన్నమాట. తెలుగులో పూర్తి ప్రవేశంలేని teacher తెలుగు చెబితే ఆ విద్యార్థులు School Final పరీక్షకు వెళ్ళి ఏమి వ్రాస్తారో వారు ఏవిధంగా పాసవు తారో భగవంతునికే ఎరుక. వాళ్ళనిఅని ఏమీలాభం లేదు నాకు తెలిసినదాన్ని ఉదాహరణ పూర్వకంగా మీకు మనవి చేశాను. ఇంతవరకూ నా జీవితాన్నంతా విద్యార్థి దశనుండే విద్యానిలయాలలోనో, విశ్వ విద్యాలయాలలోనో గడిపి, విద్యాభివృద్ధి మనసారా కాంక్షించి. సరస్వతీదేవినే పరమావధిగా సేవించి నాకుతోచిన నాలుగు మాటలు చెప్పాను. విశాలహృదయులూ, రసజ్ఞులు, బహుభాషా కోవిదులు ఐనటువంటి ముఖ్యమంత్రిగారు అన్యధాభావింపకుందురుగాక. చర్చిల్ మహాశయుడు చెప్పినట్లు ఈ తరంవారంతా కష్టించి పనిచేయడమే గత్యంతరం ఐనది. కష్టించి పనిచేయాలనీ త్యాగాలు చేయాలనీ, దేశ శ్రేయస్సును వ్యక్తి శ్రేయస్సుకంటె పై అంతస్థులో ఉంచుకోవాలని, ప్రతి ఒక్కరూ గుర్తించాలి.

* Sri B. P SESHA REDDI — అధ్యక్ష మహాశయా, హైస్కూలు విద్యావిధాన విషయములో ముఖ్యమంత్రిగారి దృష్టికి తెచ్చేదానికి ఈ Cut motion ఇచ్చి ఉన్నాను. ఏమనగా హైస్కూళ్ళలో ట్రైనింగు అయిన ఉపాధ్యాయులు హెచ్చుక్లాసులకు బొత్తిగా దొరకడములేదు. మరియు టెక్నికలు P. T I. వగైరా ట్రైనింగు అయిన Teachers వేటికి దొరకకుండా ఉన్నారు. ఈ విషయములోను నా అనుభవము లోని విషయాలు తెలుపుచున్నాను. నేను ఒక హైస్కూలును అయిదు సంవత్సరాలుగా మేనేజి చేస్తున్నాను. దానికి L T. Teacher అయినా, Technical Teacher అయినా కావలెనని advertise చేసినప్పటికి హెచ్చు జీతాలు కూడా offer చేసినప్పటికి కూడా ట్రైనింగు అయిన ఉపాధ్యాయులు దొరకడము లేదు. అందువల్ల Inter, B A. fail అయిన వారిని పెట్టుకొని మేము manage చేస్తున్నాము. ఇందుకు కొన్ని L T Colleges క్రొత్తగా ప్రారంభించి ఈ హైస్కూళ్ళకు ఉపాధ్యాయులను తయారు చెయ్యవలెనని ముఖ్య మంత్రిగారి దృష్టికి తెచ్చుచున్నాను అట్లా క్రొత్త College పెట్టడానికి వీలులేకపోతే క్రొత్తగా హైస్కూళ్లు పెట్టడానికి కొంత restriction చేస్తే బాగా ఉంటుంది. లేకపోతే విద్యార్థులయొక్క standard చాలా తగ్గిపోతుంది హీనదశకు వస్తుందని వారిదృష్టికి తెస్తున్నాను.

మరియు ప్రాథమిక విద్యావిషయములో కొన్ని విషయాలు వారి దృష్టికి తెస్తున్నాను. గతసంవత్సరము బడ్జటు విషయములో పూర్వపు స్కీములు చక్కగా జరగడములేదు అనియు వీటికి supervision staff లేదనియు, ప్రాథమిక స్కూల్సు చక్కగా జరగవనియు ఈ విషయములో మంత్రిగారు కొన్ని స్కూల్సు చూడవలెనని నేను మనవి చేస్తున్నాను. వీటి విషయమై మంత్రిగారు శ్రద్ధ తీసుకొనడము లేదు. వారు ఈ విషయమై ముఖ్యముగా కొన్ని schools తణిఖీచేసి వాటి లోట్లు తెలుసుకొని ఆ విద్యా విధానము బాగుపరచవలెను అని వారి దృష్టికి తీసుకొని వస్తున్నాను. ప్రతిసంవత్సరము క్రొత్త స్కూల్సు ప్రారంభం చేస్తున్నారు గాని అవి సరిగా జరుగుతున్నవా ? అనే విషయము ఎవరు చూడడము లేదు. సంవత్సరానికి ఒక సారి స్కూళ్ళ ఇన్‌స్పెక్టరుపోయి పరీక్ష చేసి report చేస్తారు గాని మిగతా

దినములలో ఆ స్కూల్సు జరుగుతున్నవా, లేదా అనేది ఎవరూ కూడా చూడడములేదు. వారికి ఇచ్చే వేతనములు చాలినంత లేవని నా అభిప్రాయము. వేతనములు వృద్ధి చేస్తేనే గాని వారు చక్కగా చెప్పడానికి అవకాశము ఉండదు. మరియు క్రొత్త స్కూల్సు ప్రారంభము చేసేముందు కొంత Supervise Staff increase చేసి స్కూల్సు సరిగా జరిగేటట్లు ముఖ్యమంత్రిగారు శ్రద్ధ తీసుకోవలెనని వారి దృష్టికి ఈ విషయము తీసుకొని వస్తున్నాను.

ఇంకొక ముఖ్యవిషయము, Budget లో స్కాలర్షిప్పు, హైడ్రసుకు 19 వేలు మాత్రము ప్రొవిజను చేసినారు, అది చాలదు. వారు ఇబ్బందిని ఎక్కువగా తీసుకుంటున్నారు గోదావరి పుష్కరం కోసము వారు ఎక్కువ శ్రద్ధ తీసుకుంటున్నారు. ట్రైనింగు సెంటర్సు కావలసి ఉంది. కాబట్టి 19 వేలు చాలదు. 34 వేలకు వృద్ధి చెయ్యాలని ముఖ్యమంత్రిగారి దృష్టికి తీసుకొని వస్తూ నేను విరమించుచున్నాను.

Sri S BRAHMAYYA — ఉపాధ్యక్షా! ముఖ్యమంత్రి డాక్టరు గోపాల రెడ్డిగారు విద్యాశాఖామాత్యునిగా ప్రవేశ పెట్టిన 4,78,75,100 రూపాయిల విద్యాపద్దును నేను బలపరుస్తున్నాను. గతసంవత్సరము విద్యాపద్దుమీద 5,16,56,000 కోరబడింది. ఈ సంవత్సరము ఇంత తక్కువగా కోరడములో చాలా కిఫాయతు కనపరచేరు. ఇందుకు వారిని ప్రశంసించక తప్పదు. ప్రాథమిక విద్యలోను ఉన్నత విద్యలోను చాలా సంస్కరణలను తీసుకు వచ్చేరు. ఇందుకు అభినందించవలసి ఉన్నది. మాజీ మంత్రి శ్రీ S. B. P పట్టాభి రామారావుగారు ఈ విద్యా పద్దుమీద మాట్లాడుతూ వారియొక్క అనుభవాలను క్రోడీకరించి, గంభీరోపన్యాసం చేశారు. అనుభవజ్ఞులైన కారణముచేత పదమూడు మాసములు విద్యామంత్రిగా ఉన్న కారణంచేత ప్రభుత్వ లోటుపాటులు వారికి చక్కగా తెలుసును. తెలిసికూడా వారి కాలములో ఎక్కువ సంస్కరణములను తీసుకు రావటానికి అవకాశము లేకపోయినా ఇలా సంస్కరణలు తీసుకొని రావలెనని సూచన చెయ్యడానికి మాత్రము నేడు అవకాశము తీసుకున్నందుకు వారిని నేను అభినందిస్తున్నాను. మనము సభ్యులమైన వారము, సూచనలు చెయ్యడము తేలికగా ఉంటుంది. కాని ఆచరణలో పెట్టడము కష్టసాధ్యము అన్నమాట గుర్తుంచుకో వలయును. అయినప్పటికి కూడా కనీసము యీ సూచనలను ముందుముందు దృష్టిలో ఉంచుకొనవలసిన అవసరం ఉన్నదని మనవిచేయ్యడము మన విద్యుక్తధర్మము. వాటిని ఆచరణలో పెట్టడానికి తగిన శ్రద్ధాసక్తులతో కృషిచెయ్యడము మంత్రిగారి ధర్మమై ఉన్నది. నేను మాట్లాడవలసినవి రెండు విషయాలు.

సంస్కృత బోధనా నిమిత్తం ప్రభుత్వం ఈ సంవత్సరం విద్యా పద్దులో కనపరచిన విశేషాన్ని ప్రశంసించక తప్పదు. కాలగర్భంలో మరుగుపడిన ప్రాచీన భారత సంస్కృతిని పునరుద్ధరించే ఉద్దేశ్యముతో ఈ సంస్కృత భాషాప్రచారం అవసరమైనదిగా గుర్తించబడింది. సంస్కృతభాషను మృతభాషగా పరిగణించినా దానిని పునరుజ్జీవింప చెయ్యాలనే ఉద్దేశంతో ఉత్సాహము కనపరుస్తున్నారు. ఈ ప్రాచ్య విద్యాలయాలలో చేరిన విద్యార్థులకు ఆరవఫారము వరకు ఉచితముగా విద్యాబోధన ఏర్పాటుకు ప్రభుత్వం ఉద్దేశించింది. ఇది ప్రశంసనీయము.

13th March 1956] (Sri S. Brahmayya)

హిందూ దేవాదాయ మతసంస్థల బోర్డు నిర్వహణశాఖ విజ్ఞులు అయిన గౌరవనీయులైన శ్రీ చంద్రమౌళిగారి చేతుల్లో ఉన్నది. వారు ఎంతో ఆసక్తితో దేవాలయ పునరుద్ధరణ కోసము నిరంతరం కృషి చేస్తున్నారు. అనేక దేవాలయాలకు లక్షల ఆస్థిపాస్తులు ఉంటూవున్నవి. అవి వ్యక్తిగతముగా అనుభవించుచున్న పెద్దలనుంచి జమా ఖర్చులు సరిగా ఉంచేటట్లు చెయ్యడమే కాకుండా మూల ధనములో పెద్ద పెద్ద దేవాలయాలలో సంస్కృత పాఠశాలలు స్థాపించి తద్వారా సంస్కృత భాషా ప్రచారము చెయ్యడము అవసరమని మనవిచేస్తున్నాను.

హిందీ విషయములో మొన్ననే జనరలు బడ్జెటు మీద మాట్లాడవలెనని అనుకున్నాను. అధ్యక్షులవారు ఎక్కువ కాలము ఇవ్వకపోవడంవల్ల నేను ఏమీ మాట్లాడలేదు. అందుచేత ఈనాడు హిందీ భాషను గురించి మాట్లాడే అవకాశం ఇవ్వండి అని నేను ఉపాధ్యక్షుల వారిని కోరుచున్నాను. విద్యా మంత్రిగారు 55–56 లో హిందీ భాషా ప్రచారానికి ఒక స్కీము వేసినట్లు దానికి 63 వేలు మంజూరు చెయ్యబడిందని, దానిలో 66 పాళ్ళు కేంద్ర ప్రభుత్వం, 34 పాళ్ళు ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘము, రాష్ట్ర ప్రభుత్వమూ భరిస్తుంది అన్నారు. ఇది అంతా కాగితం మీద కనబడే కలంపోటు పద్దులు తప్పితే ఇవి ప్రాక్టికలుగా ఏమీ జరుగలేదు. ప్రభుత్వానికి ఎన్ని చెప్పినా అరణ్యరోదనగా కన్పిస్తుంది. హిందీ గురించి బడ్జెటులో చూపిన పద్దులు యదార్థము కాదని నేను మనవిచేస్తున్నాను. ఈ సంవత్సరానికి కేంద్ర ప్రభుత్వం పూర్ణానుసారం చుట్టింది. ఇది గత సంవత్సరానిది. 55–56 సంవత్సరములో స్కీము మంజూరు చెయ్యబడింది. కాని డబ్బు ఇచ్చేటప్పుడు మాత్రం ఏమీ లేదని చెప్పి చిన్న, చిన్న గుమాస్తాలు మొదలు సెక్రటరీల వరకు క్వైరీలు వేసేరు. ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘానికి అధ్యక్షులైన శ్రీ గోపాలరెడ్డిగారికి ఆవిషయాలు తెలుసును. గౌరవం నిమిత్తం పెట్టడం జరిగింది. వారికి ఆ విషయాలు తెలియకపోవచ్చును. నేను కార్యకారిణీ సంఘంలో ఉండడముచేత నాకు పూర్తిగా తెలుసును.

The Hon. Dr. B. GOPALA REDDI:— నేను రాజీనామా ఇచ్చినా బ్రహ్మయ్యగారు అంగీకరించడములేదు.

Sri S. BRAHMAYYA.—అంగీకరించం. మీరుఉండడం అవసరం అని చెప్పి మేము భావించాము. ఇవాళ కాకపోతే రేపు అయినాసరే ఆసంఘ అభివృద్ధి కొరకు మీరు పాటుపడతారనే విశ్వాసం మాకు సంపూర్ణంగాఉంది. ఆంధ్రరాష్ట్ర హిందీప్రచార సంఘానికి మూలధనం ఎక్కువగా లేకపోయినా ప్రజల సహకార సంపత్తుతో హిందీ భాష కోసము పాటుపడిందన్న విషయము గత 38 సంవత్సరాలుగా ఆంధ్రరాష్ట్రానికి అందరికి తెలిసిన విషయమే. కేంద్రప్రభుత్వం ఇప్పుడు ఈ స్కీమును మంజూరుచేసింది గాని డబ్బు మాత్రం ఇవ్వలేదు. ముందుగా 23 వేలు పెట్టుబడి పెట్టేము. అయినా కేంద్రప్రభుత్వము మాకు ఏమని ఉత్తర్వులు పంపించిందంటే, మీకు మూడు మాసాలకు 11 వేలు మంజూరుచేస్తున్నాము. మరో మూడు మాసాలకు 11 వేలు ఇస్తాము. మొత్తము 22 వేలు అంటే ఈ 22 వేలు ఇచ్చేది ఎవరు? 66 పాళ్లు వారు, రాష్ట్రప్రభుత్వము హిందీ ప్రచారసభ 34 పాళ్ళు దీనికి అదనముగా మేము జేబులోనుంచి పెట్టుకోనవలసినది. మిగతా 66 పాళ్ళు. ఉన్న 34 పాళ్ళు ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార సంఘమే భరించవలసి ఉంది.

అందుచే ముఖ్యమంత్రిగా ఉన్న శ్రీ గోపాలరెడ్డిగారికి గత సంవత్సరం జూలై నెలలో ప్రవేశపెట్టిన Budget time లో కూడా విన్నవించుకొన్నాము. ఆంధ్ర రాష్ట్ర ప్రచారక సంఘ పరిస్థితులు ఆర్థికంగా బాగాలేవు. మీరు అధ్యక్షులుగా కూడా ఉన్నారు. ఏ కొద్దిగానో విరాళంగా ఇప్పించండి, అది హిందీ ప్రచారాభివృద్ధికి తోడ్పడుతుందన్నాము. Budget time అయిపోయింది. వచ్చే సంవత్సరం తప్పకుండా చూపండి అని అన్నారు. ఈ సంవత్సరం ఒకటికి ముమ్మారు చూశాము, వారికి ఎక్కువగా పోర్టుఫోలియోలు ఉన్న కారణంచేత నైతేనేమి, దీనిని గురించి ప్రత్యేకశ్రద్ధ తీసుకోవడానికి అవకాశం లేని కారణంగానేమి వారు 'ఊ' గొట్టడం వరకే జరుగుతున్నది గాని ఆచరణలోకి మాత్రం అది అసాధ్యంగా కనపిస్తున్నది కాబోలు. Budget తిరగవేస్తే ఎక్కడకూడా ఒక్క దమ్మిడీకూడ Budget లో Hindi ప్రచారసంఘానికి విరాళంగా ఇచ్చినట్లు గానీ, Hindi ప్రచారాభివృద్ధికి ఇంత మొత్తం ఇస్తామనిగానీ లేదు.

The Hon Dr. B. GOPALA REDDI.— నేను దానికి ప్రెసిడెంటుగా ఉన్నంతకాలం ఏమీ రాదనుకుంటాను. కాబట్టి నా రాజీనామా అంగీకరిస్తే తరువాత ఆలోచిస్తాము.

Sri S. BRAHMAYYA.— Hindi ని గురించి ఆంధ్రరాష్ట్రంలో ఎవరు కూడా వ్యతిరేకతలు కల్గినవారు లేరు. మీరు Andhra Rastra Hindi విద్యాప్రచార సంఘానికి అధ్యక్షులుగా ఉన్నప్పటికీ కూడా, కొంత విరాళము దానికి ఇచ్చినట్లయితే, ఆక్షేపణ చేసే సభ్యులు ఈ 196 గురిలో ఎవ్వరుకూడా లేరని మీకు మనవి చేస్తున్నాను. మీరు ధైర్యసాహసాలతో దీనిని గురించి ఈ సంస్థయొక్క అభివృద్ధికొరకు అన్ని విధాలా పాటుపడవచ్చు.

Sri PILLALAMARRI VENKATESWARLU.— బ్రహ్మయ్య గారికి మీ ద్వారా తెలియచేసే దేమిటంటే నాగేశ్వరరావు గారు లేనిపోని అభాండాన్ని మా మీద వేస్తున్నారు. వారికేదైనా వ్యతిరేకత ఉంటే చెప్పమనండి. మేము హిందీని వద్దు అనడంలేదు. ఒకటవఫారం చదువు తున్నవారికి అ, ఆ, లుకూడా నేర్చుకోలేని వారికి హిందీలోనే అక్షరాభ్యాసం చేయవద్దని నేను మనవి చేస్తున్నాను.

The Hon. Sri A. B. NAGESWRA RAO:—నేనుకూడా ఆంధ్రరాష్ట్ర హిందీ విద్యాప్రచారక సంఘంలో ఒక member ని. అందుకని నేను దానికి అనుకూలుణ్నే గాని వ్యతిరేకుణ్ణిమాత్రం గాను.

Sri S. BRAHMAYYA.— ఈ Budget లో 9 లక్షల 78 వేల రూపాయలు grants లో కనబరచటం జరిగింది. అయితే grants to Private Hindi Vidyalayas నిమిత్తం 3,800 మాత్రం కేటాయించారు. ఇది కూడా ఆంధ్ర రాష్ట్ర హిందీ విద్యా ప్రచారక సంఘానికి వచ్చేదికాదు. ప్రత్యేకంగా విద్యాలయాలు స్థాపించి తద్వారా హిందీలో బోధన జరుపుతున్నటువంటి స్కూళ్ళకు వెళ్ళుతుంది. కాబట్టి ఆంధ్ర రాష్ట్ర విద్యా ప్రచారక సంఘానికి ఏమీ కూడా లేదని స్పష్టమవుతుంది.

13th March 1956]      (Sri S. Brahmayya)

ఇంత మాత్రంచేత మేమేమీ కూడా ఆక్రోశాన్ని, అసంతృప్తిని వెలిబుచ్చడంగానీ లేక ఈ విధంగా చేశారని చెప్పి నీలాపనిందలు వెయ్యటంగానీ చేయటంలేదు. కానీ ముందు కైనా సరే వారు దృష్టిలో ఉంచుకొని ఆంధ్ర రాష్ట్ర హిందీ విద్యా ప్రచార సంఘానికి తోడ్పడాలి; తోడ్పడవలసిందని ప్రార్థిస్తున్నాను. పోతే హిందీ Period లను గురించి కూడా ఒకటి చెప్పాలి ఇంతవరకూ కూడా Ist Form నుంచి IIIrd Form వరకున్నూ హిందీని నిర్బంధంగా బోధిస్తూ వచ్చారు. ఈ సంవత్సరం నాల్గవ Form లో కూడా హిందీ నిర్బంధంగా బోధింపబడుతుందని చెప్పి ఉత్తరువులు పంపించినట్లుగా కూడా సెలవిచ్చారు విద్యా మంత్రిగారు. ఈ రెండు పీరియడ్లు వున్నంతమాత్రంచేత Hindi భాషను పూర్తిగా అభ్యసించటానికి అవకాశం లేదని చెప్పి నేను మనవి చేస్తున్నాను. వీలైనట్లయితే Ist Form నుండి రద్దుచేసేయండి. Ist Form and IInd Form, ఈ రెండు ఫారాల్లో కూడా హిందీని నిర్బందం చేయబోకండి. IIIrd Form నుంచి ఇంతవరకు సోదరులు చెప్పినట్లుగా మీరు ప్రవేశపెట్టండి. కానీ కనీసము IIIrd Form లో 3 పీరియడ్లనుంచి IVth Form వచ్చేసరికి 4 పీరియడ్లనైనా చేస్తేనే కానీ హిందీ భాషను ప్రోత్సహించడానికి మాత్రం వీలులేదు. ఈ విషయంలో మేము చెప్పుతున్నటువంటి విషయాలు మీకు పూర్తిగా అవగాహన కాకపోయినట్లయితే దీన్ని గురించి ఒక కమిటీని వెయ్యండి. ఉప సంఘాన్ని నియమింపజేయండి. ఆ సంఘముయొక్క సిఫార్సులను దృష్టిలో ఉంచుకొని అమలు పరచటానికి మాత్రం ప్రయత్నించండి. మొన్ననే అమృతసర్ కాంగ్రెసులో హిందీ భాషా ప్రచారం దక్షిణ భారత దేశములో పూర్తిగా జరగాలనే ఉద్దేశ్యంతో కక్కన్‌గారు (తమిళనాడు కాంగ్రెసు అధ్యక్షుడు) ఒక తీర్మానాన్ని ప్రతిపాదించాడు. నేను కూడా అప్పుడు అక్కడే ఉన్నాను. ఆ తీర్మానాన్ని అమలుపరచడానికి నేడు కాకపోతే రేపైనా కేంద్ర ప్రభుత్వం గానీ రాష్ట్ర ప్రభుత్వం గానీ అమలుపరచటానికి పూనుకొనక తప్పదు. హిందీ ప్రచారం అవుసరమే, హిందీ భాష అవుసరమే. అందుచేత ఔత్తరాహులందరు కూడా దక్షిణాదివారిని మూలకు త్రోసేస్తున్నారని ఒప్పుకొంటాము. అయితే ఆచరణలో పెట్టడానికి మాత్రం ఎందుకు మనం పూనుకోము. రిజల్యూషన్ కీ శోరిష్ హై. మగర్ ఉస్‌కా అసర్ గాయబ్, పఠెటోంకీ సదా సున్ తా హూం ఔర్ ఖానా నహీం ఆతా॥ అన్నట్టుగా తీర్మానాలు చేసుకోవడమే గానీ అమలు పెట్టడానికి మాత్రం ఎవరుకూడా ప్రయత్నం చేయరని నేను చెప్పుతున్నాను. అది ఆచరణలో పెట్టడానికి పూనుకోవాలని చెప్పి కోరుతున్నాను. నిన్న గోపాలరెడ్డిగారు Heads of State Demand మీద మాట్లాడుతూ ఈ మన పరిపాలనా సౌలభ్యం కొఱకు ఆంగ్లభాషయొక్క అవసరం తప్పదని చెప్పారు. ఆంగ్లభాషలోనే మన పరిపాలనా విధానం అంతా సౌలభ్యంగా జరుగుతుందని చెప్పడంలో నాకు చాలా ఆశ్చర్యం కల్గుతుంది. ఇప్పుడు 200 సంవత్సరాలుగా ఉగ్గుబాలతోబాటు, బానిసత్వముతో బాటు ఆంగ్లేయుల పొత్తు మన కేర్పడింది. ఆంగ్లేయులు పోయినప్పటికీ ఆంగ్లభాష పొత్తు మాత్రం మనకు ఉండేటట్లు వాళ్ళు చేశారు చేయబట్టే, ఆంగ్లభాషలో పరిపాలన జరగాలని అంటున్నారు. ఇది సరిఅయిన విషయం కాదు.

(Sri S. Brahmayya) [13th March 1956

మొన్ననే రష్యానుంచి అధినేతలు వచ్చారు. వారు కూడా హిందీపదజాలంలో Hindu Rusi, భాయి, భాయి అన్నారు. చైనావారు వచ్చారు. చీనీ - హిందీ భాయి, భాయి అన్నారు. మనకు హిందీభాషలోనే పరిపాలనా సౌలభ్యం చక్కగా జరుగగలదని 16 రాష్ట్రాలలో 6 రాష్ట్రాలు హిందీభాషనే state భాషగా పరిగణించాయి. అమలులో పెట్టబోతున్నాయి. ఇది కేంద్రప్రభుత్వదృష్టికికూడా వెళ్ళింది. మనం State Language గా మాతృభాష తెలుగులో కార్యకలాపాలు జరుపుకొంటున్నప్పటికీ, హిందీభాష అవసరం కేవలం కేంద్రప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపటం కొరకైనా ఉండితీరాలి. ప్రతి దక్షిణాదివాడు కూడా హిందీని నేర్చుకొనవలసిన అవుసరం ఉన్నది అనే ఉద్దేశ్యం దృష్టిలో ఉంచుకోవాలి. రేపో మాపో మనం విశాలాంధ్ర నిర్మాణంతో బాటుగా Hyderabad కు వెళ్ళుతున్నాం. హైదరాబాదులో ఉన్నటువంటి 10 లక్షల జనాభా కూడా, హిందీ తెలిసినటువంటివారే. Hindi అనండి, హిందూస్థాని అనండి, Urdu అనండీ, ప్రతివారికి తెలుసు. తెలంగాణాలో 9 జిల్లాలలో కూడా ప్రతి సామాన్యమానవుడికి కూడా హిందూస్థాని అనేది వస్తుంది. మనం అక్కడికి వెళ్ళుతున్నాం. దీనిని దృష్టిలో ఉంచుకొని హిందీ భాషకు తగిన ప్రోత్సాహం ఇవ్వాలని చెప్పి నేను మనవి చేస్తున్నాను. ఏలూరులో గాంధీ జాతీయ మహావిద్యాలయం అనేది ఉన్నది. దానికి ఆస్తి సుమారుగా 5 లక్షలవరకున్నది. వ్యక్తుల చేతుల్లో ఉండిపోయి అదంతా కూడా దుర్వినియోగం అయిపోతుందనే భయంకూడా ఉన్నది. దానిమీద జిల్లా కాంగ్రెసు సంఘంవారిక్కొంత అధికారము ఉన్నది. అంటే జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు Ex-officio Vice President అవుతాడు. అయితే అధికారం మాత్రం ఏమీలేదు. వీరిని మీటింగులకు పిలిచేదిలేదు. వారిష్టమొచ్చినట్లుగా అక్కడ ఏదో ఒక ప్రాథమిక పాఠశాల కంటేకూడా హీనమైన ప్రాథమిక విద్యమాత్రం గరపుచున్నారు గాంధీ జాతీయ మహావిద్యాలయం తిలక్ ఫండుగా సేకరింపబడినటువంటి ధనమునుండి నిర్మాణము జరిగినది. ఆ స్కూలును ప్రభుత్వం వెంటనే వశపరచుకోవాలని కోరుచున్నాను ఆ 5 లక్షల మూలధనముతో అక్కడ ఏదో సంస్కృతి పాఠశాలనుగానీ, హిందీ విద్యాలయాన్ని గానీ స్థాపించడానికి లేక వృత్తి విద్యాలయానికై ప్రభుత్వం పూనుకోవాలి. లేక "విజిలెన్సు హోము" స్థాపించవచ్చు. మన రంగారెడ్డిగారు కూడా ఒకప్పుడు ప్రశ్నించారు. West Godavari లో స్థాపించవలసిన అవుసరం ఎంతైనాఉంది, ప్రభుత్వమువారు ఎక్కడైనా ఒక చోటపెట్టడం అవసరం అన్నారు. గాంధీ జాతీయ విద్యాలయాన్ని దాటి భవనాలను ఆస్తిని ప్రభుత్వం స్వాధీన పరచుకొని మరొక విధంగా సద్వినియోగం చేయవలసింది అని నేను ముఖ్యమంత్రి అయినటువంటి శ్రీ గోపాలరెడ్డిగారికి మనవిచేస్తూ సెలవుతీసుకొంటున్నాను.

Sri P NARASIMHAPPA RAO:— అధ్యక్షా మన ముఖ్యమంత్రిగారు తెచ్చిన బడ్జెటును నేను బలపరుస్తూ కొన్ని సూచనలు మాత్రం చేస్తున్నాను. 3 వ ఫారం వరకు free education ఇస్తాము అనడం చాలా సంతోషించ వలసిన విషయం. కారణం ఏమిటంటే ప్రక్కరాష్ట్రంలో దీనిని ఇదివరకే పెట్టి ఉన్నారు. లోటు బడ్జెటు అవడంవల్ల last year పెట్టకపోయినా ఈసంవత్సరమైనా పెడుతున్నారు కాబట్టి చాలా సంతోషించవలసిన విషయము. మరొకవిషయం Higher elementary

schools తీసి వేస్తున్నాము, కొన్ని middle schools గా చేస్తాము అంటున్నారు. అట్లాఅయితే గ్రామాలలో చాలా విద్య తగ్గుతుంది అని మనవి చేస్తున్నాను. గ్రామాల్లో 8 వ క్లాసు వరకు చదువుకొని పై స్కూళ్ళకు పోతున్నారు. చాలా పేద వాళ్ళు కాబట్టి townsకు వెళ్ళి చదువుకోడం కష్టంగా ఉంటుందని మనవి చేస్తున్నాను. తీసివేసే పక్షంలో అన్ని Higher Elementary Schoolsకు Middle Schoolsగా మార్చాలని మనవి చేస్తున్నాను. హెచ్చు సదుపాయాలు కావాలని హెచ్చు buildings కావాలని జిల్లాబోర్డులవారు చెబుతున్నారు. ఆప్రకారంగా డబ్బుఇవ్వడానికి ప్రజలు వీలులేక ఇబ్బంది పడుతున్నారు. Middle School అయినా పెడితే బాగుంటుందని మనవి చేస్తున్నాను. స్కూళ్ళలో పాఠాలు చెప్పే విషయంలో కూడా తేడా ఉన్నది. నిన్నటివరకు చదువుకున్నవారు B. Ed ప్యాసయి ఉద్యోగానికి వస్తారు వానితో చదివిన కుర్రవాళ్ళు ఆ స్కూలులోనే ఉన్నారు. వారు ఆ కుర్రవాణ్ణి చూడగనే భానుమతి పాడినపాట పాడండి అంటారు, ఈ teacher పాడుతుంటాడు. ఇటువంటివారిని స్కూలులో వేస్తున్నారు. సినిమా పాటలు పాడేవాళ్ళను teachers గా వేస్తున్నారు. one year training అయిపోగానే వేస్తున్నారు. వారుచెప్పే విద్య ఏమిటి? పాతవాళ్ళకు extension ఇవ్వండి. L T వాళ్లున్నారు 55 వ సంవత్సరంలో retire అవుతారు. కుర్రవానితో సమానంగా చదివినవాడు ఏమిచెబుతాడు ? ఏమి discipline ఉంటుంది ? Higher grade తీసివేసి Secondary grade పెడు తున్నారు.School finalప్యాసయినవాడు, Intermediate ప్యాసయిన వాడు, B. A. ప్యాసయినవాడు Secondary grade teacher గానే ఉంటున్నాడు. Secondary grade vacancy లో వేస్తున్నారు. వారికి వీళ్ళకు తేడా చూడాలనిమనవిచేస్తున్నాను. ముందు preference B A. వానికి, తరువాత Intermediate వానికి, తరువాత S S L.C వానికి ఉద్యోగాలు ఇవ్వడంలో కూడా అదే ప్రకారంగా ఇస్తే విద్య చెప్పడానికి అవకాశం ఉంటుంది. పిల్లలు నేర్చుకొనడానికి అవకాశం ఉంటుంది. Retire అయిన వాళ్ళను తీసికోవచ్చునని ఉన్నది. 60 సంవత్సరాలవరకు ఆ విధంగా తీసుకోవచ్చును.

The Hon Sri A B. NAGESWARARAO .— Eligible hands లేకపోతే వేసుకోవచ్చును కాని ఉంటే వేసుకోకూడదు.

Sri P NARASIMHAPPA RAO .— ఉద్యోగాలకు ఏవిధంగా advertise చేస్తున్నారో, చివరకు వేయదలచుకున్న వారిని ఎట్లా వేస్తున్నారో ఆ విధంగా చేయవచ్చును. డిప్యూటీపంచాయితీఆఫీసర్లు కావాలిఅంటారు. పబ్లికేమనుమాత్రం చేస్తారు. ఎవరికో ఉద్యోగాలు ఇస్తారు. B. A వానికి ముందు ఇవ్వండి; Intermediate కు తర్వాత ఇవ్వండి; S S.L C. కి తరువాత ఇవ్వడం, ఎన్నో స్కూలు తీసుకుంటామని అన్నారు. నెల్లూరు జిల్లాలో మాత్రం తీసుకున్నారు. స్కూల్సు గవర్న మెంటు తీసుకుంటారని చాలా పాడైపోయినస్థితిలో ఉన్నాయి. నెల్లూరుజిల్లాతో బాటే అన్ని జిల్లాల్లోని స్కూల్సు తీసుకోవాలని మనవిచేస్తున్నాను. డబ్బులేదంటే పొదుపు ఎట్లాచేయాలో మంత్రిగారికి తెలుసు. Finance తో బాటు commercial taxes కూడా వారి చేతుల్లోనికి తీసికుంటే ఆదాయం హెచ్చు చేసికొనడానికి వీలు ఉంటుంది. అప్పుడు మిగతా జిల్లాల్లో కూడా తీసికొనడానికి వీలు ఉంటుంది. జిల్లా బోర్డు స్కూళ్ళు

(Sri P. Narasimhappa Rao) [13th March 1956

బాగా లేవు; చెప్పేగతిలేదు; మూడు మాసాల కొకసారి జీతాలు ఇస్తున్నారు. Special Officers పరిపాలన పెట్టిన లగాయితు ఒక స్కూలుకూ జీతాలు సరిగా అందడంలేదు. హైదరాబాదు, విశాలాంధ్ర రాబోతోంది, అక్కడ teachers జీతం రు 100 వరకు ఉన్నది. మన స్కూల్సులో రు 50 లు ఇస్తున్నారు. వారికి మనం ముందుగానే రు 10, 5 లు హెచ్చు చేయాలని మనవి చేస్తున్నాను. City schools గురించి చెప్పాను. పల్లెటూళ్ళలో ఉండే ప్రజలకు చదువు వచ్చేటట్లు 3 వ ఫారము వరకు free education ఇప్పించాలని కోరుతున్నాను.

Sri P. ANTHONY REDDI — Mr Speaker Sir, as one reviews the Budget proposals of our Chief Minister, one gets the impression that he is showing more the prudence and parsimony of a house-wife rather than the boldness and resourcefulness of a financier We could see that he had been very active in reducting an item of expenditure here or removing an item of expenditure there and thus bring down the expenditure of the budget, and Education Demand has not escaped his attention. If we just review, we could see that the total Education Demand excluding the provision made for development schemes had been reduced from 428 lakhs to 386 lakhs. Primary education, Secondary education, Special education and College education has suffered under his hands

Ours is a democracy and a very young one, and the greatest enemy of democracy is the tyranny of ignorance. Unless ignorance is removed from our country, we cannot expect that our democracy will be a success. So at such a time as this, when we ought to have spent more on education, our Finance Minister has reduced expenditure on education. Of course, there is expenditure on development schemes and this is a very commendable thing. Impetus is given to basic education. But our basic education is concentrated mainly on one craft i. e, spinning and weaving, and that is the profession which is overcrowded. Unless our basic education takes many more basic crafts, it cannot succeed and it is doomed to fail.

One defect that I noted is that no provision is made for research in teaching. The methods of teaching we are now following are those that we have imported from foreign countries like England. But our conditions, our language and all these things require an intensive research in teaching methods

13th March 1956] (Sri Anthony Reddi)

and unless a provision is made for this, we cannot expect to raise the standard of our education.

I greatly congratulate the Chief Minister for making a beginning in raising the standard of our education He has made provision for replacing Higher Grade trained teachers. This is a very happy measure As I said in the beginning, democracy is to be guarded not only against the tyranny of ignorance but also from the sabotage of half knowledge, as Alexander Pope said little learning is a dangerous thing, and our great poet Bharthruhari has also said the same thing So we must see that these half educated fellows do not exist in our country

Another happy measure that our Chief Minister has introduced is the abolition of private admissions in High Schools It is a very bold step. I only request him to stand firm on it, because he is likely to get a lot of applications for exemption but he should not budge an inch.

Our standard of education is going down Our boys have lost interest in reading text-books, not to speak of studying them They are most interested in reading cheap notes that are being flooded into our country They are easy-going and they are examination-minded With such pupils who are to be the future leaders of our country, you cannot expect much So we must do something to ban these cheap books. If it is against the fundamental rights of our country, at least, I give a suggestion to our Fiance Minister which reduces our budget deficit. Tax these cheap notes 400 or 500 times advalorem. That will fetch him a few lakhs which will help him, at least to introduce free education up to Third form

The Hon. Dr. B GOPALA REDDI:— Sales tax or what ? How do I tax them ?

Sri P. ANTHONY REDDI.— You tax them something like sales-tax or any other method you like. Now this system of reading notes is one of the reasons why our National standards have gone down. Our boys are now only mugging up students. They are more memory machines rather than real intelligent personalities. Now these two attempts of his at raising the

(Sri P. Anthony Reddi) [13th March 1956

standard of education are no doubt very good, but they are not enough.

Dr Humayun Kabir speaking recently in December at Delhi said "The pay of our teachers is very poor" The Government has neglected them The people are unsympathetic towards them Therefore these teachers are not able to cope up with their teaching work. A hungry teacher is always an inefficient teacher and if this measure of raising the standard of education is to be effective, you must at the same time, raise the standard of living of our teachers Of course, the Government may say that there are about 58,000 teachers in elementary schools and even if they implement the Kuppuswami Committee Report by paying only Rs 5/- a month, it will cost them roughly 33 or 34 lakhs But you must consider the other aspect There are really 17 lakhs of pupils that are being taught by these 58,000 You spend roughly only Rs. 2 per pupil per year. That is not much, and especially when you want our democracy to be successful and when we want to train up leaders to lead our country into prosperity, to spend Rs 0–2–8 per month per pupil is not much Therefore I request our Chief Minister just to think from this aspect and try to do something to alleviate the suffering of the poor teachers. If he still feels that he cannot do, I give him one or two suggestions.

The Government of India had nationalised the Insurance business and a good percentage of teachers have insured their lives. If the Andhra Government introduces compulsory insurance schemes for these elementary school teachers so that a teacher who serves for say 25 or 30 years gets a life insurance amount of Rs 2000/– this scheme will not cost the Government much, it will give a good impetus to the elementary school teachers. In the first 4 or 5 years, it may cost the Government 3 or 4 lakhs a year Of course, later on it will increase. But at present, our Finance Minister says that we have no money, but he may get money after 5 years. So he can introduce this scheme. It has got one great advantage. Every teacher is bothered with this, that he cannot save anything for future use. As a matter of fact, he cannot save If there is this guarantee that when he retires he will get a lump-

13th March 1956] (Sri P Anthony Reddi)

sum of Rs 2000/- along with his teacher's provident fund, of course, it will give a lot of relief and with this relief I think he can teach more efficiently and our educational standard also will improve.

Lastly, our Chief Minister in his speech on Education Demand has said that the Government is seriously thinking of introducing free education up to Third Form and our Chief Minister knows definitely that it costs him only 15 lakhs After all, he has allotted nearly 14 lakhs for the improvement of one hospital at Kurnool and probably only 100 beds may be increased by them If he spends 15 lakhs of rupees he is going to benefit over 80,000 pupils who are studying in the Middle schools Thus if he does this little thing, I am sure the whole of Andhra Desh will appreciate him and they will not feel sorry for having brought Congress into power.

* Sri S VEMAYYA :— అధ్యక్షా! ఆర్థిక శాఖా మంత్రిగారు ప్రవేశ పెట్టిన పద్దులో ఈ శాఖకు చాలా తక్కువ కేటాయించినందుకు నేను చాలా విచారిస్తున్నాను. దీని క్రింద 1955_56 సం॥రం రు 5,23,10,700 లు కేటాయిస్తే, ఈ సంవత్సరము రు 4,78,75,100 లు కేటాయించినట్లు కన్పిస్తుంది.

The Hon. Dr. B. GOPALA REDDI — ఈ విషయంలో ఏమీ తేడా లేదని బడ్జటు taxation విషయంలో చెప్పారు. కొన్ని recoveries మాత్రం Government of India నుంచి రావలసి ఉన్నాయి. పోయిన సంవత్సరం వచ్చినాయి. ఈ సంవత్సరము రాలేదు. అంతకన్నా వేరే ఏమీ లేదు.

Sri PILLALAMARRI VENKATESWARLU —Buildings కును grants కేటాయిస్తున్నారు. వాటిని బడ్జటులో గోపాలరెడ్డిగారు చూస్తే తెలుస్తుంది.

Sri S. VEMAYYA.— రోజు రోజుకు అభివృద్ధి కావలసిన మన విద్యా విధానము, సాంఘికంగా ముందుకు పోవలయునంటే అన్నివిధాల ప్రోత్సాహం ఇవ్వవలసిన అవసరము ఉన్నది. ఒకవేళ లోటుబడ్జటు అయినప్పటికి దీనికి ఇంకా హెచ్చుగా కేటాయించక పోయినందులకు విచారిస్తున్నాను.

ఎలిమెంటరీ విద్యా విధానము గురించి అనేకమంది సభ్యులు అనేక సూచనలు చేశారు. వాటిలో ఆచరణకు సాధ్యమైనటువంటివి కొన్ని యున్నవి. వాటినన్నింటిని అమలు జరుపుటకు ప్రభుత్వంవారు ప్రయత్నము చేయవచ్చును. మన రాజ్యాంగ విధానములో సూచించిన ప్రకారం ప్రతి బాలబాలికకు నిర్బంధ విద్యా విధానం అమలులోకి తీసుకొని రావలయునని చెప్పబడి యున్నది. కాని నిర్బంధ విద్యా విధానమును అమలు జరుపుటకు మన ప్రభుత్వం ఏమిచర్య తీసుకున్నది? కొన్నిచోట్ల అమలు జరిపినా

మని చెప్పుచున్నారు. కాని స్కూలుకు వెళ్ళవలసిన వయస్సులో ప్రతి పిల్లవాడు ఉన్నాడా ? అట్లా ఎవరూ లేరు. ఆర్థిక దుస్థితితో బాధపడుచున్న పేద ప్రజానీకము తమ పిల్లలను బడులకు పంపించే పరిస్థితిలో లేరు. నేడు మనదేశంలో percapita income 287 రూపాయలు ఉంటే, అందులో landless labourers గా ఉన్న వారి annual income 104 రూపాయిలు యున్నది. Sample Survey వారు ఇచ్చిన report చూస్తే అందులో ఇండియాలో చాలా lowest income ఉన్నదని తెలుస్తుంది. దీనిని బట్టి మనం చూచినట్లయితే మనం ఇంటికి నిర్బంధ విద్యా విధానం జరపగలమా లేదా అనేది తెలుస్తుంది. నిర్బంధ విద్యా విధానం సక్రమంగా అమలు జరుపుతున్నారా అంటే అదిలేదు. పిల్లలంతా పాఠశాలలకు వచ్చేటట్లు చేస్తున్నారా అంటే అదిలేదు. అందువల్ల ఆర్థిక విధానానికి కావలసినటువంటి పరిస్థితులన్నీ మొదట కలుగచేసి, ఆపైన పాఠశాలలలో అందరికీ విద్య గరపి నిర్బంధ విద్యావిధానము మొదలు పెట్టవలెను. వారికి తిండి, బట్ట మంచినీరు కలుగచేసే విధానం కనుక అవలంబించినట్లయితే అందరి పిల్లలను కూడా బడులకు పంపించడానికి వీలవుతుంది. అందువల్ల ఈ నిర్బంధ విద్యా విధానముఅనేది కాగితముమీద ఉన్నటువంటి పంథా తప్పితే అమలుజరిగేది లేదని నేను మనవి చేస్తున్నాను.

కొంతమంది సభ్యులు హయ్యర్ గ్రేడు ట్రైనింగు తీసివేసినందుకు అభినందించడము కూడా జరిగింది. దీనిని వెంటనే పూర్తిగా తీసివేసి సెకండరీ గ్రేడు ప్రవేశపెట్టినట్లయితే అది చాలా గొడ్డలి పెట్టుగా కన్పించుతుంది. కాని క్రమేణా కొన్ని సంవత్సరాలలో higher grade తీసినందువల్ల ఎక్కువగా స్త్రీలకు, ఎలిమెంటరీ గ్రేడు ఉపాధ్యాయులుగా పనిచేస్తున్న వారందరికి లాభం చేకూరుతుంది. అందువల్ల ప్రస్తుతం వారిని ఆ గ్రేడులో చదువుతున్న వారందరిని చదువనిచ్చి రాబోయే వారిమీద ఈ విధానం అవలంబిస్తే బాగుంటుందని మనవి చేస్తున్నాను. అట్లా వెంటనే తీసివేసినట్లయితే ముఖ్యంగా స్త్రీలు చాలా బాధపడుతారు. ఉదాహరణకు కడపలో ఆడపిల్లలకు కొంతకాలం నుంచి హయ్యర్ గ్రేడు ట్రైనింగు స్కూలు ఉన్నది. దీనిని హఠాత్తుగా సెకండరీ గ్రేడు చేశారు. 2, 3 మాసములు ఆపాఠశాలలలో చదువుతున్న వారిని నెల్లూరుకుగాని, ఇంకెక్కడికైనా పొమ్మన్నారు. దానివల్ల dislocation ఏర్పడింది. అందువల్ల దానిని క్రమేపీ తీసివేసే విధానంను అవలంబించ వలసివున్నది. ఇప్పుడున్న వాళ్ళకు ఇబ్బందులు కలుగకుండా స్త్రీలకు ముఖ్యంగా ఈ అవకాశాలు కల్పిస్తూ క్రమేణ అమలు జరపవలయునని కోరుతున్నాను.

Teachers కు ఎప్పుడైతే జీతాలు సరిగాయివ్వరో అప్పుడు వారు పిల్లలకు సక్రమంగా చదువు చెప్పరు. మనం మన పిల్లలకు teachers దగ్గర విద్య చెప్పించుచుందామనే విధానంలో వుంటున్నాము గాని వాళ్ళకు జీతాలు సరిగా అందునట్లు చేయుటలేదు. ఏదో ఒక వంకపెట్టుకొని teachers ను ఎక్కువగా transfers చేయడం జరుగుతోంది. 3 సంవత్సరములవరకు మార్చకూడదని rule వున్నప్పటికీ యీ transfers జరుగుతున్నాయి. వాళ్ళకు చాలా యిబ్బంది కల్గుతోంది. ఒక school నుంచి teacher ను transfer చేయడం క్రొత్త teacher తొందరగా రాకపోవడం వలన ఇటు students కి, అటు ఉపాధ్యాయులకుకూడా చాలా ఇబ్బందులు కల్గుతున్నాయి. కనుక యిలా పదేపదే transfers జరగకుండా చేయవలసినదని నేను

13th March 1956] (Sri S Vemayya)

మంత్రిగారికి మనవిచేస్తున్నాను. భార్యాభర్తలు ఇరువురూ teachers గా వుంటే, భార్యను ఒక జిల్లాలోను, భర్తను మరో జిల్లాలోను వేసి వాళ్ళకు చాలా యిబ్బంది కలుగ జేస్తున్నారు. కొంతమంది Higher grade scale లోనే Secondary grade ఉపాధ్యాయులుగా పనిచేస్తూఉంటారు. ఎక్కడైనా Secondary grade Teachers కావలసినప్పుడు అటువంటె వారిని వేసుకోవచ్చును. నిజంగా అట్టివారు కొంత experience gain చేసి ఉన్నప్పటికీ Secondary Grade teachers గా రావడానికి అవకాశం లేకపోతోంది. అటువంటివారు వెంటనే resign యిచ్చేసి క్రొత్తగా recruit అయివస్తున్నారు. వారు క్రొత్తగా recruit అగుటవలన క్రొత్తగా పెట్టే High schools లో వారిని teachers గా వేసుకొంటున్నారు. వారు లోగడ 5, 6 సం॥ల నుంచి Higher grade teachers గా పనిచేసిన విషయాన్ని కప్పిపుచ్చడం జరుగుతోంది. అట్లా జరుగు తున్న direct recruitment ని ఆపివేసి Higher grade వారికి promotion యిచ్చే విధానం అవలంభిస్తే బాగుంటుందని నేను మనవి చేస్తున్నాను. Teachers కి జీతాలు ఏ నెలకా నెల సరిగా అందడంలేదు ఈ delay జరగకుండ 1, 2 తేదీలలో వాళ్ళకు జీతాలుయిచ్చే విధానం ప్రభుత్వం ఎందుకు అవలంభించుటలేదో నాకు అర్థం కావడంలేదు

The Hon Sri A. B NAGESWARA RAO.— ఆ విషయంలో ప్రభుత్వం చర్య తీసుకుంటోందని మనవి చేస్తున్నాను.

Sri S. VEMAYYA.—ప్రభుత్వం చర్య తీసుకుంటుందని మంత్రిగారుచెప్పారు. యిందుకు వారిని అభినందిస్తున్నాను. కాని teachers కు 15 వ తేదీన గాని 30 వ తేదీ లోపునగాని జీతాలు ముట్టడంలేదు. జీతాలు సక్రమంగా అందేటట్లు చేయాలని ప్రభుత్వాన్ని ప్రార్థిస్తున్నాను. సంవత్సరాల తరబడిగా వాళ్ళు పనిచేస్తున్నా Service registers up to date గా పెట్టడంగాని వాళ్ళకు increments ఇవ్వడంగాని జరగడం లేదు. Teachers కు increments యిచ్చేపద్ధతిలో జాప్యం చెయ్యడం ఎంతమాత్రం బాగుండలేదు. District Board Schools లోనూ, Labour schools లో గవర్నమెంటు schools లోనూ ఒక teacher ఒక చోటనుంచి transfer అయినప్పుడు service Register అక్కడ వుంటుంది. క్రొత్తచోట యితనికి జీతంఇవ్వరు. నీ Last Pay certificate రాలేదు. వచ్చేవరకు నీకు జీతం ఇవ్వము, అంటున్నారు. ఈ విధంగా వాళ్ళకు నెలల తరబడి జీతం రాకుండా పోవడం జరుగుతోంది.

District Board High School లో సీతారామయ్యగారు అని ఒక teacher వున్నారు. ఆయనకు disease attack అయింది. D. M. O. దగ్గరకు పోయి Medical certificate తెచ్చుకున్నారు. జీతం యిమ్మని అడిగితే, నీవు మళ్ళా duty లో join అయితేనే కాని జీతం ఇవ్వమన్నారు. అతను నిజంగా జబ్బుపడ్డాడు. D. M. O. గారు certificate కూడా యిచ్చారు. జీతం యివ్వకపోవడం సబబుగా లేదని మేము చెప్పినాము. ఒక నెలలో, 2 నెలలో యిచ్చారు. ఉపాధ్యాయులు అన్ని విధాలా అస్వస్థులైయుండి కూడా డబ్బు సంపాదించుకోలేక పోతున్నారంటే మనం చింతించవలసిన విషయం. Elementary Schools లో పిల్లలసంఖ్య సరిగా ఉండదని అజమాయిషీ సరిగా జరగదని తెలుస్తున్నది. Elementary schools మీద

(Sri S. Vemayya) [13th March 1956

supervision కి Deputy Inspector చాలును. ఈ స్కూల్సు సరిగా జరుగుతున్నాయా లేదా అనే విషయాన్ని పరిశీలించేందుకు ఇతర ఉద్యోగస్తులకు కూడా entrust చేస్తే బాగుంటుందేమో ఆలోచించాలి. ఇలా చేసినట్లయితే పిల్లలు సరిగా schools కి వెళ్ళుతున్నారా? schools సరిగా జరుగుతున్నాయా అనే విషయాన్ని చూడ్డానికి వీలౌతుంది. ఇక High Schools విషయం చూసినట్లయితే అక్కడ తగినంత furniture వుండదు. Teachers తక్కువగా వుంటారు. Schools తెరిచి 2, 3 నెలలయినా teacher రాక పిల్లలు చాలా బాధ పడుతున్నారు. ఈ విషయంలో ప్రభుత్వం యెందుకు శ్రద్ధ తీసుకో కూడదు? మనం ముఖ్యంగా Science కావాలంటున్నాము. Science కి కావలసిన Laboratories చాలినంతగా లేవు. దీనిని గురించి ప్రభుత్వం యెందుకు ప్రయత్నం చేయకూడదు. మనం విద్యను అభివృద్ధి చేసుకోవాలి. Museums ఉన్నాయి.

Printing press లో print అయిన literature గాని, కావలసిన పుస్తకాలు గాని అక్కడనుంచి తెచ్చుకొని అభివృద్ధిచేయడానికి పూనుకోలేదు. అందుచేత మనం Machinery తెచ్చుకొని కావలసిన పుస్తకాలు అన్ని త్వరత్వరగా print చేసుకొని పిల్లలకు సకాలంలో అందేటట్లు చేయాలి. Examinations యింక 2 నెలలు వున్నాయనగా కూడా అంతవరకు పుస్తకాలు print అయి రావు. ఈసంవత్సరం school లో ఏఏ పుస్తకాలు పెట్టారో తెలియదు. ఈ పుస్తకాలకు (Text-Books) యేమైనా committee ని form చేస్తారో ఎల్లా జరుగుతుందో కాని పుస్తకాలు మాత్రం సకాలానికి అందవు. 2, 3 మాసాలు తరువాత పుస్తకాలు బయటకు వెలువడతాయి. ఆ వచ్చిన Books, Students అందరికీ సరిపోవు. సిలబస్ కూడా సకాలానికి రాదు. సిలబస్ తయారుచేసేటప్పుడు వారు యే grade కు సిలబస్ తయారు చేస్తున్నారో, ఆ grade teachers ను దగ్గరపెట్టుకొని చేస్తే బాగుంటుంది. వారు విద్యావంతులే కావచ్చును. Standard కు తగిన పుస్తకాల సిలబస్ తయారుచేసేటప్పుడు ఆ grades కు సంబంధించిన ఉపాధ్యాయులతో సంప్రదించి వారి సలహా తీసుకోవడం అవసరం. ఈ విధంగా చేయించుటకు ప్రభుత్వం పూనుకోనందుకు విచారిస్తున్నాను. ఇప్పుడు examinations జరుగుతున్నాయి. Examinations లో chief examiner, examiner అని వుంటారు ఆ పదవులు యిప్పుడున్నటువంటి వాళ్ళకే ప్రతిసంవత్సరం వుంటున్నాయి. మిగిలిన teachers కి ఆ పదవులు రావటం లేదు. "నాకు teacher గా 25 సంవత్సరముల అనుభవం వుంది. కాని ఒక్కసంవత్సరమైనా chief examiner గా అయినా, examiner గా అయినా అవలేకపోయాను"ని చాలా మంది teachers బాధపడుతూ వుంటారు. ఆ examinership అందరి teachers కి rotate చేయుటకు ప్రభుత్వము ఎందుకు పూనుకోకూడదు?

The Hon. Dr. B. GOPALA REDDI :— 3 సంవత్సరములకన్నా ఆ పదవి వుండదు. దానికి rotation వుంది.

Sri S. VEMAYYA :— మూడు సంవత్సరముల కొకసారి rotation వుందని మంత్రిగారు శెలవు యిచ్చారు. ఆ కాల పరిమితి 2 సంవత్సరాలకు తగ్గించి అందరికీ ఆ chance వచ్చేలా ప్రభుత్వం ఎందుకు చేయకూడదు? అలా చేసినట్లయితే tea-

13th March 1956] (Sri S. Vemayya)

chers చాలా సంతృప్తితో వుంటారు, నెల్లూరు జిల్లాలో aided elementary schools ను ప్రభుత్వంవారు తీసుకొంటూరు. ఇది రెండు జిల్లాలనుంచి ఒక జిల్లాకు తగ్గింది.

ఈ జిల్లాలోకూడా అంతా అమలు జరుపుతారో, యెక్కడైనా ఒక ప్రక్కనుంచి ప్రారంభించెదరో తెలియకుండా వుంది. అందుకు అసలు unit ఏమిటి? ఒక జిల్లా యూనిట్ గానా? లేక తాలూకా unit గానా! నాకంతా అగమ్య గోచరంగా కనిపించుచున్నది. వాళ్ళకు Government scale? లేక District Board scale? గవర్నమెంటు hand over చేసుకొంటుంది కాబట్టి గవర్నమెంటు scale వుంటుందని చెప్పి అనుకుంటున్నారు. కాని ప్రధాన మంత్రిగారు "అది ముడియాదు" అని చెప్తున్నారు. గవర్నమెంటు hand over చేసుకొంటుంది గాని Government scale యివ్వడం లేదు. ఇది అంత సబబుగా లేదు. Government scale యిచ్చే టప్పుడే hand over చేసుకుంటే బాగుంటుందని చెప్పి మనవి చేయుచున్నాను. దానిని వెంటనే కమిటీ school గా మార్చడానికి వాళ్ళు ప్రయత్నం చేస్తున్నట్లు తెలుస్తుంది. దానిని అరికట్ట డానికి అన్నింటినీ కమిటీ schools గానూ, అన్నీ Mission schools గానో మార్చివేస్తే బాగుంటుంది. లేకపోతే వారే కమిటీ స్కూలుగా మారిపోయి యిది aided school గాదు, కమిటీ స్కూలుగా మారిపోయిందని చెప్పినప్పుడు దాన్ని గురించి ప్రభుత్వం ఏమైనా చర్యలు తీసుకుంటుందా అని నేనుప్రశ్నిస్తున్నాను.

కుప్పుస్వామి కమిటీ రిపోర్టు అందరు అంగీకరింస్తున్నటువంటిదే. దాంట్లో జీతాలు పెంచాలని ఉన్నది. దానికి ప్రభుత్వము సిద్ధంగాలేదు. ఎంతసేపటికి డబ్బు తగుల కుండా ఉండెదేదైనా అమలు పరుస్తాము గాని డబ్బు తగిలేది అమలు పరచము అని ఆర్థిక మంత్రిగారు చెప్పడము పరిపాటి అయిపోయింది. Aided schools ను గవర్నమెంటు hand over చేసుకొనే సందర్భములో మామూలుగా retrenchment వస్తుందని ఈవేళ వందలాది teachers భయపడుతున్నారు. ఎందువల్లనంటే, ఇప్పుడు average attendance ఒక ఉపాధ్యాయునికి 20 ఉన్నది. కాని Government ఈ aided schools ను hand over చేసుకొనిన తరువాత average attendance ను ప్రతి ఒక్క ఉపాధ్యాయునికి 30 పెట్టవచ్చు, వచ్చే సంవత్సరము 35 ఆ పై సంవత్సరం 40 ఈ విధంగా పెట్టవచ్చు. ఆ విధంగా చేసినట్లయితే ప్రతి స్కూలులో ఒక ఉపాధ్యాయుడు పొయ్యేటటువంటి ప్రమాదము వస్తుంది మనము ఒక ప్రక్కనేమో unemployment problem పరిష్కారం (solve) చేయాలని single teachers schools పెడు తున్నాము. మరొక ప్రక్కన aided schools యొక్క management బాగాలేదని వాటిలో అక్రమాలు జరుగుతున్నాయని వాటిని handover చేసుకొంటున్నాము. దీనివల్ల teachers కు retrenchment కలుగచేసినవారము అవుతున్నాము. ఇది మన ఆశయానికే విరుద్ధంగా ఉన్నది కాబట్టి ఈ retrenchment కు కారణమైనటువంటి average attedance ను నియమించే విధానములో ఏమి మార్పులేకుండా, దానిని మామూలు పద్ధతిలోనే ఉంచినట్లైతే ఈ retrenchment ప్రమాదము తగ్గిపోతుందని నేను మనవి చేస్తున్నాను.

(Sri S. Vemayya) [13th March 1956

తరువాత high schools, colleges విషయంలో ముఖ్యంగా colleges గురించి ఒక విషయము మనవి చేస్తున్నాను. Colleges లో సాధారణంగా seats దొరకడం లేదు. మా నెల్లూరు కాలేజీలో నేను చూస్తూ ఉన్నాను. అక్కడ seat లేదంటూ ఉంటారు. ముఖ్యంగా Science subject కావలసి వచ్చినప్పుడు, ఎంత తెలివిగల పిల్లవాడైనా, ఎన్ని మార్కులు వచ్చినప్పటికినీ, ఈ subjects లో seats దొరకడంలేదు Histories కావలెనంటే ఇస్తామంటారు. ఇది విద్యార్థులకు చాలా కష్టంగాను, నిరుత్సాహంగాను ఉంటున్నది. ముఖ్యంగా ఈ రోజు పరీక్షలలో బాగా మార్కులు సంపాదించుకొన్నవాళ్ళకు కూడ seats దొరకకుండా ఒక జిల్లానుంచి మరొక జిల్లాకు పారిపోయే పరిస్థితులు ఉంటున్నాయి. కనుక ఈ seats విషయం మాత్రం ప్రభుత్వము ప్రత్యేకంగా శ్రద్ధవహించి తగు సదుపాయము కలుగజేయవలసియుంటుంది. తరువాత Backward Communities వారిని చేర్చుకొనే టప్పుడు వారివద్దనుంచి special fees తీసుకొంటున్నారు ప్రతివారిదగ్గర apperatus కు దానికి దీనికి అని చెప్పి science subjects వగైరా తీసుకొనే టప్పుడు ఈ విధంగా నీవు 150 రూపాయలు ముందుగానే deposit చేయాలని అంటున్నారు. ఈ పద్ధతి మాత్రము అంత బాగలేదని మనవిచేస్తున్నాను. ఈ మొత్తం కట్టలేక అనేకమంది బీదవాళ్లు college మానుకోవడం జరుగుతున్నది. నాకు తెలిసినట్టుగా ఇద్దరు students ఈ కారణంచేత V. R. College లో మానుకొని బెంగుళూరు పోయి ఏదో ఉద్యోగము చేసుకొంటున్నారు. కాబట్టి ఈ special fees కట్టేటటువంటి విధానము మాత్రము తొలగించాలని ఇది విద్యార్థుల చదువుకు ఒక ప్రతిబంధకంగా ఉంటున్నదని మనవి చేస్తున్నాను. తరువాత Colleges లో కేంద్ర ప్రభుత్వం వారు కొన్ని scholarships ఇస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వము కూడ ఇస్తున్నారు. ఈ విధంగా అక్కడ కొంత overlapping జరుగుతున్నది. Backward classes కు scheduled classes కు గాను కేంద్ర ప్రభుత్వము liberal గా college students కు scholarships ఇస్తున్నారు. మరల మన రాష్ట్రప్రభుత్వం కూడ ఇచ్చినప్పుడు, ఆ students ఒకటి withdraw చేసుకోవలసి వస్తున్నది. దీనిఫలితంగా మనడబ్బు ఆఖరుక్షణంలో, నిరుపయోగంగా lapse అవడం జరుగుతుంది. కాబట్టి ఈ scholarshipsడబ్బును సాధ్యమైనంతవరకు High Schools కు మరలించినట్లైతే ఆ విద్యార్థులకైనా ఎక్కువ ఉపయోగకరంగా ఉంటుంది. మా నెల్లూరు జిల్లాలో ఈ scholarships క్రింద ఆరువేల రూపాయలుంటె వాటికి 12 వేల applications వస్తూ ఉన్నట్లు తెలుస్తున్నది ఈ ఇచ్చే scholarships కూడ ఆఖరు క్షణమున మార్చి 31 తేదీన telegrams ద్వారా తెలియజేస్తారు. ఆఖరు క్షణములో ముఖ్యమంత్రిగారిని ఎవరిద్వారానో పట్టుకొని ఈ విధంగా ఈ మొత్తము surrender అయిపోతూ ఉంది కనుక scholarships ఇప్పించండి అంటే అప్పుడు తీరా lapse అయ్యేటప్పుడు telegrams ఇవ్వడం జరుగుతుంది. దీనివల్ల విద్యార్థులు scholarship వస్తుందో లేదో చదువుకొనడమా మానివేయడమా అని చదువుమీద దృష్టిలేకుండా ఆఖరు క్షణంవరకు ఎదురు చూస్తూ ఉండడము జరుగుతుంది. కనుక ఈ scholarships ఇచ్చే విషయంలో accumulation గాని delay గాని లేకుండా సాధ్యమైనంత త్వరగా ఇచ్చేటట్లు చేస్తే బాగుంటుందని అనుకొంటున్నాను.

13th March 1956] [Sri S. Vemayya]

తరువాత basic training విధానాన్ని అమలు జరపాలని దానిని అభివృద్ధి చేయాలని అనుకొంటున్నాము ఈ Basic Schools గురించి మొన్న నే ఒక ప్రశ్న కూడా వచ్చింది. బాపయ్యగారు నేను కూడ అడిగాము దాన్ని గురించి. అనేక తతంగాలు జరుగుతున్నాయి. నాకు స్వయంగా తెలుసును పల్లెపాడులో Basic School ఉన్నది. ఈ school లో కొంత furniture మొదలుగా గల వస్తువులు లేవు. అక్కడ weavers instructors వున్నారు. Loom కూడ వున్నది. Instructors కు జీతాలు ఇస్తున్నారు. కాని ఒక్కచోటైనా ఇవి సరిగా పనిచేస్తున్నట్లు ఎవరైనా చూస్తున్నారా ? కొన్నిచోట్ల weaving Instructors ను sanction చేస్తున్నారుగాని నేత నేయడానికి మగ్గాలు sanction చేయడంలేదు, అంటే మగ్గాలు లేకుండా weaving Instructors ను వేస్తున్నారన్నమాట ఇంకా కొన్ని చోట్ల furniture లేకుండా ఉన్న మగ్గాలు వగైరా కూడా idle గా ఉండడము జరుగుతుంది. ఈ విధంగా ఈ basic training విధానములో చాలా దుబారా ఖర్చు జరుగుతున్నది గాని, సక్రమంగా అది అమలు జరగడంలేదని మనవి చేస్తూ సెలవు తీసుకొంటాను.

Sri A C SUBBA REDDI— అధ్యక్షా, ముఖ్యమంత్రిగారు మొన్న general discussion లో సమాధానమిస్తూ, మునిసిపాలిటీలకు ఇస్తున్నటువంటి tolls compensation ను మునిసిపాలిటీలు వదలుకొంటే ప్రభుత్వం III form వరకు free education ఇచ్చేటట్లు చేస్తారని చెప్పినారు. ప్రతి మునిసిపాలిటీ కూడా ఆర్థికంగా వెనకబడి యున్నదని deficit budget లో ఉన్నదని వారికికూడా తెలుసు. అయినప్పటికినీ, III Form వరకు జీతాలు లేకుండా free education ఇప్పించే పక్షములో, మునిసిపాలిటీలకు ఈ tolls compensation ద్వారా వస్తున్నటువంటి 3, 4 వేల రూపాయలు విరమించుకోడానికి ఒప్పుకోవడం మంచిదని నా స్వంత అభిప్రాయము. కాబట్టి ఈ విషయము Chamber of Municipal - Councils యెదుట పెట్టి, ఇంతమంది విద్యార్థులకు మేలుగా ఉండేటప్పుడు, మునిసిపాలిటీలకు ఈ compensation క్రింద వచ్చే 3, 4 వేల రూపాయలు విరమించుకోవడం మంచిదని చెప్పుతాను.

The Hon Dr B GOPALA REDDI —ఇది 3, 4 వేలు కాదు. అంతకంటె జాస్తి అవుతుంది. 35 మునిసిపాలిటీలకు కలసి 7 లక్షల రూపాయలు అవుతుంది.

Sri A C. SUBBA REDDI.— ఏమైనప్పటికిని ఇది మా Chamber లో పెడతాను. ప్రతి మునిసిపాలిటీకి deficit budget ఉన్నందువలన దీనికి అంగీకరిస్తారో లేదో అని భయముగా ఉన్నది. అయినా ఈవిధంగా III Form వరకు అందరికి free education వచ్చేటప్పుడు మునిసిపాలిటీలు కొంత ఉదారభావముతో పోయి బహుశ ఒప్పుకోవచ్చునేమో కూడా అనుకొంటాను. ఏమైనప్పటికినీ, ఇది మా chamber ముందు పెట్టి, మా అభిప్రాయాన్ని తొందరగా ముఖ్యమంత్రి గారికి తెలియ జేస్తాను.

తరువాత నెల్లూరులో V.R. College అనిఒక College ఉన్నదని ముఖ్యమంత్రి గారికి తెలుసు. మా ఊరిలో వేణుగోపాలస్వామి దేవాలయ మొకటి ఉన్నది. దాని నుంచి 75 వేల రూపాయలు ఆ College కు గాను ఇస్తామని trustees అందరు కలసి unanimous గా resolution pass చేసి పంపించారు. కాని ఇంతవరకు దాన్ని

[Sri A. C. Subba Reddi] [13th March 1956

గురించి ప్రభుత్వము వద్దనుంచి ఏమీ ఉత్తరువులు రాలేదు. కాబట్టి ఇప్పుడైనా ముఖ్యమంత్రిగారు దీన్ని గురించి శ్రద్ధతీసుకొని ఈ 75 వేల రూపాయలు ఆ College కి ఇచ్చేటట్లు చేస్తారని ఆశిస్తున్నాను.

Aided Elementary Schools ను వీలయినంతవరకు ప్రభుత్వ స్వాధీనములోనికి తీసుకునేటట్లుగాను, ముందు నెల్లూరుజిల్లాలోనివి తీసుకుంటామని ప్రభుత్వము అభిప్రాయపడుతున్నట్లుగానూ తెలుస్తున్నది. అయితే యిందులో కొన్ని తరగతులు తీసుకొని, మరికొన్ని తరగతులు తీసుకోనట్లు తెలుస్తున్నది. కాని యీ స్కూళ్ళను తీసుకునేటప్పుడు ఏ విధమైన discrimination చూపకుండా అన్నిగూడ తీసుకుంటే బాగుంటుందని నా అభిప్రాయము. వీటిలో కొన్ని first class schools గా నిర్ణయించబడినవి. వాటిని మేనేజ్ చేసేవారికే వదిలివేయవచ్చునని first class కానివి ప్రభుత్వము తీసుకోవచ్చు, అన్నట్లుగా ప్రభుత్వము నిశ్చయించినట్లుగా ఉన్నది. కాని యివి first class schools అనే పేరు ఎట్లా వచ్చిందో కూడా ఆలోచించవలసియున్నది. Management వారు D E O ను గాని, Deputy Inspector of schools ను గాని బాగా కాక పట్టినట్లయితే, ఎంత అధ్వాన్నపు స్కూలు అయినా first class school గా declare చేయించుకోగలుగుతున్నారు. కాని న్యాయముగా పనిచేస్తూ యీ అధికారులు మట్టుకు మనలను ఏమిచేస్తారు, మనకు వచ్చే grant ఎట్లాగైనా వస్తుంది అనుకునేవారి స్కూళ్లు అన్నీ III Class Schools క్రింద ఉంచబడుతాయి. ఎంతకాలము చూచినా, వారు ఎంతబాగాను, న్యాయముగాను నడిపినను, అవి అట్లాగే ఉంటాయి. కాబట్టి aided school అనేవాటిని తీసుకోదలచినట్లయితే, discrimination అనేది లేకుండా అన్నిరకాల aided schools ను తీసుకోవాలని ముఖ్యమంత్రిగారిని ప్రార్థిస్తున్నాను.

తరువాత Text Books, వాటిని సెలెక్టు చేయడం ప్రింటింగు వ్యవహారము చాలా గలాభాగా ఉంటున్నది. చిట్టచివరికి యీ విషయములో ప్రభుత్వమే చెడ్డపేరు తీసుకొని వస్తుందని నా అనుమానము. ముఖ్యమంత్రిగారికికూడ తెలిసిఉంటుందని అనుకుంటాను. Text books ను ప్రింటుచేసేటప్పటినుంచి, అసలు యీ books ను సెలెక్టుచేసినప్పటినుంచియే, ఒక్కొక్క కంపెనీవారుపోయి ఎంతెంతడబ్బు లంచాలక్రింద యిస్తున్నారో, తెలుసుకోవాలి. యిప్పుడు అది అంతా చెబితే లాభములేదు. నిజానికి యీ ప్రింటింగు అంతా ప్రభుత్వమే చేయిస్తే, లక్షలకొద్దిలాభము ప్రభుత్వానికే వస్తుంది. ఎంత లాభమురాకపోతే లేక కలెక్టరుSpecial officer కాబట్టిఆయనను చూచి,ఎట్లాగైనాCollector ను influence చేసి ఫలానా ప్రింటరు పలానా పుస్తకము ప్రింటుచేస్తాడు, అది మీ District Board లో పెట్టించండి, అని ఏర్పాట్లు చేసుకొని వెళ్ళుతున్నారు. ఈ విషయము చాలామంది అనుకుంటున్నారు. అందులో మా నెల్లూరుజిల్లా సంగతే చెబుతున్నాను. మా నెల్లూరు జిల్లాలో యీ సంగతి జరుగుచున్నది. ముఖ్యమంత్రిగారికి తెలియదు, కాని యిప్పుడు నేను వారికి చెబుతున్నాను. ఇంక మరొక విషయముకూడ చెప్పదలచాను. మా జిల్లాలో Text Books Committee వారు ఒకసారి సెలెక్టు చేసిన పుస్తకముకు తరువాత cancel చేసి, వేరే bookను select చేశారు. ఆవిషయము

13th March 1956] [Sri A. C. Subba Reddi]

యిప్పుడు ముఖ్యమంత్రిగారికి తెలియజేస్తున్నాను. నేను యీ విషయము చెబుతూ ఉంటే, వారికి ఆశ్చర్యకరముగా ఉండవచ్చు.

The Hon. Dr. B GOPALA REDDI .— పోయిన జులై నెలలోనా ?

Sri A C SUBBA REDDI .— లేదండి. ఈ జులైలోనండి.

అందువల్లనే నేను చెప్పవలసివచ్చింది. కలెక్టరుగారి మీద ఏదో వత్తిడి తీసుకొని వచ్చి ఉండాలి. వత్తిడి అయినా వచ్చి ఉండాలి, లేకపోతే యింకొక కారణము అయినా అయి ఉండాలి. ఒకసారి సెలెక్టు అయిన పుస్తకము కాన్సలు కావటానికి అవసరము యేమి ఉంటుంది ? ఇటువంటి విషయములు ముఖ్య మంత్రిగారు యిక్కడ ఉన్నారు గనుక, వారికి తెలియదు కాబట్టి యీ text book select చేయడము, print చేయడము, అంతా గూడ ప్రభుత్వమే చేస్తే, వచ్చేలాభము అంతా బడ్జెటులో చేర్చవచ్చు. లోటు కూడా పూడ్చుకోటానికి చాలా అవకాశము ఉంటుంది గదా ? ఇటువంటి లోపాలు జరుగుతూ ఉంటే, ప్రభుత్వానికి చెడ్డపేరు తప్పకుండా వస్తుంది.

మా నెల్లూరులో V R. College అని ఉన్నది. ముఖ్యమంత్రిగారికి తెలుసును. నెల్లూరులోనే వేణుగోపాలస్వామి దేవాలయము ఉన్నది. ఆ దేవస్థానమువారు ఆ కాలేజీకి 75 వేల రూపాయలు యిస్తామని అంటూంటే, ఆ సొమ్ము Endowment Department వారు శాంక్షను చేయకుండా ఉన్నారు. ఆ సొమ్ము యిప్పించే బాధ్యత ప్రభుత్వము వహించి, యిప్పిస్తారని ఆశిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

Sri T. JIYYARDAS:— ఉపాధ్యక్షా, నిన్న సాయంత్రము ఒక దివ్యసందేశాన్ని మనము విన్నాము. అదిగూడ పూజ్యవినోబాభావే గారినుండి విద్యావిషయమై విన్నాము వారు చెప్పిన దాన్నిబట్టి చూస్తే మనము విద్యను గురించి చర్చించడము అనవసరమని అనుకుంటున్నాను. వినోబాభావేగారు కోరిందల్లా విద్యను కేంద్రీకరణ చేయవద్దు, వికేంద్రీకరణమే చేయుమని కోరియున్నాను. వినోబాభావేగారు చెప్పిన సమయములో మన ముఖ్యమంత్రిగారు కూడ హాజరైనారు. వారుచెప్పిన సందేశం ప్రభుత్వము వారి మనస్సులలో పరివర్తనము తీసుకొని వస్తుందని నేను ఆశిస్తున్నాను. ముఖ్యమంత్రిగారు తమ ప్రసంగంలో మన పూర్వ కవులను ప్రస్తుతించారు. ఆ ప్రసంగములో సంస్కరణముల పేరిట విద్యయొక్క పద్ధతిక్రింద చెప్పిన విషయములు ఏమంత ఎక్కువ ప్రోత్సాహకరములు కావని చెప్పటానికి విచారిస్తున్నాను. తెలుగుభాష మనకు ఒకందుకు ఉపయోగించింది. తొలుదొల్త స్వీయరాష్ట్రి సంపాదనకు తెలుగుభాష మనకు ప్రాతిపదికగా తీసుకున్నాము. మేము తెలుగువారము గనుక మాకు తెలుగుభాషా రాష్ట్రాన్ని పంపకము చేయుమని కేంద్ర ప్రభుత్వాన్ని కోరుతూ, మన భాషను మనము ఆధారము చేసుకొని ఆంధ్రరాష్ట్రిమును సంపాదించాము. మనమే కాదు. మన ప్రక్కన ఉన్నవారుకూడ తెలుగుభాష మాట్లాడేవారే గనుక, వారినిగూడ మనతోపాటు చేర్చి, విశాలాంధ్రగా విభజించమని కోరినప్పుడు గూడ, మన తెలుగు భాషనే మరల ఆధారము చేసుకున్నాము. భాషామ తల్లిని మనయొక్క స్వీయరాష్ట్రి సంపాదన కొరకు పరిపాలనను కైవశము చేసుకోటానికి యీ విధముగా అడ్డము వేసుకున్నప్పుడు ఆంధ్ర భాషా సేవకోసము తెలుగు

భాషను ఉద్ధరించేదాన్నైనా కించిత్ శ్రమచేయడము మన అందరియొక్క ధర్మమని మీ ద్వారా ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను. అయితే విద్యా పద్దుక్రింద నాలుగు లక్షల తొంబై ఎనిమిదివేలు ప్రభుత్వము కేటాయించింది. ఈ కొంచెము సొమ్ములో దాదాపు ఎక్కువ డబ్బుఅంతా ఉన్నత విద్యకు కళాశాలల విద్యకు, వెళ్లింది. అట్లా వెళ్ళడము సబబే. కారణమేమిటంటే యిప్పటి వరకూగూడ ఆంగ్లభాషా వ్యామోహమే ప్రధానముగా ఉంటున్నది. ఆంగ్లభాషా పాటవము యిప్పుడు ఏ స్థితిలో ఉన్నదంటే My goes, you comes" అనే స్థితిలోనే ఉన్నది ఆ భాష యింకా కృశించి మన మధ్యలో నుంచి పోవడానికి యీ డబ్బుఅంతా కూడ ఖర్చుచేయవలసి ఉంటుందని అంటున్నాను. అయితే కించిత్ ధనము తెలుగుభాషకు కేటాయించి ఇప్పుడు దానిని సద్వినియోగ పరచుకోవలసిందిగా మాత్రము నేను మనవి చేస్తున్నాను. బహుశః మంత్రిగారు ప్రస్తుతించినట్లుగా పోయిన కవి గూడ ఒక మాట చెప్పారు "ఆకటికిన్ గొనిపోయి" — [మనకు ద్విభాషా రాష్ట్రాలు కావాలని అంటున్నాము గనుక, యిక్కడ రెండు పదములు లుప్తము చేయదలచుకున్నాను.]

"అమ్మను త్రిశుద్ధిగ నమ్మ భారతీ" అన్నారు. కాబట్టి ఆ ఒక హామీ అయినా సరే ముఖ్య మంత్రిగారు యిస్తారని ఆశిస్తున్నాను. ఎందుకంటే యిక్కడ నాకు ఒక్క భయము మాత్రము కలుగుతున్నది ఏమిటంటే, సంస్కృత భాష ఎక్కడైనా సరే ఏ పాఠశాలలోనైనా సరే ప్రమాదవశాత్తు ప్రవేశపెట్టేటట్లయితే, యీ తెలుగుభాష కుంటుపడి పోతుందేమోనని. ఇంతకు ముందు ఒక సోదర సభ్యుడు "నేను సరస్వతిని ఉపాసించాను" అని చెప్పారు. సంస్కృతము అంత ఘోరమైన మృగము కాదు. అది బహుశః మన మధ్యనలేకుండా నశించిపోయిన కారణము చేత యిట్లా ఉందేమో కాని, ఏ మానవునికైనా సంస్కృతము వస్తే, చక్కని తెలుగు భాష వస్తుందని నేను మీకు మనవి చేస్తున్నాను. క్రిందటి సమావేశములో ఒకరు లేచి, "భారత సంవిధానమును సంస్కరించండి. అందులో "ప్రాసంగిక, సాంసర్గిక, ఆనుషంగిక" అనే పదములున్నవి. అవి మాకు అర్థము కాలేదు. కాబట్టి మేము మాట్లాడు తెలుగు భాషనే సంస్కరించండి" అని కోరారు. అది కూడ అవసరములేదు. మన సాంప్రదాయాలు కూడా మారిపోయినవి. నిన్న ఒక సోదర సభ్యుడు "ఈ నాయకుడు మంచివాడు కాడు. ఈ నాయకుడు పోవాలి. ఈ నాయకుడు మారిపోవాలి" అని అన్నాడు. ఆయన మాట్లాడిన దానిలో ఔచిత్యము లేదు. సందర్భ శుద్ధి అంతకన్న లేదు. అటువంటి సంప్రదాయాలు కూడ మనకు తెలియకుండా ఉన్నవి. ఎందుకంటే మనకు తెలుగు భాష చక్కగా రాని కారణముచేతనే నని అంటున్నాను. అట్టి అమంగళము ప్రతిహత మవుతుందని తెలుసుకోవాలి. మన నాయకుడు ధీరోదాత్తుడు. ఈ నాయకునికి గూడ కొన్ని లక్షణములు ఉన్నవి. నాయకుని వరించుట మన వంతే కాని, "నాకు నీవు పనికిరావు పో!" అనుట మన వంతేనా? ఇది సాధ్వీ లక్షణము కాదు. అందువల్ల సోదర సభ్యులందరూ కూడ సంస్కృత భాషలో గల నాటకములు, అలంకారములు చదువుకుంటే నాయకుని కుండవలసిన లక్షణములన్నీ కూడ సంప్రదాయ సిద్ధముగా తెలియగలవు.

ప్రాథమికవిద్య అప్రస్తుత విషయమని అనుకుంటారేమో గాని దానిలో మాత్రము నాకు నమ్మకము ఉన్నది. తెలుగుభాష నభ్యసించే విషయములో విద్యార్థికి ఆరు సంవత్స

13th March 1956] [Sri T. Jiyyardas]

రాల ప్రాయముకంటె యింకొక మెట్టు క్రిందకు దించుకుని వెళ్ళమని ప్రభుత్వానికి సలహా యిస్తున్నాను. అందులో మన Education శాఖ Director గారు కూడ నాలుగున్నర సంవత్సరముల ప్రాయము ఉంటే చాలునని అన్నారు. నాలుగున్నర సంవత్సరముల వయస్సులో విద్యార్థికి విద్యను ప్రారంభిస్తామనుకోండి. ఎవరైనా మేధావిగా ఉండి, సునిశితసేవకుడు వస్తే ఆ నాడు ప్రహ్లాదునికి గర్భములో ఉండగా నేర్పినట్లుగా, ప్రతివాడు గర్భములో ఉండగానే విద్య నేర్పేవాడు వస్తే, సంతోషించే వాళ్ళలో నేను ఒకణ్ణి. అంతదూరము మనము వెళ్ళలేకపోవచ్చును. నాలుగున్నర వయస్సుగల బాలలతో బాలగురుకులము ప్రభుత్వము పోషిస్తారని అనుకుంటున్నాను.

"క్రియాసిద్ధిస్సత్వే భవతిమహతామ్ నోపకరణే॥"

అని, నేను యీ విషయములన్నీ చెప్పి సభ్యులను విసిగించడానికి బదులు 15-వ జులై తేదీన ఒక బాల గురుకులాన్ని ఓడరేవులో ప్రారంభించబోతున్నాను. దానికి మన ముఖ్యమంత్రిగారు ఎంత సంకల్పసిద్ధుడో సభ్యులే వినబోతారు. ఆయన ఒకచోట శంఖుస్థాపన చేస్తే, వేరొకచోట భవనరూపమును పొందినది. శంఖుస్థాపన చేసిన తరువాత సాంప్రదాయము యేమిటంటే, రాళ్ళు సున్నము తీసుకొనివచ్చి ఒక కట్టడము కట్టించాలి. అట్లా అవసరములేకుండా, ఆయనకు సంకల్పము ఉన్నది కాబట్టి, నాకు ఓడరేవులో కట్టిన మేడ, పెట్టిన పొయ్యి దొరికినవి. అక్కడ నేను మొదటిసారిగా బాల గురుకులాన్ని ప్రారంభముచేస్తున్నాను. అయితే నేను ఒకటిమాత్రం మనవి చేస్తున్నాను. ఎప్పుడో బ్రిటిషు కాలములో తయారుచేసిన Madras Education Rules అనే శిఖండిని మాత్రము మా ఎదుట ప్రసాదించి యీ బాల గురుకులాన్ని బలిచేయకుండా చేయాలి అని కోరుతున్నాను. అట్లా కాకుండా ఏ విద్యనైతే మనము కోరుకుంటున్నామో, ఆ విద్యను వీలుఅయినంతమట్టుకు పసిపిల్లల దగ్గరనుంచి ప్రారంభిస్తాము. కాని దానికి కావలసిన నైతిక సంపత్తి, ఆర్థిక సంపత్తి ముఖ్యమంత్రిగారు ఆదర్శకర్తగా ఉండి దోహదం యిస్తారని ఆశిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

Sri B. RAMA REDDI:— గౌరవనీయులైన ఉపాధ్యక్షా, మన ముఖ్యమంత్రిగారు ప్రతిపాదించిన విద్యావిషయకమైన ఉపన్యాసములో విద్యావిషయకంగా ఒక బడ్జటును ప్రవేశపెట్టితే, దానిని ఆమోదించడము లేదని cut motion ను ప్రతిపాదించడము ఒక విధముగా విచారకరముగా ఉన్నది. కాని ఆ విషయములో నేను మాట్లాడదలచుకున్నాను. అందులో కొన్ని విషయాలు ప్రభుత్వ పార్టీవారి దృష్టికి తీసుకొని వస్తున్నాను. అవి విద్యకు సంబంధించినవి కాబట్టి వాటిని హృదయపూర్వకంగా వారు విమర్శిస్తారనే ఆశచేత యీ విషయాలను చెబుతున్నాను. వారు ఆమోదిస్తారని అనుకుంటాను.

ముఖ్యమంత్రిగారు శ్రేయో రాజ్యపు ముఖ్యమైన ఆదర్శాల లక్ష్యం సార్వజనీనమైన విద్య అన్నారు. అంటే సర్వజనులు "విద్య నేర్చుకున్ననాడే" అని శ్రేయోరాజ్య స్థాపన అనే పదములో ఉన్న పరమార్థము నిజమవుతుంది అని బహుశ వారి ఉద్దేశ్యములో ఉండవచ్చు కాని "విద్య" అనే పదమునకు అర్థము ఏమిటి ? అనే దానిని గూర్చి మన పెద్దలు ఒక విషయము చెప్పారు. అది యేమిటంటే—

[Sri B. Rama Reddi] [13th March 1956

"విద్య యొసగును వినయంబు, వినయమునను
బడయు పాత్రత, పాత్రత వలన ధనము,
ధనము వలనను దానంబు, దానివలన
ఐహికాముష్మిక సుఖంబు లొందునరుడు."

కాబట్టి విద్యలో అంత పరమార్థం ఉన్నది. కనుక మనుష్యుని నైతిక జీవనాన్ని తీర్చి దిద్ద గలిగిన శక్తిగలది విద్య. అందుచేత ఆ విద్యను బోధించే ఉపాధ్యాయులకు ఎల్లాంటి గౌరవం ప్రభుత్వం ఇస్తోందన్న విషయంలో మన ముఖ్యమంత్రిగారు అంత ఎక్కువగా పట్టించుకున్నట్లు వారి ఉపన్యాసంలో ఎక్కడా కనిపించలేదు. కాని కట్టకడపట ఒక మాట చెప్పారు. ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులకూ హైస్కూలు ఉపాధ్యాయులకూ కళాశాల ఉపాధ్యాయులకూ జీతాలు పెంచాలని ఆ ఉపాధ్యాయులే కాదు అందరుకూడా చెబుతూ ఉన్నారని చెప్పారు. మేము చెప్పడమేనా, లేక వారు కూడా పరిశీలించారా అని నా కొక సందేహం ఊరికే చెప్పడంకాదు, నిజంగా హృదయావేదనతో చెప్పేటటువంటి నగ్న సత్యమని మాత్రం వారికి నేను విన్నవించుకుంటున్నాను. కేవలం ఉబుసు పోకకు చెబుతూ ఉన్నమాట అని అనుకున్నారేమో వారు అనే ధ్వని వారి మాటలలో కనిపిస్తూ యున్నది. బీద ఉపాధ్యాయుల దుస్థితిచూచి కన్నీరు కార్చుచు హృదయావేదనతో చెప్పుచున్న నగ్న సత్యమని మనవి చేస్తున్నాను. విద్యను ప్రసాదించే ఉపాధ్యాయులయొక్క అంతస్తును అభివృద్ధి చేయలేకపోతే మాత్రం ఉత్తమాటల వల్ల శ్రేయోరాజ్య స్థాపనకు సార్వజనీన విద్యకావాలని చెప్పినందువల్ల అనుకున్న ఫలితం మాత్రం రాదు. ఈ విషయమై నేను చెప్పడమే కాకుండా ఇంతకుముందు రాష్ట్రానికి కొంతకాలం విద్యామంత్రిగా ఉన్నవారు కూడా చెప్పారు. వారు చెప్పిన దానిలో నేను ఆవేదన అనుభవించాను గాని ఏమిచేయలేక పోయానని అన్నారు. కాని వారు కొన్ని సూచనలు చేశారు. వారు చేయకపోయినా సూచనలు ఇచ్చారు కాబట్టి ముఖ్యమంత్రిగారు చెప్పినటువంటివి కొన్నైనా ఆచరణలో పెట్టడానికి ప్రయత్నం చేస్తారని నేను మనః పూర్వకంగా ఆశిస్తున్నాను. ఒకనాడు ఉచ్ఛస్థాయిలో, గౌరవంగా చూడబడే ఉపాధ్యాయులు ఈ నాడు పల్లెటూళ్ళలో కొద్దిపాటి జీతాలతో చదువుచెప్పే అయ్యోర్లు అని నీచంగా చూడబడుతున్నారుగాని, పూర్వం వలె వారికున్న గురుపదం ఎక్కడా కనిపించడంలేదు. మంత్రిగారు "రాష్ట్రాదాయంలో నాలుగవవంతు విద్యకు ఖర్చుచేస్తున్నాం, ప్రాథమిక విద్యారంగం పురోగమిస్తోంద"ని అన్నారు. విద్యార్థికి విద్యవల్ల కలుగవలసిన లాభాలు నేను ముందు చెప్పాను. కాని ఈ నాడు హైస్కూళ్ళలో గాని కళాశాలలో గాని విద్యార్థుల పరిస్థితులుచూస్తే, క్రమశిక్షణలేకుండా ఉన్నది. కొన్ని పాఠశాలలలో పరీక్షలు పోలీసు బందోబస్తులో జరిపించే పరిస్థితిఏర్పడింది. ఇది విద్యావిధానానికే సిగ్గుచేటు, గొప్పకళంకం అని చెప్పడానికి ఎలాంటి సందేహంలేదు.

The Hon. Dr. B. GOPALA REDDI:— బద్వేలులోకూడా ఉందా?

Sri B. RAMA REDDI:—దేవుని దయవల్ల అది మా బద్వేలులో మాత్రం ఇంకా లేదు. అటువంటి భయమేలేకపోతే, పోలీసు బందోబస్తు కావాలా అని హైస్కూలు ఉపాధ్యాయులకు అడగవలసిన అవసరంఉండి ఉండదు, ఒక ఉదాహరణ

13th March 1956] [Sri B. Rama Reddi]

మంత్రిగారి దృష్టికి తీసుకు వస్తున్నాను. ప్రొద్దుటూరు హైస్కూలులో ఒక అసిస్టెంటు సూపరింటెండెంటు, ఎవరో పిల్లవాడు కాపీ కొడుతుంటే పట్టుకున్నాడు. అందుకొఱకై అతనికి ముసుగువేసి దొడ్డిదారిని తీసుకొనిపోయి bus లో కూర్చోబెట్టి ఆయన స్వస్థానానికి పంపవలసిన పరిస్థితి ఏర్పడింది. ఈ ఉపాధ్యాయులకు ఒక విశిష్టమైన స్థానం ఏర్పరచి వారివేతనాలు పునహా పరిశీలించి హెచ్చు చేయవలెనని పునరుద్ఘాటిస్తున్నాను. ఈ విషయం ఓటుకు పెడితే ఓడి పోతుందేమో గాని ఒక విషయం మాత్రం ధీమాగా చెప్పగలను. క్రమశిక్షణ అనే పేరుతో అక్రమమైన ఒత్తిడిలేకుండా ఉంటే ఇక్కడున్న 196 గురు సభ్యులలో 160 మంది వరకూ దీనికి ఓటు చేస్తారు. విద్యా విషయములు బాగా ఆకళింపు చేసుకున్న విద్యా మంత్రి, ఆర్థిక మంత్రి, ముఖ్య మంత్రి పదవులు ముప్పిరిగా అలంకరించు చున్న ముఖ్య మంత్రిగారు ఈ విషయంలో న్యాయం చేయడానికి సమర్థత గలవారు కాని వారు ఆర్థికలోప మంటారు. ఆర్థికలోపం ప్రతి దానికీ ఉన్నది. ఈ ఆర్థికలోపం కల్గుతుందని ముందాలోచన లేకుండా, మనకు ధనాన్ని చేకూర్చేటటువంటి కొన్నిటిని పోగొట్టినారు. దానికి వేరే ఆదాయ మార్గాలు ఆలోచించకుండా వాటిని వదలుకున్నారు. ఐతే అది మంచి పద్ధతి ఐనందువల్ల దాన్ని విమర్శించడానికి జంకుతున్నాను.

The Hon. Dr. B. GOPALA REDDI :— ఏ విషయమో నాకు అర్థం కాలేదు.

Sri B. RAMA REDDI :— అది prohibition అని చెప్పవలసి వస్తోంది. ఇంకో అధ్వాన్నమైన విషయం ఏమిటంటే private స్కూళ్ళనుంచి వచ్చిన విద్యార్థులకు ఏదో కొన్ని ఆంక్షలు విధించారు. కాని నా స్వానుభవం చెప్పుచున్నాను. బహుశ ముఖ్యమంత్రి డాక్టరు గోపాలరెడ్డిగారు కూడా మొదట private schoolsలో చదివి ఉంటారేమో. నాకు తెలిసినంతవఱకూ private schools లో చదివివచ్చి హైస్కూలులో చేరిన విద్యార్థులే బాగా రాణించారు Private schools లో విద్యా బోధన చాలా కట్టుదిట్టంగా ఉండి విద్యార్థులను మంచి తర్బీతుచేసి పంపుతారు. అక్కడి ఉపాధ్యాయులకు training లేదనే దానివల్ల అక్కడి విద్యా విధానం గురించి దురభిప్రాయపడవలసిన అవసరంలేదు. పరీక్ష చేసే III Form లో చేర్చుకోవచ్చు. అందువల్ల ఏమీ లోపం కలుగదు. ఈ విషయం మంత్రిగారు గమనిస్తారని ఆశిస్తున్నాను. విద్యా విధానం పూర్తిగా బాగుపరచాలంటే ఆర్థికలోపం అనే కారణం చెప్పకుండా అధమపక్షం మదరాసు రాష్ట్రంలో ఇచ్చిన 5 రూపాయలు జాస్తీగా ఇచ్చుటకు ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను. అదిగాక వారికి pension ఇచ్చే సదుపాయాలు కల్గచేస్తారని వింటున్నాం. ఆర్థికలోపం ఏదోవిధంగా సవరించుకుని ఉపాధ్యాయుని తాహతు వృద్ధిచేసి, విద్యారంగంలో అభివృద్ధి మార్గాలు కలుగచేస్తారని మనవి చేస్తున్నాను.

Sri G RAMASWAMI REDDI :— అధ్యక్షా ! విద్యామంత్రి డాక్టర్ గోపాలరెడ్డిగారు ప్రవేశపెట్టిన డిమాండును బలపరుస్తూ కొన్నివిషయాలను వారి దృష్టికి తెస్తున్నాను. ముఖ్యముగా ప్రాథమిక విద్యారంగములో aided పాఠశాలల పాత్ర ప్రముఖముగా ఉన్నది. వాటిలో teachers managers చేసే అన్యాయాలు చాలా

ఉన్నవి. Strength లేకుండా హెచ్చుచుండి teachers ను వేసికొని అనవసరముగా ప్రభుత్వమువద్ద డబ్బును రాబట్టుకొని చదువు చెప్పడం మాత్రము చాలా తక్కువగా ఉన్నది. కనుక ఈ aided schools ను ఒకపద్ధతిగా ఎత్తివేయుటకు ఏర్పాటు చేయించవలెను. ఈ సంవత్సరం నెల్లూరు జిల్లాలో అనలుజరిపి దాని మంచిచెడుగులు చూచి రాష్ట్రమంతటా అమలు చేస్తామన్నారు. అట్లా కాక మొత్తం aided పాఠశాలలను ఈ సంవత్సరమే ప్రభుత్వం తీసుకొనవలెనని మనవి చేస్తున్నాను. జిల్లా బోర్డు పాఠశాలలలో జరిగే అక్రమాలను వారి దృష్టికి తీసుకువస్తాను. భార్యాభర్తలు ఇద్దరు ట్రైనింగు అయిన టీచర్లుగా ఉంటే వారిద్దరిని ఒకచోట ఒకే స్కూలుకు వేయకుండా భార్యను ఒకచోట భర్తను ఇంకొకచోట వేయడము ఎంతో అన్యాయముగా ఉన్నది. అట్లా కాకుండా వారిద్దరినీ ఒకచోట ఉండేటట్లు ప్రభుత్వం చెయ్యవలయును.

పాఠ్యపుస్తకాలు ప్రతి సంవత్సరం మార్చడంవల్ల తల్లిదండ్రులకు చిక్కులు కల్గుతున్నవి. కాబట్టి ఈ పాఠ్యపుస్తకాలు నాలుగు సంవత్సరములు, కనీసము మూడు సంవత్సరముల వరకైనా మార్చకుండా ఉంచడము మంచిది అని మీ దృష్టికి తెస్తున్నాను.

విద్యార్థులలో నానాటికి క్షీణించుచున్న క్రమశిక్షణ, పెరుగుతున్న అవిధేయత వారికి తెలిసిన విషయమే. అనుభవజ్ఞులైన పెద్దలతోను, విద్యార్థి ప్రతినిధులతోను ఒక కమిటీని ఏర్పాటుచేసి తగిన specialists నుండి సలహా పొందవలెనని నా సలహా. దీనికి ఆంధ్ర, తిరుపతి విశ్వవిద్యాలయ విద్యార్థి ప్రతినిధులనుండి ఒకరిద్దరిని తీసుకోవలసినదని నా సలహా. అప్పుడే విద్యార్థుల సమస్యలు సంపూర్ణముగా వారికి అవగాహన చేసేదానికి వీలుగా ఉంటుంది. కాబట్టి ప్రభుత్వం దానిని గురించి శ్రద్ధగా ఆలోచించవలయును అని మనవి చేస్తున్నాను. ఒక్కొక్క కాలేజీకి క్రిందటి సంవత్సరము 1500-1700 కన్న ఎక్కువ తీసుకొనకూడదని ప్రభుత్వము ఆర్డరు issue చెయ్యడమువల్ల కొన్నివేలమంది విద్యార్థులు చాలా అవస్థలు పడ్డారు.

The Hon. Dr. B. GOPALA REDDI:–First Grade Colleges లో 1750 వరకు చేర్చుకోవచ్చు.

Sri G. RAMASWAMI REDDI:— పోయిన సంవత్సరము Hindu College (గుంటూరు) విద్యార్థులు చాలా అవస్థలు పడ్డారు. కనుక ఇప్పుడే seats ఎక్కువ చేసి అటువంటి మినహాయింపు తీసుకొని రావద్దని నా మనవి. ముఖ్యముగా విద్యార్థులలో విద్య పూర్తిఅయి జీవితరంగంలో ప్రవేశించే విద్యార్థులతో కళాశాల విద్యార్థులకు మానసికమైన నైతికమైన శాస్త్రయుక్తమైన జ్ఞానం బోధించవలెనని చెపుతూ విరమించుచున్నాను.

Sri R. NATHAMUNI REDDI:— అధ్యక్షా, ఈ విద్యా డిమాండుపై రెండుమాటలు చెప్పదలుచుకున్నాను. ముఖ్యముగా మా యొక్క శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి ముఖ్యమంత్రిగారు కావలసిన ధనసహాయము ఇచ్చి ఇండియాల్లో ఇటువంటి విశ్వవిద్యాలయము లేదని చూపించేటట్లు తగు సహాయము చేస్తారని ఆశ

13th March 1956]  [Sri R. Nathamuni Reddi]

ఉన్నది, గాని ఈ సంవత్సరము 3 లక్షల 50 వేలు మాత్రము దీనికి కేటాయించారు. నేను నమ్మలేకున్నాను. ఇదే స్థితిలో ఇచ్చినట్లైతే ఈ విశ్వ విద్యాలయము పైకివచ్చే మార్గము ఉండదు. ఇదే దృష్టితో ఆంధ్ర విశ్వవిద్యాలయానికిఇస్తే దానికి నామరూపాలే ఉండేవి కావు. రూపాయికి పది రూపాయల విలువఉన్న రోజులలో చాలా డబ్బు ఇచ్చినందువల్ల ఈ రోజున ఈ స్థితికి వచ్చింది. గాని కొత్తగా విశ్వ విద్యాలయము స్థాపించి దానికి ఆర్థిక స్తోమత సరిగా లేనందువల్ల రికరింగుగా డబ్బు మాత్రము ఇచ్చినందువల్ల ఏమీ లాభము ఉండదు కాబట్టి ఇది పునః పరిశీలించి విశ్వ విద్యాలయానికి కావలసిన ఆర్థిక సహాయం కలుగ చెయ్యవలెనని నేను కోరుచున్నాను.

వెటర్నరీ కాలేజీ ఒకటి స్థాపించ దలచుకున్నారు. ఇది తిరుపతిలో పెట్టడమువల్ల విశ్వ విద్యాలయానికి అనుగుణ్యముగా ఉంటుంది లేబరేటరీసు ఉన్నవి. కాలేజీకి కావలసిన భూమి దమ్మిడీ ఖర్చులేకుండా ఉచితముగా దొరుకుతుంది కావలసినంత అడవి ఉన్నది పశువులకు కావలసిన కసువుకూడా ఉన్నది. కాబట్టి ఇచట వెటర్నరీ కాలేజీని స్థాపించుటకు ప్రభుత్వం పూనుకొన వలెనని నా కోరిక.

ఇప్పుడు మన విశ్వ విద్యాలయముకు ఆడవారికి కాలేజీలు మూడు ఉన్నవి అని చెప్పేరు. గాని వారి విద్యా విధానము ఏమీ ప్రయోజన కరముగా లేదు అని నాఅనుభవము నా బిడ్డలు చదువుకుంటున్నందున నాకు తెలుసును. వారు ఇండ్లకు వచ్చి ఈ చదువువల్ల ఒక పౌను అరపౌను లెక్క వేసి వంటలు చేస్తే ఈ preperations నోటిలో పెట్టడానికి వీలులేకపోతే ఇంటిలో పెద్దవారిపైన, వంటవానిపైన ఆధార పడవలసివస్తుంది. నేను కోరేది ఏమిటంటే ఆడవారు సంసారం ఏవిధముగా నడపాలో నేర్చుకొన వలయును. ఎంతచదువుకున్నా ఏ ఉద్యోగంలో ఉన్నా, ఎంత పెద్దవారైనా సరే ఎట్లా బిడ్డలను సాకాలి. ఎట్లా వృద్ధికి తెచ్చుకోవాలి ఎట్లా మంచి పౌరులు కావాలి చూసుకోడానికి తప్ప ఇంక దేనికి అర్హులు కారు అని నేను చెపుతున్నాను. కొంతమంది పెద్ద కాలేజీలకు వెళ్ళవచ్చును, ఆఫీసర్లు కావచ్చును, మంత్రులు కావచ్చును, డాక్టర్లు కావచ్చును. కాని బిడ్డలను సాకే బాధ్యత వారిమీద ఉన్నది. Theory మాత్రము ఉన్నది. Practical side కూడా కావలెను. తిరుపతిలోని women's college లో ప్రవేశపెట్టవలెను. అక్కడ ఒక Devasthanam వారి poor home ఉన్నది.దానిలో తల్లిదండ్రులు లేని పిల్లలు 200 మంది ఉన్నారు. వారిని తమ బిడ్డలుగా భావించి, వారికి అక్కడ ట్రైనింగు ఇచ్చినట్లైతే బాగా ఉంటుంది. ఈ సంవత్సరమే ప్రారంభిస్తారని కోరుచున్నాను.

ఇప్పుడు మనయొక్క విద్యా విధానములో ఏమేమో మార్పులు వస్తున్నవి. నా ఉద్దేశమేమిటంటే చాలామట్టుకు మన సభ్యులకు 7th form, Multipurpose Schools, Basic Schools విషయము తెలియదని నా ఉద్దేశ్యము. ఇది parents కు గ్రామస్థులకు, సామాన్య ప్రజలకు తెలియదు ఆందోళనగా ఉన్నది. ఈ విషయములో ప్రభుత్వంవారు చిన్న పుస్తకము తయారుచేసి ఈ విధముగా మారుస్తున్నామని దానివల్ల ప్రజలకు ఈ సౌకర్యములు ఉంటవి, ఇది experimental stage లో ఉన్నది, కొంత మంచిచెడ్డలు జరుగుతవి నష్టము ఉండవచ్చును, ఈ మార్పులుచేస్తామని పుస్తకం తయారు చెయ్యడం మంచిదని నా ఉద్దేశ్యము. ఈ అవకాశము ఇచ్చినందుకు అధ్యక్షుల వారికి వందనములు అర్పిస్తున్నాను.

[13th March 1956

Sri PILALAMARRI VENKATESWARLU:—అధ్యక్షా! Budget ను చదివినప్పటికీ ప్రధానామాత్యుల Budget ఉపన్యాసం విన్నప్పటికి విద్యా విధానంలో మంత్రివర్గం ఏ విధమైనటువంటి మార్పులు చేయదలచినట్టుగా అవగాహన కావడము లేదు. గత సంవత్సరంకంటె ఈసంవత్సరం Budget లో విద్యకోసం డబ్బు తగ్గించడం జరిగింది. ముఖ్యంగా ఈ సంవత్సరం building grants ను చాలాభాగం తగ్గించారు. విద్యార్థులకు యిచ్చే stipends తగ్గించారు. సుమారు 2 లక్షలకు పైచిలుకునుంచి ఏ 28 వేలకు తగ్గించడం జరిగింది. విద్యకోసం ఖర్చుపెట్టవలసిన మొత్తాన్ని ఇంత విపరీతంగా తగ్గించడాన్ని ఎవరు హర్షించలేరు. శ్రీ పట్టాభిరామారావుగారు యిచ్చినటువంటి ఉపన్యాసములోని ప్రతి వాక్యముతోను ఏకీభవిస్తున్నామని చెప్పగలను. వారు అనేక విషయాలు చెప్పారు. కుప్పుస్వామి కమిటీ రిపోర్టు మొదలు 1 వ ఫారములో వయఃపరిమితి వరకుచాలా వివరించారు. వారు యిచ్చిన సలహాలన్నీ ఖచ్చితంగా అమలు జరుప డానికి వీలైనటువంటి విషయాలు అని మేమను కుంటున్నాము. గత శాసనసభలో ఉన్నటువంటి పార్టీలమధ్య అనేక అభిప్రాయ భేదాలుండవచ్చు.

కాని ఆనాడు శాసన సభ్యులు అందరు దాదాపుగా కుప్పుస్వామి కమిటీ రిపోర్టును ఆమోదించారు. దానిని అమలుజరుపడానికి కూడా నిశ్చయించారు. కాని అమలు జరుపటం మాత్రం జరుగలేదు. ఆర్థికొన్ని కుప్పుస్వామి కమిటీవారు ఆలోచించలేక పోయినారనే లేనిపోని నింద వారిపైన మోపి వారి సిఫార్సులను తృణీకరించడం కూడా జరుగుతున్నది. అందువల్ల మేము ప్రభుత్వము విద్యపై అవలంబిస్తున్న విధానాన్ని, దానికై కేటాయించిన పద్దును ఏవిధంగాను బలపరచలేక పోతున్నాము. మేము మాత్రమే కాదు. మాట్లాడినటువంటి కాంగ్రెసు శాసనసభా సభ్యులందరు ఈ పద్దుపై వారి వ్యతిరేకతను తెలియజేసారే గాని ఎవ్వరు దీనిని బలపరచేటటువంటి స్థితిలోలేరు. బలపరచేవారు ఒక అప్పారావుగారు మాత్రమే వున్నారు. విద్యా విధానంలో ప్రభుత్వ వైఖరి ఏమిటి అన్న విషయాన్ని కొంచెం లోతుగా తరచి చూడాలి. విద్యపై గాని, భాషా సమస్యమీద గాని ప్రభుత్వ పాలసీ ఏమిటి ?

Language Commission కు ప్రభుత్వం ఒక statement నో లేక memorandum నో Submit చేసింది. దాంట్లో ఏం వ్రాసారో మనకు తెలియదు. Madras Assembly వారు రెండు మూడు రోజులు దీనిమీద తీవ్రంగా చర్చచేశారు. హిందీ ఏ స్థానం ఆక్రమించాలి ? ఇంగ్లీషు ఎక్కడుండాలి ? మాతృ భాషకు ఏలాంటి విలువ నివ్వాలి ? అనేటటువంటి విషయాల మీద వారు తీవ్రంగా చర్చ చేశారు. మనకు మాత్రం భాషా సమస్యపై కూలంకషంగా చర్చించే అవకాశము మన ప్రభుత్వం ఎందువల్ల ఇవ్వడములేదో బోధపడటంలేదు. ప్రభుత్వం Language Commission కు పంపించిన Memorandum లో వారి అభిప్రాయాన్ని ఏవిధంగా తెలియజేశారో దానిని శాసనసభ తెలిసికొనవలసిన అవసరమున్నది. తెలిసికోవటమే కాదు. దానిని ఆమోదించవలసిన అవసరమున్నదని మంత్రివర్గానికి తెలియజేస్తున్నాను. అదృష్టవశాత్తు ఆంధ్రదేశములో హిందీ మీద వ్యతిరేకత లేదు. దీనికి మనమంతా సంతోషించ వలసినదే. ఇందాక శ్రీ బ్రహ్మయ్యగారు మాట్లాడేటప్పుడు "నాగేశ్వరరావుగారు, పిల్లలమర్రి వెంకటేశ్వరులుగారు హిందీని వ్యతిరేకిస్తున్నారు" అన్నారు. హిందీని మేము

ఎన్నడూ వ్యతిరేకించలేదు. కాని ఒకటవ ఫారంనుంచి నిర్బంధము చేయవద్దనిచెప్పాం. మేము చెప్పినదానినే బ్రహ్మయ్యగారు కూడా చెప్పినట్లు వారి ఉపన్యాసం వల్ల అర్థమవుతున్నది. వారు III form నుంచి హిందీని ప్రారంభించవచ్చు నన్నారు. మేము హిందీని IV Form నుంచి పెట్టమంటున్నాము. కొందంటూరా III Form దగ్గరి నుంచి పెట్టినప్పటికి ఆలోచించడానికి వీలుంది. ఓ, న, మ, లు నేర్పడమే హిందీలో నేర్పేటట్టయితే విద్యాభివృద్ధి ఎక్కువ ఉండదు అని చెబుతున్నాము. అదేవిధంగా English ను I Form నుండి నేర్పవలసిన అవసరమేముంది? మన ప్రధానమంత్రి నెహ్రూగారు కూడా అనేకచోట్ల మాట్లాడుతూ ఈ రోజున భాషలకు ఉండే ప్రాముఖ్యతను గురించి చెప్పారు. State language కు National language కు ఎక్కువ ప్రాముఖ్యత యివ్వవలసినటువంటి ఈ దశలో English భాషను 1-వ ఫారం నుండి ప్రాముఖ్యత నివ్వవలసిన అవసరమేముంది? Optional language గా IV form నుంచో లేక University Course నుంచో ప్రారంభిస్తే చాలా బాగుంటుంది. Andhra Public Service Commission వారి report చూస్తే తెలుస్తుంది. B A (Hons) పాసైనటువంటివారికికూడా English లో expression చాలా poor గా ఉన్నది అని రిపోర్టులో ఉన్నది. అటువంటప్పుడు దానినే పట్టుక వేలాడుతూ విద్యార్థులమీద రుద్దటానికి ప్రయత్నం చేయటం అంతగా మంచిదిగాదు. ఈనాడు English కూడా మనకు అవసరములేదని గుర్తించాలి. మనం పంచవర్ష ప్రణాళికలద్వారా సర్వతోముఖంగా అభివృద్ధికావలెనని కోరుతున్నాము. పారిశ్రామికంగా కూడా అభివృద్ధి కావలెనని కోరుతున్నాము. ఏ దేశమునుంచి ఏ విధమైన సహాయము వచ్చినప్పటికి దానిని మనము ఆహ్వానించాలి. Technical skill గాని, శాస్త్రీయవిజ్ఞానానికిగాని అన్ని దేశాలకుపోయి నేర్చుకోవడానికి మనం తయారౌతున్నాము. అందుకై మనం విదేశభాషలను నేర్చుకొనవలసిన అవసరం చాలా ఉంది. ఒక English మాత్రమే కాదు. French నేర్చుకోవాలి. Italian నేర్చుకోవాలి. German నేర్చుకోవాలి. Chinese నేర్చుకోవాలి. Russian language నేర్చుకోవాలి. (గోపాలరెడ్డిగారు కోపంగా చూస్తున్నారు) Pandit Nehru గారే ఖచ్చితంగా ఈ విషయాలను చెప్పారు. అందుచేత మన అవసరాలకు ఉపయోగకరంగా మన విద్యావిధానం ఉండాలేగాని ఏనాడో British వాళ్లు వాళ్ళయొక్క అవసరాలను బట్టి తయారుచేసిన విధానాన్ని ఈనాటికి కూడా కొనసాగించడం దేశభవిష్యత్తుకి క్షేమకరం కాదు. Madras Educational Rules గురించి మాట్లాడుతూ కొందరు సభ్యులు "బాబూ ఈ శిఖండిని మా ఎదుట పెట్టవద్దు" అని తెలియజేశారు. Madras Education Rules నిజంగా మన విద్యావిధానాన్ని అరికట్టడానికే ఉపయోగపడుతవి గాని ప్రోత్సహించి ముందుకు తీసుకుపోవడానికి ఏ విధంగాను ఉపయోగపడటంలేదని ప్రభుత్వదృష్టికి తీసికొని వస్తున్నాను. మన శాసనసభలో అనేకమంది విద్యావేత్తలున్నారు. పట్టాభిరామారావుగారు ఉన్నారు. గోపాలరెడ్డిగారు ఉన్నారు. Madras Educational Rules లో ఉన్న దానికన్న వీరికెక్కువగా విషయాలు తెలుసు. వీరు కూర్చొని అవసరాలకు తగినటువంటి సమగ్రమైనటువంటి report ను ఎందువల్ల తయారుచేయలేక పోతున్నారో అర్థం కాకుండా ఉన్నది. ఇది కేవలము opposition పార్టీ సమస్యగా pose చేయవద్దని తెలియజేస్తున్నాను. ఈ రోజున మనబిడ్డలందరికి విద్యాప్రధానం సరియైన పద్ధతులలో జరగాలి. అంతే

గతంలో ఏ రెండువందల సంవత్సరాల క్రిందటనో 'మెకాలే' లాంటి మహానుభావుడు ఎవరో మనల్ని గుమాస్తాలుగా తయారు చేయటానికి ప్రవేశ పెట్టిన విధానాన్ని ఈ నాటికి కూడా కొనసాగించటానికి పూనుకోరాదు. దానివల్ల మనకు అనర్థకమేగాని ప్రయోజనము లేదని ప్రభుత్వ దృష్టికి తెచ్చుకొని వస్తున్నాను ప్రస్తుతం విశ్వవిద్యాలయాలలో దేనిని బోధనా భాషగా పరిగణించాలి అన్నది ప్రధాన విషయము. ఎందువల్లనంటే S S L C. వరకు మాతృభాషలోనే పాఠాలు చెప్పడం జరుగుతున్నది. S. S L. C. పాసై Collegeకి పోగానే English లోనే ప్రారంభిస్తున్నారు. అనేకమంది విద్యార్థులు కాలేజిలో ప్రవేశించిన మొదటి సంవత్సరములో లెక్చరర్లు చెప్పే విషయాలు అర్థంకాక నానాబాధలకు గురి అగుతున్నారు S S. L. C వరకు మాతృ భాషలో గరపటానికి ఉద్దేశమేమిటి ? నెమ్మదిగా university లో కూడా మాతృభాషను ప్రవేశ పెట్టాలనే ఉద్దేశముతోనే పెట్టారు. ఈనాడు ఆ ఉద్దేశము ఎందువల్ల వెనక్కిపోయింది? University autonomous body యే అని అంగీకరిస్తాము. కాని మన ప్రభుత్వము పరిపాలన అంతా తెలుగులో సాగిస్తూ కేంద్ర ప్రభుత్వము నకు హిందీలోనే సమాచార మంతా పంపించినట్లయితే university వారు "మేము మాత్రం English లోనే చెబుతా మంటారా? అట్లా చెబితే మన బిడ్డలు నేర్చుకుంటారా? వారికి మన అభిప్రాయాలను చెప్పేటటువంటి అవకాశం మనకు లేదా? ప్రజలచేత ఎన్నుకోబడిన శాసనసభ, ప్రజలందరి తరఫున పరిపాలన సాగిస్తున్నటువంటి మంత్రి వర్గము యూనివర్సిటీ అధికారులతో మా విధానమిది మీరు హిందిని తెలుగును ప్రోత్సహించాలి. మీ పద్ధతులు ఈ విధంగా ఉంటే మన State కు ఉపయోగ పడుతుంది" అని చెప్పలేకో, లేనటువంటి హీనస్థితిలో వున్నామాఅని గోపాలరెడ్డిగారిని ప్రశ్నిస్తున్నాను. University course లో తప్పకుండా బోధనఅంతా మాతృభాషలోనే జరిగేటట్టుగా చూడాలని నేను విజ్ఞప్తి చేస్తూ వున్నాను.

తరువాత School final అయిన పిమ్మట ఏడవ ఫారం extend చేస్తారు అని చెబుతున్నారు ఆరవ ఫారం ప్యాసైన తరువాత వాళ్ళనే 7 వ ఫారంలో కూర్చోబెట్టి క్రొత్త సిలబసు అంతాకూడా చెప్పేటట్లయితే వారికి అర్థంకాదు. అది వారి అభివృద్ధికికూడా ఆటకంగా ఉంటుంది. దీనికి మేము చేసేటటువంటి సూచన ఏమిటంటే 4వ ఫారం నుంచి ఆసిలబసును పెట్టేటట్లయితే ఎక్కువ మంది విద్యార్థులు ఆ పద్ధతిలో తయారు కావటానికి వీలౌతుందని S. S L. C. వరకు ఒక పద్ధతిలో తయారైన వారికి 7 వ ఫారంలో sudden గా ఇంకోటి తెచ్చిపెట్టేటప్పటికి ఈమార్పును విద్యార్థులు భరింపలేరని మాత్రము మంత్రివర్గము దృష్టికి తీసికొని వస్తున్నాను. మన ముఖ్య మంత్రి గారు తమ ఉపన్యాసములో "No opening of New Colleges" అని చెప్పారు. ఏమిటయ్యా పంచవర్ష ప్రణాళికలో మన ఆశయము అంటే క్రొత్త కాలేజీలు ఏమి తెరిచేటట్టు లేదన్నారు. ఈమంత్రివర్గం ఉన్న కాలేజీలు సరి పోతాయంటారా? Science colleges ను చూసుకొనేటట్లయితే ఇప్పుడు మొత్తం మన ఆంధ్రదేశంలో తిరుపతి యూనివర్సిటీ, ఆంధ్ర యూనివర్సిటీ అన్ని కలుపుకున్నప్పటికికూడా, 500లో 600 వందలకన్న ఎక్కువమంది science విద్యార్థులను తయారుచేసే టటువంటి colleges లేవు. అలాంటప్పుడు క్రొత్త కాలేజీలు పెట్టరట. ఇప్పుడే ఒక ప్రక్కన

13th March 1956] [Sri Pillalamarri Venkateswarlu]

మనకు ఇంజనీర్ల కొరత, డాక్టర్ల కొరత ఉన్నది ఈ కొరతను తగ్గించుకొనేందుకు క్రొత్త కళాశాలలను తెరవకుండా ఏ విధంగా సమస్యను పరిష్కరించ బోతున్నారు? బడ్జెట్టు ఉపన్యాసము వ్రాసేటప్పుడు గాని చదివేటప్పుడు గాని విషయాల ప్రాముఖ్యతను గుర్తించకుండా మన యెదుట ఈ విధంగా పారేయటం అనేది సరియైనటువంటి విధానంగాదు. ఈ రోజున క్రొత్త కాలేజీలు తెరవము అని చెప్పినప్పుడు కాంగ్రెసు శాసన సభ్యులంతా దానిని ఆమోదించ బోతున్నారా అని నేను ప్రశ్నిస్తున్నాను. అలాంటి ప్రమాదాన్ని మాత్రం తప్పించండి. చాలాచోట్ల కాలేజీలు ఈ రోజున కావాలని కోరుతున్నారు. నందిగామలో కాలేజీ కావాలని వారు గోలెత్తుతున్నారు. కొన్ని జమిందారులయొక్క భవనాలున్నాయి. అవి గనుక ప్రభుత్వము తీసుకొనేటట్టయితే తక్కువ ఖర్చులో అక్కడ కాలేజీలు పెట్టడానికి వీలౌతున్నది. మనం తక్కువ ఖర్చులో ఎక్కువ కాలేజీలను ఏ విధంగా పెట్టాలని ఆలోచించు కోవడానికి మారుగా మేము కాలేజీలను పెట్టలేము. ఇప్పుడు డబ్బులేదు అని ప్రతిదానికి డబ్బు ఇబ్బంది ముడిపెట్టుతున్నారు దానికి శ్రీ పట్టాభిరామారావుగారు సరియైనటువంటి సమాధానము చెప్పారు. 20 కోట్ల రూపాయలు బీహారులోను, 10 కోట్ల రూపాయలు బెంగాలులోను లోటు బడ్జెటుగా వుంటే మనం మాత్రము లోటు బడ్జెట్టుకు పోవడానికి భయం ఎందుకో? ఇంత భయపడవలసిన అవసరం ఏమిటో నాకేమి అగపడటంలేదు. గోపాలరెడ్డిగారికి ఎక్కువ అవసరంరాలేదు. గనుక అప్పు చేయడానికి భయమేస్తుందేమో నని అనిపిస్తుంది. కాని ఆవిధంగా భయపడవలసి నటువంటి అవసరము ఏమీలేదు. ఇంతమంది ప్రజలు మనకున్నారు. ఇంతమంది మనం కష్టపడుతున్నాము. మన రైతులు ఒక్కొక్క ఎకరానికి ఒక్క అర మణుగు ధాన్యము ఎక్కువగా పండిస్తే మనకెంతో డబ్బు ఎక్కువగా రావడానికి వీలుఉన్నది. ఇన్ని అవకాశాలు కలిగినటువంటి మన ఆంధ్ర దేశంలో లోటు బడ్జెట్టు లోటు బడ్జెట్టు అని చెప్పి ప్రతిది కోత కోసేటట్లయితే అసలు మనకు పురోభివృద్ధి ఏమన్న వుంటుందా? అందువల్ల ఈ మంత్రివర్గం వచ్చిన తరువాత అసలు go slow పాలిసీ అని చెప్పేసి మనయొక్క అభివృద్ధి కార్యక్రమా లంతటిని కూడా ఈ మంత్రివర్గం కుంటు పరుస్తుందనేది బడ్జెట్టు సారాంశము తప్ప మరేమిలేదు. తరువాత ఇంకొకటి కూడ మేము suggest చేస్తున్నాము. ఎక్కువ colleges పెట్టవద్దు అంటున్నారు. ఎక్కువ colleges పెట్టాలని మనం ఆందోళన చేస్తున్నాము. ఈలోపు shift system ఎందుకు ప్రవేశపెట్టకూడదు University వారు అంగీకరించడంలేదు. ఎందువల్ల అంగీకరించడం లేదో కారణాలేవైన చెబుతారా! 8 గంటలో 6 గంటలో ఇప్పుడు ఉపాధ్యాయులు పనిచేస్తున్నారు. కాబట్టి క్రొత్త teachers ను lecturers ను appoint చేయండి. వుదయం 7–12 వరకు ఒక బ్యాచి, సాయంత్రం 3–8 వరకు ఒక బ్యాచి ఈ విధంగా రెండు బ్యాచెస్ గా పెట్టి విద్య గరపటానికి ఎందుకు వీలులేదు? మనకు కాలేజీలు తక్కువగా వున్న ఇటువంటి సమయంలో shift system ఎందువల్ల పెట్టడానికి అభ్యంతరం పెట్టాలో నాకు మాత్రం బోధపడటంలేదు.

మెడికలు కాలేజీలు, ఇంజనీరింగు కాలేజీలు మనకు చాలా తక్కువగా ఉన్నాయి. కర్నూలులో మెడికలు కాలేజి పెడతారని అంటే చాలా సంతోషించాము. నా అభిప్రాయం కర్నూలులోని భవనాలు మెడికలు కాలేజి వంటి దానిని పెట్టుకోడానికి ఉపయోగించు కోవాలేగాని చిన్న ఆఫీసు లేవో పెట్టుకోడానికి ఉపయోగించడం నాకు ఇష్టం

(Sri Pillalamarri Venkateswarlu) [13th March 1956

లేదు రాయలసీమలో ఒక మెడికలు కాలేజి ఉండటంవల్ల డాక్టర్ల కొరత తీరడానికి అవకాశం ఉంటుంది. కేంద్రప్రభుత్వం అంగీకరించినా అంగీకరించకపోయినా, ఈ ప్రభుత్వమే తనంత తానుగా ఒక మెడికలు కాలేజ start చేయడానికి పూనుకోవాలి. దానికి అవకాశం కల్పించాలని తెలియచేస్తున్నాను. రైతులకు పన్నులు ఎక్కువ వేసినపుడు ఒకమాట చెప్పారు. 1914, 1915 సంవత్సరాలలో శిస్తుకు, land revenue ఎట్లా వున్నాయో ఈనాటికి అట్లాగే వున్నాయి అని అన్నారు. ఆ రైతు బిడ్డలమీద ఆనాడు విద్యకోసమై charge చేస్తున్న పన్ను చూస్తే ఎంత ఎక్కువో తెలుస్తుంది. ప్రతిసంవత్సరం ఎదో రూపంలో increase చేస్తూనే వున్నారు ఒకటవ ఫారంనుంచి 3 వ ఫారం వరకు నాలుగణాలనుంచి ఎనిమిది అణాలవరకు increase చేశారు. మూడవ ఫారంనుంచి రు 3 లు మొదలుకొని రు 6 లు వరకు increase చేశారు. Games fee, laboratory fee library fee అంటారు. Games వుండవు; library వుండదు; ఏవీ అక్కడ వుండవు, అనేక పన్నులు వసూలుచేస్తున్నారు. కాని ఏ ఒక్క పన్ను సక్రమంగా వుపయోగపడడంలేదని చెబుతున్నాను. ప్రభుత్వం శ్రద్ధ తీసుకోడంలేదు. మరొకటి కూడా చేయబోతున్నారు. Local board high schools కొంతమంది దాతలు పెట్టారు. బిల్డింగులు కట్టలేదని నిరుడు సంవత్సరం బెదిరిస్తే 10 లక్షల రూపాయిలవరకు ఖర్చుపెట్టి బిల్డింగులు కట్టారు. దానితో వారి స్థోమతు అయిపోయింది. మిగిలినది close చేయాలని ఉత్తరువులు ఇస్తామని తెలియచేస్తున్నారు. ఇంజనీర్లు చెప్పినట్లుగా మనం బిల్డింగులు కట్టాలి అంటే ఉన్న డబ్బు అంతా బిల్డింగులకే చాలదు. Science room, record room వంటివి పక్కా బిల్డింగులుగా కట్టి, మిగిలినవి tiles తో ఎందుకు కట్టకూడదు ? 50 సంవత్సరాలు నిలబడనక్కరలేదు, 25 సంవత్సరాలు నిలబడినా చాలును. 25 సంవత్సరాలు తరువాత మన పరిస్థితులు మారుతాయి. అప్పుడు పక్కా బిల్డింగులు కట్టుకోవచ్చును. అన్ని బిల్డింగులు సిమెంటు ప్లాస్టరింగుతోనే కావాలి అనుకుంటే మనం విద్యాసంస్థలనే నిర్మించుకోలేము. మన outlook లోనే మార్పు రావాలని నేను తెలియచేస్తున్నాను. మరొకవిషయం, ట్రయినింగు విద్యార్థుల stipends గురించి general discussion లో చాలామంది చెప్పారు. ట్రయినింగు స్కూలు విద్యార్థుల stipends సగానికి సగం తగ్గించారని చెప్పారు. చాలా పొరపాటు అది. 2 లక్షల 95 వేల రూపాయలు వుండేది 28 వేల రూపాయలు చేసినారు. ఇది సగానికి సగం తగ్గించడమా ? 2 లక్షల 95 వేలు ఎక్కడ; 28 వేలు ఎక్కడ ? దీనిని సగానికి తగ్గించారనడం సరికాదు. అంకెలులో పొరపాటు పడినట్లయితే explain చేయాలని కోరుతున్నాను. కుప్పుస్వామికమిటీ గురించి చాలామంది చెప్పారు. దీనిని అమలు జరపడానికి వీలున్నదని గత మంత్రివర్గము నమ్మినది; ఆ ప్రకారమే statement issue చేసినది. ఆ మంత్రివర్గం కూడా కాంగ్రెసు మంత్రివర్గమే. దానిమాట గౌరవించ వలసిన బాధ్యత ఈ మంత్రి వర్గానికి వున్నదని హెచ్చరిక చేస్తున్నాను. Teachers salaries చాలా అధ్వాన్నంగా వున్నాయి. వారు సమ్మె చేసే పరిస్థితి కూడా వస్తోందని శ్రీ పట్టాభిరామారావుగారు కూడా చెప్పినారు. సమ్మెవస్తే మీరు కమ్యూనిస్టులు, మీరు కమ్యూనిస్టులని వుద్యోగాల నుంచి తొలగించడం సాధ్యం అవుతుంది తప్ప కనీసం రు. 5 లు, లేదా రు. 2 లు, రు. 1 అయినా హెచ్చుచేసి ఈ సంవత్సరానికి ఇంతే, మరు సంవత్సరానికి ఆలోచిస్తాము

13th March 1956] (Sri Pillalamarri Veukateswarlu)

అది చెప్పడానికి నోచుకోన లేదు. డబ్బులేదని అంటున్నారే— అందరికీ ఇదే మాట చెబుతున్నారా ? పెద్ద వుద్యోగస్థులకు కలెక్టర్లకు డబ్బు చాలడం లేదని రూ 800 లు furniture కు కావాలని చాలా బాధ పడిపోతున్నారని వారికన్న ఎక్కువగా మీరేబాధ పడినారు. పేద ఉపాధ్యాయుల విషయంలో మీరు ఎందుకు బాధపడరు ? మద్రాసు రాష్ట్రంలో ఉపాధ్యాయులకు రు 5 లు increase చేశారు. వారు సమ్మె చేస్తే వెంకటేశ్వర్లను, పట్టాభిరామారావు గారిని కూడా కలిపి ఏమైనా చేయువచ్చును. దానివల్ల ప్రయోజనం ఏమి ? ప్రక్కనవుండే రాష్ట్రంలో చేస్తున్న ప్రయోజనాలనైనా మీరు గమనిస్తున్నారా ? నెల్లూరు జిల్లాలో aided school management మీరు తీసుకున్నప్పటికి, ఉపాధ్యాయులకు మాత్రం అదే జీతం ఇస్తారట. జిల్లాబోర్డుల్లోని జీతాలే అమలు చేస్తారట డబ్బులోపం అనేది ఎప్పుడూ వుంటుంది. ఇది ఎదో రూపంలో మనలను వెంటాడుతూనే వుంటుంది. డబ్బులోపం అంటూ చేయవలసిన పనులను మానివేస్తే చాలా ఇబ్బందుల పాలవుతామని సూచిస్తున్నాను మరొక ప్రధానమైన విషయం వున్నది. ఏకోపాధ్యాయ స్కూల్సు 1000 మంది teachers కు sanction చేసినారు కాని అందులో 790 మందికి మాత్రం provide చేసి మిగిలిన grant ను వదలి వేశారు. మిగిలినవారు మీకు దొరకలేదా ? 300 మంది స్కూలు ఫైనలు ప్యాసయినవారు దొరకలేదా ? ఎందువల్ల జరుగలేదని అడుగుతున్నాను. మళ్ళీ ఎక్కువగా ఇస్తారని ఆశిస్తున్నామని చెప్పారనుకోండి. అయినా కేంద్ర ప్రభుత్వం డబ్బుఇస్తే ఖర్చుచేసుకోడం చేతకాకపోతే అసమర్థతకాక ఏమిఅనాలో, ఏమి తెలివితేటలో నాకు అర్థంకావడంలేదు, ఈ రకమైన పరిపాలన ఎంత సత్వరంగా మారితే అంత మంచిదని చెబుతున్నాను. అసలు డిపార్టుమెంటల్ ఆలోచనా విధానమే మారాలి. లేనిపోని standards పెట్టి, prejudice తో ఆలోచించి అనేకమందికి వుద్వాసన చెబుతూ, కేంద్రప్రభుత్వం ఇచ్చిన grants సక్రమంగా ఖర్చుచేయకపోతే లోపభూయిష్టమైన విధానం కాక ఏమనాలి. ఒకవిషయం చెప్పి ముగిస్తాను. ఏదో కారణం చెప్పి teachers certificates cancel చేస్తున్నారు. D. E O ఏదివ్రాస్తే అదే ఖాయం. 4, 5 నెలలు salaries ఇవ్వకుండా పని ఎట్లాచేస్తారు ? ఉరితీసి చంపండి, అంతేకాని ఇచ్చే జీతాలు మానివేయవద్దు అతణ్ని ఒక్కణ్ణేకాదు మీరు బాధించేది, వాని పెళ్ళాం బిడ్డలనుకూడా మీరు బాధపెడుతున్నారు. కృష్ణాజిల్లాలో అనేకచోట్ల జరుగుతున్నది. గత మంత్రివర్గానికి కూడా అనేకసార్లు తెలియచేశాము. Teachers certificates అనేక రాజకీయ కారణాలు పెట్టి cancel చేసి ఇబ్బంది పెడుతున్నారని చూపించాము, ఆనాడు మంత్రిగారు డిపార్టుమెంటువారు examine చేసి ఏమీ లేదని త్రోసి పారవేశారు మళ్ళీ ఈనాడు అవే charges వస్తున్నాయి. ఒక వుపాధ్యాయుని బాధిస్తున్నారు. ఆయన grant ఆగిపోయింది. ఒకసారి విచారణ జరిగి, అందులో ఏమీ నిజంలేదని అన్నతరువాత తిరిగి అవే charges చేస్తున్నారు. 300, 400 మంది ఉపాధ్యాయులకు రావలిసిన grant ను ఆపుచేసే D. E O. కు punishment లేదు. ఇవి అన్నీ అవకతవకగా జరుగుతున్నాయని మీ దృష్టికి తీసుకువస్తున్నాను. తిరుపతి యూనివర్సిటీకి 3½ లక్షలు రూపాయిలు మాత్రం ఇచ్చారు. మీటింగులో గోవిందరాజులు నాయుడుగారు 10 లక్షల వరకు లోటు బడ్జెట్టుగా ఉన్నదని తెలియచేసారు, ఎక్కడనుంచి వస్తుంది డబ్బు ? Building grants ఇవ్వరు.

University ని పెట్టారు. పోషించవలసిన బాధ్యతలేదా ? గాలికి వదిలితే బ్రతుకుతుందా ? తిరుపతి యూనివర్సిటీకి grants హెచ్చుచేయాలని కోరుతూ సెలవు తీసుకుంటున్నాను.

The Hon Dr B GOPALA REDDI —అధ్యక్షా ! బడ్జెటు చర్చకు ఇచ్చినటువంటి జవాబుగాని, ఈనాడు నేను చదివినటువంటి statement గాని సభ్యుల మీద అట్టే పనిచేయలేదేమో అనుకొంటున్నాను అందువల్ల అట్టే విపులంగా జవాబులు చెప్పవలసిన అవసరం లేదని అనుకొంటూన. వెంకటేశ్వర్లుగారు కూడా అదేవిధంగా అంటున్నారు. మేము ఇచ్చిన జవాబులవల్ల ఏమైన ప్రతిఫలం ఉంటే, మేము విపులంగా చెప్పడము మంచిదేమో. మీ ఉద్దేశ్యములు మీవి, మా ఉద్దేశ్యములు మావి అంటే మేము విపులంగా జవాబు చెప్పవలసిన పనిలేదు. ఈ నాడు జరుగుతున్నటువంటి చర్చలు వింటుంటే నాకేమీ సంతోషంగా లేదు. ఉపాధ్యాయుల విషయములు వింటున్నప్పుడు, పోలీసు బందోబస్తుతో పరీక్షలు జరుగుతున్నాయని వింటున్నప్పుడు, దేశభవిష్యత్తుమీద విశ్వాసము కలిగిన వారెవరికీ ఉత్సాహంగా వుండదు. Aided schools లో గాని, Elementary schools లో గాని, లేక మారుమూల ప్రదేశాల్లో ఉన్న స్కూల్సులో గాని ఉపాధ్యాయులు పడుతున్న కష్టాలు అందరికీ విదితమే.

మద్రాసులో చేసినారు, ఇంకా ఇతరచోట్ల చేసినారు. ఇక్కడకూడా చేయాలని చాలమంది చెబుతున్నారు. దీనికి మూలాధారంగా కుప్పుస్వామి కమిటీని ఆధారంగా తీసుకొని చెబుతున్నారు. పంజాబులోను, బీహారులోను లోటు బడ్జెట్ ఉన్నదని మనం పత్రికలలో చూస్తూనే ఉన్నాము. కొన్ని కొన్ని specified items, Irrigation, Electricity, Water Supply ఇటువంటివాటికి కొంతవరకు grants loans ఇస్తాము అని Education, Public Health లపై జరిగే current expenditures కు reserves ను అభివృద్ధిచేసుకోవలయునని ప్లానింగు కమీషను వారు చెప్పారు. ఇప్పుడు నందికొండ, మాచ్‌ఖండు ప్రాజెక్టుల నిర్మాణమునకు వారిని అప్పు ఇవ్వమంటే ఇస్తారుగాని, Elementary Education ను అభివృద్ధిచేసుకుంటాము అప్పు ఇవ్వమంటే ఇవ్వరు. రెండవ పంచవర్ష ప్రణాళికలో మీ resources అన్నీ బాగుచేసుకొని ఇటువంటి items అన్నీ బాగుచేసుకోమని వారు చెబుతున్నారు. ఇప్పుడు పంజాబు బడ్జెటులో 20 కోట్ల రూపాయలు లోటు ఉన్నది. వారు ఇప్పుడు భాక్రా నంగల్ ప్రాజెక్టు నిర్మిస్తున్నారు. ఆ లోటు అంతా కూడా దీనిమీదే అయినట్లయితే కేంద్ర ప్రభుత్వమువారు తప్పకుండా కొంత ధనం loan క్రింద ఇస్తారు. దీనిని తరువాత ఎప్పుడు అయినా తీర్చుకొనవచ్చును. అట్లాగ మనం Electricity మీద కొంత Capital expenditure ఖర్చుపెట్టినట్లయితే అందువల్ల మనకు ఎంత లోటు ఉన్నా ఫరవాలేదు. దీనికి కేంద్ర ప్రభుత్వం loan ఇస్తుంది. అయితే మనం Public Health, Roads మీద ఖర్చుపెట్టినట్లయితే మనకు ఏమీ loan ఇవ్వరు. ఉన్నదాంట్లోనే మనం సర్దుకోవలయును. ఈ నాడు మనం అనుభవించు amenities యొక్క భారాన్ని అంతా భవిష్యత్తుమీద వేస్తున్నాము. అంటే మన కొడుకులమీద మన మనుమలమీద వేస్తున్నాము అన్నమాట. కావలయునంటే మనం amenities ను కొంతవరకు తగ్గించుకొని, కావలసినంతవరకే ఖర్చులు చేసుకోవడము న్యాయముగాని,

3th March 1956] (Dr. B. Gopala Reddi)

మనం అనుభవించు amenities యొక్క భారం అంతా భవిష్యత్తుమీద వేయడం న్యాయము కాదు.

ఈనాడు మనకు అప్పు ఇచ్చేవాళ్ళు కూడా ఉండాలి. ఈనాడు Reserve Bank, Finance Department వారు పంచవర్ష ప్రణాళికకు కావలసిన ధనం అంతా ఎట్లా సంపాదించు కోవాలా అని ఆలోచిస్తున్నారు అది అంతా కూడా ప్రజల దగ్గరనుంచి రావలసినధనమే. ఈనాడు మనకు 6 కోట్లరూపాయిలు కావలయును. ఈనాడు ఆంధ్ర దేశములో ఎంతో సంపత్తి ఉన్నది, రైతులు తలొక బస్తా ధాన్యాలు ఎక్కువ పండించితే కావలసినదంతా వస్తుందని చెబుతున్నారు. సంతోషమే ప్రభుత్వము వసూలుచేయు 6 కోట్ల రూపాయలు loan విషయంలో వెంకటేశ్వర్లుగారు ఏమి సహాయము చేస్తారో ఇంతవరకు చెప్పలేదు. వారి పార్టీగాని వారుగాని ప్రజల దగ్గనుంచి వారిసందిగామ నుంచిగాని వారి జగ్గయ్యపేటనుంచి గాని, వారి కృష్ణాజిల్లా ప్రజలనుంచిగాని ఇంత అప్పు సంపాదించి ప్రభుత్వానికి సహాయము చేస్తామని చెప్పి ఉంటే ఎంత సంతోషంగా ఉండేదో మీరే ఆలోచించుకోండి. ఇటువంటి సహాయము విషయము ఏమీచెప్పకుండా కుప్పుస్వామి కమిటీఅని, పట్టాభిరామారావుగారి ఉపన్యాసము అని, వాటిల్లోవారికి కావలసిన పదాలు తీసుకొని, వారు చెప్పినదంతా సరిగా అర్థము చేసుకొనకుండా కొన్ని కొన్ని విషయాలు మాత్రము చెప్పి ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించడం న్యాయము కాదేమో అని అనుకొంటాను.

నరసింహంగారు విద్యాశాఖ కార్యదర్శిగా ఉండగా రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో విద్యకు 80 కోట్ల రూపాయలు ఖర్చు చేయబోతున్నామని ఎంతో ఉత్సాహంగా చెప్పారు. అది 80 అల్లా 60 అయింది. తరువాత 40 కి దిగి ఇప్పుడు 8 కోట్ల రూపాయలు అయింది. దీనిని గురించి మేము ఎంత ప్రయత్నము చేయాలో అంత ప్రయత్నమూ చేశాము, ప్లానింగు కమీషను వారిని బెదిరించాము, ఆదరించాము, బుజ్జగించాము. ఎన్ని చేసినాకూడా వారు 116 కోట్లకన్నా ఎక్కువ ఇవ్వడానికి వీలులేదు అన్నారు. మీదొక్క రాష్ట్రమే కాదు, ఇంకా 26 రాష్ట్రాలు ఉన్నాయి. వారందరికి కేటాయించా లన్నారు మీ బడ్జటులోకి దానిని సరిచేసుకోవాలని చెప్పారు. కొంత వరకు అది వాస్తవమే. ఈనాడు మనకు irrigation, electricity, agricultural research వగైరా పనులు ఎక్కువ అవసరముగా ఉన్నాయి వీటివల్ల education కొంత victim అయింది. ఎప్పుడు అయితే ప్లానింగు కమీషను వారు మన plan పరిమితిని 500 కోట్లనుంచి 116 కోట్లకు దించి, అంతకన్నా ఎక్కువ ఇవ్వమని అన్నారో అప్పుడు education ఎక్కువ suffer అవుతున్నదని అనుకొన్నాము. ఇటువంటి పరిస్థితులలో మనం irrigation ను delay చేయడమా ? Electricityని delay చేయడమా ? ఇంకేది delay చేయడం అని ఆలోచించుకో వలసిన పరిస్థితి ఏర్పడింది. అప్పుడు ఈ రోడ్లు, విద్యవగైరాలు కొంత కుంటుపడతాయని అనుకో వలసివచ్చింది. అది అనివార్యమైనది. అది ఎవరికీ సంతోషకరమైనది కాదు. అను కొన్న మాదిరిగా ఇంకా schools ను అధికం చేయకుండా ఈ 116 కోట్ల రూపాయలలోనే తుంగభద్ర ప్రాజెక్టు, నందికొండ, మాచ్ఖండ్ ప్రాజెక్టులకు అన్నింటికీ సర్దుకు రావలసి వచ్చింది. ఒక చోట ఏవో కొన్ని పనులు కావలయునంటే ఇంకొకచోట కొన్నిపనులు లేకుండా చేసుకోవలసిన అవసరము వచ్చింది. అందువల్ల కొంతవరకు విద్యకూడా

(Dr. B. Gopala Reddi) [13th March 1956

suffer అయింది అనుకొంటున్నాను ఏమైనా మనం వాస్తవాన్ని విస్మరిస్తే ప్రయోజనం లేదు. ఇటువంటి పరిస్థితులలో ఈ background లో ఈ recuring defecits లో కేంద్ర ప్రభుత్వమువారు ఇస్తున్న instruction ల మధ్యలో మనకు ఉన్నలోటు 3 కోట్లు ఎట్లా తీర్చుకుంటామా అని భయపడుతూ మరల ఉపాధ్యాయుల జీతములు ఎక్కువ చేయడానికి 30, 40 లక్షలు రూపాయలు లోటు యింకా ఎక్కువ చేయడము న్యాయమా? ఇది ఎట్లా సాధ్యమౌతుంది? ఉపాధ్యాయుల యొక్క స్థితి ఈనాడు ఆనందదాయకంగా ఉన్నదని నేను అనడములేదు. చాలా విషాదగ్రస్తంగానే ఉన్నది. మనయొక్క భవిష్యత్తు అంతా కూడ వారిమీద ఆధారపడి వున్నది. అయినప్పుడు మనం ఎట్లాగో అప్పుతెచ్చి వారికి జీతాలు పెంచినట్లయితే ఆ అప్పును అసలు ఫాయిదాలతో మన కొడుకులు, మనుమలు తీరుస్తారా? అందువల్ల ఈ పద్ధతి ప్రకారం ఈ విద్యాశాఖ మీద లోటు చేసుకోవడం న్యాయము కాదేమో అనిపిస్తున్నది. మనం ఈనాడు ఏదైనా చేయదలచుకొన్నప్పుడు, ఔదార్యం చూపించాలన్నప్పుడు ఒక విశాలమైన దృక్పథము చూపాల్సి ఉన్నప్పుడు దానియొక్క భారము మనము వహించడానికి మనం పూనుకోవలసి ఉన్నది ఆ భారమును వహించడానికి పూనుకోకుండా మేము ఏదో కనికరము చూపిస్తాము, దాక్షిణ్యము చూపిస్తాము అన్నంతమాత్రమున ప్రయోజనములేదు. రామస్వామిరెడ్డిగారు గూడా కొన్ని విషయములు చెప్పారు. ఈ ఉపాధ్యాయులు విషయముకూడా చెప్పారు. వారు పదే పదే "మా రైతులమీద ఒక్క దమ్మిడీకూడ పన్ను అదనంగా వేయకూడదు" అంటూ ఉపాధ్యాయులకు, N. G O. లకు, పోలీసుకానిస్టేబుల్సుకు జీతములు ఎక్కువ చేయాలంటారు. 100 కి 80 మంది ఈ రైతులు ఉన్నప్పుడు వారిమీదపన్నులుపడకుండా యింకెవ్వరిమీద పడాలో నాకు అర్థము కావడములేదని మొదటనే చెప్పాను. ఈ రెండింటికి పరస్పరము వైరుధ్యముకూడా ఉన్నది. మాకు ఈనాడు ఎక్కువ సౌకర్యాలు కావాలి. ఎక్కువ ఔదార్యము చూపించాలి. ఇక ఉపాధ్యాయులయొక్క విషాద గ్రస్తతను చూచి కనికరించి వారి కష్టాలను తీర్చాలనే భావములు ఉండటం మంచిదే కాని మేము నీటి తీరువ ఈ మాదిరిగా తీసుకోబోతున్నాము. Land Revenue ఈ మాదిరిగా చేసుకోబోతున్నాము. లేక ఫలానిది ఈ మాదిరిగా చేసుకోబోతున్నాము, అనికూడా చెప్పినట్లయితే కొంతవరకు మనం ఇటువంటి విషయములు ఆలోచించడానికి వీలవుతుందేమోగాని, లేకపోతే చాలా కష్టం అని చెపుతున్నాను. Teachers కు జీతాలు మేము పెంచలేకపోతున్నాము అంటే అది ఏమీ సంతోష దాయకమైన విషయంకాదు. ఆ విషయములో మమ్ములను ఎంతమంది తిడుతున్నారనేది మాకు తెలుసు. అయినప్పటికికూడా మేము అదిచేస్తాము, ఇదిచేస్తాము ఈ భారాన్ని అంతా భవిష్యత్తుమీద వేస్తాము అనడం న్యాయంకాదు.

మన రామిరెడ్డి మొదలగు కొందరు మిత్రులు S S L C పరీక్షలు పోలీసు బందోబస్తులతో జరుగుతున్నాయని చెప్పారు. అది ఎవరికీ సంతోషకరమైన విషయంకాదు. ఈవిధంగా ఎందుకు జరుగుతున్నాయి? ఎందుకు Head Masters భయపడుతున్నారు? మాష్టర్లు ఎందుకు ఇతరస్కూళ్ళకుపోయి పరీక్షాధికారులుగా ఉండడానికి భయపడుతున్నారు? ఈ విషయములను అందరూకూడా దర్యాప్తుచేస్తే బాగుంటుంది దీనికి కారణము ఏమిటో వెంకటేశ్వర్లుగారుకూడా దీక్షంగా పరిశీలనచేస్తే బాగుంటుంది. ఎటువంటి వాతావరణములో పరీక్షలు జరుగుతున్నాయి? వీటికి విద్యార్థులు బాధ్యులా?

13th March 1956] (Dr. B. Gopala Reddi)

ఉపాధ్యాయులు బాధ్యులా ? రాజకీయ పార్టీలనాయకులు బాధ్యులా ? ఈ విషయము లన్నీ మనం అందరం కూడా కూర్చొని (ఇది రాజకీయ పార్టీలయొక్క సమస్యకాదు) ఆలోచిస్తే బాగుంటుంది. ఇది అంత సంతోషకరమైన విషయం కాదు.

మన అసెంబ్లీలో Dr. Kuppu Swamy గారి పేరు చిరస్మరణీయంగా వుంది. ఈ కుప్పుస్వామి కమిటీ వారు 80 సిఫార్సులు చేశారు. వాటిల్లో 50 సిఫార్సులు మేము యిప్పటికి అమలు చేసినాము. కుప్పుస్వామి కమిటీవారు చేసిన సిఫార్సులలో 3 పెద్దవి వున్నాయి. (1) Text Books, (2) Enhancement of Salaries (3) Aided School managements కు సంబంధించినవి. ఈ మూడింటిని మేము అమలులో పెట్టలేదు. ఈ మూడుతప్ప మిగిలినవన్నీ అమలు చేశామని ఎవ్వరూ అనడంలేదు కాని text books విషయంలోనూ, aided Schools విషయంలోనూ, enhancements of Salaries విషయంలోనూ ఏమిచేశారని మాత్రం గట్టిగా అడుగుతున్నారు. Text books విషయంలో ఎంతో లాభం వస్తుందని కుప్పుస్వామి కమిటీవారు సూచించారు. ఆ లాభంతో teachers యొక్క జీతాలు పెంచవచ్చునని, అనికూడా సభ్యులు చెప్తున్నారు మేము వేసినటువంటి కమిటీలో గోవిందరాజులు నాయుడుగారు, M. R. Apparao గారు, అమ్మన్నరాజాగారు, నాళ్ల వెంకటేశ్వరరావుగారు పని చేశారు. వారు యిచ్చినటువంటి రిపోర్టులో ఏదో లాభం వస్తుందని చూపించలేదు. దీనిని ఒక private corporation గా పెట్టాలని, దానికి వాళ్ళు 10 లక్షల రూపాయలు ముందుగా యివ్వవలసిందనీ, మళ్ళీ దాట్లోనుంచి మీరు ఏమీ ఆశించ కూడదని వాళ్ళే ఒక press పెట్టుకొని independent గా statutory గా గవర్నమెంటు యొక్క interference లేకుండా ప్రత్యేకంగా పెట్టినప్పుడు ఏదైనాపని జరుగుతుందేమో కాని దానివల్ల ఎక్కువ లాభం వస్తుందనే financial aspect వాళ్ళు చూపలేదు. ఇప్పటినుంచి కొన్ని practices, లేకుండా పోతాయి. తరువాత కొన్ని మంచి text books బాగా print చేయించి Students కు చౌకగా యివ్వడానికి ఉపయోగపడుతుందని చెప్పారు. కాని financial గా ఏదో లాభంవస్తుంది, దాంతోటి teachers కి అందరికి జీతాలు ఎక్కువ చేయవచ్చును అని వారు ఎక్కడా చెప్పలేదు.

Sri PILLALAMARRI VENKATESWARLU :—ఆ కమిటీలో financial experts కూడా వున్నారా ?

The Hon. Dr. B. GOPALA REDDI :— గవర్నమెంటుకు నష్టం వచ్చేటటువంటి మాట ఏమీ వాళ్ళు చెప్పలేదు. మన మీద 30 లక్షలో 40 లక్షలో burden పెట్టే శిఫార్సు వాళ్ళు చేయలేదు. వారికి యిచ్చినటువంటి terms of reference లో ఒక text books విషయంలో మాత్రమే ఏమి చేస్తే బాగుంటుంది అని వాళ్ళను అడిగినాము. వారు యిచ్చినటువంటి రిపోర్టు కావాలంటే library లో పెడతాము అది మాకు confidential document కాదు.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— తిరువాన్కూర్ - కొచ్చిన్ రాష్ట్రంలో దానివల్ల ఆదాయం సంపాదిస్తున్నారా ?

[13th March 1956

The Hon. Dr B GOPALA REDDI —
తిరువాన్కూర్ - కొచ్చిన్ రాష్ట్రం విషయంలో కూడా నేను గోవిందమీనన్ గారితో మాట్లాడినాను. ఈ సంవత్సరం నలుగురు Gazetted Officers ను వాళ్ళు suspension లో పెట్టినారు తరువాత ఏమి జరిగిందో తెలియదు. వీలుంటే నేను ఒకసారి Travancore పోయి అంతా study చేద్దామనుకుంటున్నాను. ఇప్పుడు Education Minister గా వున్న గోవింద మీనన్ గారితో యీ text books విషయం చర్చించినాను దానివల్ల డబ్బు వచ్చినట్లయితే విద్యార్థులందరికీ కూడా పుస్తకాలు చౌకగా లభించేటట్లుగా చేయాలి. ఇంకా Pictorial illustrations కూడా students కి యివ్వాలి. పుస్తకాలను యింకా రమ్యంగా, ఆకర్షణీయంగా చేయాలి కాని దీనివల్ల లాభం సంపాదించడంకోసం గవర్నమెంటు దీనిని తీసుకొన్నది అనుకో కూడదు.

Sri PILLALAMARRI VENKATESWARLU .—ఇంకా ఎక్కువ బొమ్మలువేసి, ఎక్కువ ఆకర్షణీయంగా చేసినా దాంట్లో లాభం లేదంటారా?

The Hon Dr. B GOPALA REDDI .— బొమ్మలతో యింకా ఎక్కువ ఆకర్షణీయంగా వుండేలా చేయాలి. గవర్నమెంటు text books తీసుకొని యీనాడు బజారులో వున్న text books మాదిరిగా చేయడానికా! గవర్నమెంటు ఆ బాధ్యత తీసుకొన్నప్పుడు చౌకగా, పిల్లలకు యింకా ఎక్కువ ఆకర్షణీయంగా వుండాలి. గవర్నమెంటు తీసుకున్న తరువాత మాకు రమ్యమైనటువంటి బొమ్మలతో కూడుకొన్నటువంటి మంచి పుస్తకాలు వస్తున్నాయని ప్రతి పిల్లవాడు సంతోషించి నప్పుడే మంచిదికాని యిప్పుడు బజారులో వున్న పుస్తకాలమాదిరిగా చేయడమే మా ఉద్దేశ్యంకాదు. ఇప్పుడు text books అచ్చువేస్తున్న వాళ్ళు 150 మంది వున్నారు. మనంకూడా అలాచేస్తే 151 వ వాళ్ళము అవుతాము. కాబట్టి దానివల్ల ధనలాభం వస్తుందని ఆశించడం న్యాయంకాదు. కనుక దానికి యీ enhancement of salaries కి ముడిపెట్టితే ప్రయోజనం లేదు.

Sri PRAGADA KOTAIAH :— ఇప్పుడు ఆంధ్ర యూనివర్శిటీ వారు S.S.L.C. text books, Intermediate Non-detailed books అచ్చు వేస్తున్నారు. వాటిమీద నష్టం వస్తోందా? లాభం వస్తోందా? ప్రభుత్వం ఎప్పుడైనా పరిశీలించిందా?

The Hon. Dr. B. GOPALA REDDI .— ప్రభుత్వం పరిశీలన చేయడం లేదు. యూనివర్శిటీ విషయాలు కొన్ని నాకు తెలుసును. వాళ్ళకు కొంత లాభం వస్తుంది.

Sri PRAGADA KOTAIAH :— మంత్రులు పుస్తకాలు తమ కార్లలో వేసుకొని canvass చేసే పద్ధతి ఆపుచేస్తారా?

The Hon. Dr. B. GOPALA REDDI :— కొనంటే ఒక యిబ్బంది. లేదంటే ఒక యిబ్బంది. అంటే 'yes' అంటే ఒక యిబ్బంది; no అంటే ఒక యిబ్బంది అన్నట్లుగా వుంది. ఈ సంవత్సరం యీ text books విషయంలో కొంతవరకు

13th March 1956]  (Dr B Gopala Reddi)

పరిశీలన చేశాము. దాంట్లోవున్న లోపాలను తీర్చడానికి ప్రయత్నం చేశాము. తరువాత యీ రెండు, మూడు మాసాల్లో ఎక్కువగా mal-practices లేకుండా చేయడానికి ప్రయత్నిస్తున్నాము. corporation పెట్టి పుస్తకాలు publish చేయడంకంటె ఏమిచేస్తే బాగుంటుందో మనం అన్వేషించాలి.

Sri V VISWESWARA RAO .— కృష్ణా జిల్లాలో text books ను నిర్ణయించే విషయంలో వచ్చినటువంటి scandal గురించి ఏమైనా దర్యాప్తు చేశారా ?

The Hon. Dr. B GOPALA REDDI .— దర్యాప్తు చేశాము. దాన్ని గురించి ఏమి జరిగిందో కాని సెప్టెంబరు వరకు text books రాలేదనే విషయం తెలుసుకున్నాను. ఎటువంటి ప్రయత్నాలు చేస్తే యిటువంటి గందరగోళాలు లేకుండా వుంటాయో అని మేము ఆలోచిస్తాము. ఇప్పటికి కొన్ని orders issue చేశాము. ఇంకా కొన్ని orders issue చేయవలసి యున్నది. ఇటువంటి వన్నీ కూడా మనం చేస్తున్నాము. Gazette లో publish అయిన తరువాత కూడా late గా Text Book Committee వారు meet కావడం, తరువాత వాళ్ళు books approve కావడం జరుగుతోంది. ఈ calendar అంతా కూడా ముందుకు పెట్టితే కాని పని తొందరగా జరుగదు. ఆంధ్ర యూనివర్సిటీవారు 56 జూలైలో వాళ్ళు యే text books పెడుతున్నారో అవి 55 జూలైలో finalise చేస్తున్నారు. 11 మాసాలు ముందుగానే వారు యిస్తున్నారు. మనకు కావలసి ఉండేటటువంటి text books ను కూడా May, June లలో District Board Committees లేక Special Officers నిర్ణయం చేయడం, తరువాత print చెయడం ఇదంతా అయ్యేటప్పటికి ఆగస్టు, సెప్టెంబరు అవుతోంది. కాబట్టి పనులు ముందుగా జరుగునట్లు చేసినట్లయితే 10, 11 మాసాలు ముందుగానే అనగా 1957 జూలైలో ఫలాని class కి ఫలాన పుస్తకాలు పెట్ట బోతున్నారు అని 1956 లోనే తెలుస్తుంది. వీటిల్లో ఏమైనా లోపాలు వుంటే అవి కూడా సవరణ చేయడానికి ప్రయత్నం చేస్తున్నారు. కుప్పుస్వామి కమిటీ చేసిన report లో 3 పెద్ద విషయాలు మేము అమలుపరచలేదు. ఈ మూడు విషయాలలో తప్ప 50 సిఫార్సులు యిప్పటికి అమలులో పెట్టాము. మేము కుప్పుస్వామి కమిటీని అగౌరవ పరచడం కాని, తిరస్కరించడం కాని చెయలేదు.

Sri PILLALAMARRI VENKATESWARLU — ఆ కమిటీ వారి రిపోర్టు Members కు supply చేసి చర్చించే అవకాశం యిస్తారా ?

The Hon. Dr. B. GOPALA REDDI :—ఈనాడు హిందీ 2 periods లో మాత్రం చెప్తున్నారు. ఇది మొదటినుంచి నాకు సమ్మతంగా లేదు. హిందీ standard రావడానికి Ist form నుంచి 6th form వరకు 6 సంవత్సరములు చెప్ప వలసిన అవసరంలేదు. 1st form లో హిందీ, ఇంగ్లీషు రెండూ కూడా ఒకేసారి ప్రారంభించడం న్యాయంకాదు అనే ఉద్దేశ్యంతోనే నేను మొదటినుంచీ హిందీ ప్రచార సంఘం వాళ్ళతో దెబ్బలాడుతూ వస్తున్నాను. వాళ్ళు 3 periods కావాలి, 4 periods కావాలి అని చెప్పినప్పటికీ కూడా మీరు 6 సంవత్సరాలు తగ్గించుకుంటే నే

కాని ఇవ్వడానికి వీలులేదని నిష్కర్షగా చెప్పవలసి వచ్చింది. వారు 6 సంవత్సరాలు వుంచాలి, 3, 4 periods వుంచాలి అని పట్టుపడుతూ వచ్చారు. ఇప్పుడు వాళ్ళుకూడా కొంత compromise అవుతున్నారు. ఇప్పుడు బ్రహ్మయ్యగారు చెప్పినట్లుగా III Formకు 3 periods IV Form కి 4 periods వుంటాయి. అలాచేస్తే మొత్తం 12 periods అవుతుంది.

III Form నుంచి School Final వరకు హిందీ మూడు periods పెట్టవలెనా, లేక IV నుంచి School Final వరకు 4 periods పెట్టవలెనా అనేది కూడ మనము ఆలోచించుకొని త్వరలోనే ఒక నిర్ణయానికి వచ్చి ఏదో ఒకటి చేసుకోవడం ఉచితమని అనుకొంటాను. ఈ విషయములో ప్రభుత్వము తప్పకుండా చర్య తీసుకొంటుంది.

తరువాత Sanskrit విషయంలో, ఈ సంవత్సరం క్రొత్తగా 11 High Schools లో Sanskrit పెడుతున్నాము. ప్రస్తుతము 3 Girls High Schools లో మాత్రం ఇది చెప్పబడుతున్నది. అటువంటిది ఇంక 6 Girls High Schools లో ఇక మీదట చెప్పబడుతుంది. అదేవిధంగా ఇప్పుడు 83 Boys High Schools లో Sanskrit చెప్పబడుతుండగా ఇంకొక 5 Boys High Schools లో పెట్టడానికి ప్రభుత్వము ఉత్తరువులు జారీ చేస్తున్నారు. మొత్తం 11 High Sehools లో క్రొత్తగా Sanskrit పెడుతున్నారన్నమాట. ఈవిధంగా చేయడంలో Sanskrit panditsకు కొంత employment opportunities ఉంటాయని అప్పుడు ఎక్కువమంది Sanskrit చదువుకోడానికి వీలుంటుందనేది కూడ ఒక అభిప్రాయము. Sanskrit ను ఈ విధంగా ప్రోత్సహించడంలో అంటె Sanskrit లో అందరు గొప్ప పాండిత్యం సంపాదించే మీమాంస మొదలగునవి చదువుకోవాలని కాదు. Sanskrit చదువుకోవడం వల్ల తెలుగుకు ఒక పటుత్వం వస్తుందని తెలుగులో మంచి ఉపాధ్యాయులు, scholars కావడానికి వీలుంటుందని, మనము ఒకవేళ దీనిని నిర్బంధం చేయకపోయినప్పటికి కూడ ఇది దేశంలో వ్యాప్తి అయి ఎక్కువమంది Sanskrit చదువుకొన్నవాళ్ళు తెలుగు పండితులుగా వచ్చినప్పుడు, వాళ్ళకు ఒక రకమైన background, foundation ఉంటుందనే ఉద్దేశంతో పెట్టామే గాని ఇది కేవలం Sanskrit కోసం పెట్టడంకాదు. అందువల్ల దీనిమూలకంగా తెలుగుకు ఏదో అపాయం వస్తుందనేది ఏమీలేదు. Sanskrit కు ఒక బలము వస్తుందని ఆ బలమును తెలుగుకు వినియోగించబడుతుందనే ఉద్దేశంతో Sanskrit పెడుతున్నామేగాని మరేమీకాదు.

ఈ age rules విషయం గురించి జియ్యర్ దాస్‌గారు పట్టాభిరామారావుగారు చెప్పారు ఈ విషయం వెంకటేశ్వర్లుగారు కూడా చెప్పారు. ఆంథోనిరెడ్డిగారు private admission ను first form కే restrict చేయవలసిందని చెప్పుతూ ఈ age restriction ను సమర్థించారు ఏమైనా ఈ విషయం మీరు కొంచెం నిదానంగా యోచించవలసియున్నదని నేను కోరుతున్నాను. నాకు ఈ విధంగా private admissions లో age restriction ఉండవలెననే అభిప్రాయము 4, 5 ఏళ్ళుగా ఉంటూ వచ్చినది. కాని ఇప్పుడది కేవలం నా అభిప్రాయం కాదు. University చేసినటువంటి నిర్ణయాలకు అనుకూలంగా మేము ఇక్కడ High Schools లో

13th March 1956] (Sri Dr. B. Gopala Reddi)

చేస్తున్నాము. మద్రాసు యూనివర్శిటీలో మొదటినుంచి కూడ ఒక age restriction ఉన్నది. Intermediate కు రావడానికి 14, 15 సంవత్సరములు వయస్సుఉండి తీరవలెననే విధంగా ఉండినది కాని ఆంధ్రాయూనివర్శిటీలో మాత్రము అటువంటి restriction లేకుండా ఉండినది. దానివల్ల ఆంధ్రదేశానికి ఉపద్రవము జరిగిందని నా యొక్క పూర్తి విశ్వాసము. ఎక్కడో ఏదో 3, 4 గురు మేధావులు ఉంటే ఉండ వచ్చు, కాని మొత్తం మీద average గా చూచినప్పుడు దీనివల్ల దేశానికి చాలా నష్టము సంభవించిందని చెప్పక తప్పదు. పది సంవత్సరములవయస్సు కంతా School Final కు పోయి దేశానికి గాని సంఘానికి గాని, కులానికి గాని లేక తల్లి తండ్రులకు గాని ఏమి ఉపకారము చేయగలుగుతారో నాకు తెలియకుండా ఉన్నది! అది ఆ పిల్ల వాడికి కష్టము, దేశానికి నష్టము కలుగజేస్తుంది. ఉపాధ్యాయులకు కూడా class లో discipline పెట్టుకోడానికి వీలుండదు ఒకే class లోనే ఒకడు 10 ఏళ్ళకుర్రవాడు ఒకడు 18 ఏళ్లకుర్రవాడు, ఒకడు 15 ఏళ్ళ కుర్రవాడు, ఇంకొకడు 12 ఏళ్ళకుర్రవాడు, ఈ విధంగా ఉంటే ఆ class లో discipline ఏ విధంగా ఉండగలదు ? 10 ఏళ్ళ కుర్రవాడి ప్రక్కన 18 ఏళ్ళ కుర్రవాడు కూర్చొంటే ఏ విధంగా ఉంటుంది! సరియైనటువంటి వయస్సులో సరియైన class లో ఉండి పాఠాలు అభ్యసించడం మంచిదని నా ఉద్దేశం వ్యక్తిగతంగా ఇదివరకే ఉండినది, కాని ఈనాడు Inter-University Board వాళ్ళు ఈ విషయాన్నే ఆలోచించి చేస్తున్నారు. England లో 17 సంవత్సరములు దాటితేనే గాని University లో చేర్చుకోరని తెలుస్తున్నది. London లోను Oxford లోను Cambridge లో కూడా ఇదే విధముగా ఉన్నది. వాళ్ళు ఇదంతా ఆలోచించకుండా ఏమీ చేయలేదు. వాళ్ళకు తెలుసును ఈ విధంగా ఎవరో ఒకడు అల్లాడి క్రిష్ణస్వామి అయ్యరుగారి మాదిరి మేధావులు ఉంటారని అయినప్పటికీ కూడా సర్వసాధారణంగా జరిగే పరిస్థితులు ఆలోచించే చేశారు. సరియైనటువంటి వయస్సులో మనస్సు పరిపక్వమైన తరువాత సరియైన clases లో చేరి 16 ఏళ్ళకు School Final కున్నూ 20 ఏళ్ళకు B A కున్నూ వస్తే బాగుంటుందని అందరూకూడ దీన్ని పరిశీలించి, విచారించి, ఈవిధం I Formలోకి వచ్చేటప్పటికి 10 సంవత్సరము లుండవలెనని నిర్ణయం చేశారు. జియ్యరుదాస్ చెప్పినట్లుగా శంకరాచార్యులు మాదిరి ఎవరో ఒకడు వుంటాడు. ఆ శంకరాచార్లు పేరు పెట్టుకొని చిన్న చిన్న పిల్లవాళ్ళను 10 సంవత్సరముల వాళ్ళను School Final లోకి చేర్చుకోవడం అన్యాయమని నా సంపూర్ణ మైనటువంటి విశ్వాసము. ఎవరో ఒక రిద్దరు పెద్ద ప్రతిభావంతులుంటే వారికి కావలసివస్తే ఏదైనా ప్రత్యేకంగా చేసుకోవచ్చును. ఇప్పుడు మామూలుగా చిన్న classes లో వుండవలసిన వాళ్ళందరు పెద్ద పెద్ద classes లోకి పోవడానికి తల్లిదండ్రులు ప్రోత్స హిస్తున్నారు. ఈనాడు పల్లెటూళ్ళలో ఏమి జరుగుచున్నదో నాకు తెలుసును. చాలా మంది తల్లిదండ్రులు తమ పిల్లవాండ్లను I Form నకు కూడ తగని పిల్లవాండ్లను III Form లో చేర్చుకొమ్మని Headmaster ను వొత్తిడి చేస్తూఉంటారు. ఈ వొత్తిడికి తట్టుకో లేకుండా ఆ Headmaster వీళ్ళను చేర్చు కోవడం జరుగు తున్నది. ఈవిధంగా Headmaster మీద వొత్తిడి తగ్గించడానికి కూడ ఈ విధమైన restriction చేస్తే బాగుంటుందని కూడా ఆలోచించాము,

ఇప్పుడు ఇది నేను స్వయంగా చేసింది కాదు మన Education Advisory Board వారు ఆలోచించి నిర్ణయించినటువంటిది. ఈ Board లో Vice-Chancellor, Director, ఇంకా Headmasters వీరందరు ఉన్నారు. 15 సంవత్సరములకు పైగా ఉంటేనే గాని university classes లో చేర్చుకోకూడదు అని Inter-University Board వాళ్లు చెప్పినదాన్నే Andhra University వాళ్లుకూడ ఒప్పుకొంటున్నారు. ఆంధ్ర యూనివర్సిటీవాళ్ళు చేసేదానికి అనుగుణంగానే మేము ఇది చేశాము. చాలా కాలం వరకు ఆంధ్రయూనివర్సిటీవాళ్లు ఈ విషయంలో ఒప్పుకోలేదు, నాకు తెలుసు. క్రిష్ణారావు కూడ నా అభిప్రాయముతో ఏకీభవించలేదు. కాని ఈనాడు Inter University Board చెప్పింది కొట్టి ఆంధ్ర యూనివర్సిటీవారు చేయవలసి వచ్చింది. దానికి అనుగుణంగానే ఈనాడు 10 సంవత్సరములకు పైబడి ఉంటేనే గాని I Form లో చేర్చుకొనకూడదని ప్రభుత్వము ఉత్తరువు చేస్తున్నారు.

Sri VAVILALA GOPALAKRISHNAYYA — Higher Elementary Schools లో 6th, 7th 8th, Standards చదివినవారి విషయం చెప్పుతారా ?

The Hon Dr B GOPALA REDDI —ఇది private candidates కు సంబంధించినటువంటిది మాత్రమే. ఇప్పుడు private condidates ను III Form లో చేర్పించుకోవచ్చు. కాని వచ్చే జూలై నుంచి II Form లోనే చేర్పించుకోవలసిందని, ఆ పై సంవత్సరం నుంచి I Form లోనే చేర్పించుకోవలసిందని ఉత్తరువులు చేస్తున్నాము. మేము ఇళ్ళలోనే private tuition పెట్టించుకొని చదువుకొంటామంటె మహారాజుగా ఇంట్లోనే కూర్చొని చదువుకోవచ్చు. గొప్ప Knowledge సంపాదించుకోవచ్చు. మా అభ్యంతరమేమి లేదు. కాని Schools కు రావాలను కొన్నప్పుడు మాత్రము, దానికి మొదటినుంచి ఒక శిక్షణ కావాలి. I Form, II Form, III Form అని ఈ విధంగా క్రమేణ కొన్ని సోపానాలు ఎక్కాలిగాని నేను short cut లో వస్తానంటె వీలులేదని చెప్పుతున్నాను. Elementary school లో మూడు సంవత్సరాలు చదివితే చాలును. అతన్ని I Form లో చేర్పించుకోవచ్చును. మళ్ళీ examination లేకుండా కనుక ఇది విద్యావేత్తలందరు, కుప్పుస్వామికన్నా పెద్ద పండితులు ఆలోచించి చేస్తున్నటువంటి విషయమే గాని ఏదో తాత్కాలికంగా చేస్తున్నటువంటిది కాదు. దేశంలో అన్ని యూనివర్సిటీలు అవలంబిస్తున్నటువంటి పద్ధతి ఇది.

Sri V. KURMAYYA — Higher Elementary Schools లో V, VI, VII Standards చదివినవారు ఏమవుతారో తెలియజేస్తారా ?

The Hon Dr. B GOPALA REDDI :— సాధ్యమైనంతవరకు ఈ రెండింటికీ inter-link చేసి సరిపైనటువంటి class లో చేర్పించుకొనేటట్లు చేస్తాము. లేకపోతే, ఆ Headmaster కు discretion ఇచ్చి ఆయన ఒక పరీక్ష పెట్టి ఏ class కు fit అవుతాడని అనుకుంటాడో ఆ class లో చేర్పించుకోవచ్చు.

Sri S. BRAHMAYYA — Fifth Standard ఇంగ్లీషులో pass అయినటువంటివారు III Form లో చేరడానికి అవకాశము కల్పించాలి.

13th March 1956]

The Hon. Dr. B. GOPALA REDDI :— అటువంటివాళ్ళకు ఏమీ ఇబ్బంది ఉండదు. School లో అంటె ఏ High School లో గాని, Higher elementary school లో గాని, లేక Elementary school లో గాని చదివే వాళ్ళకు ఏలాటి ఇబ్బంది ఉండదు. ఇకంతా private గా చదువుకొని, school లో చేరాలనుకొన్న వాళ్ళకే వర్తిస్తుంది ఈవిషయంలో Anthony Reddi గారు ధైర్యంగా చెప్పారు. ఇదిగో మీకు కొత్తది రాబోతున్నది. కాని దీంట్లో మీరు ధైర్యంగా నిలబడాలి. ఈ private admissions I Form నకే restrict చేయాలని, August 15th కు వారికి ఆ వయస్సు వచ్చేటట్లయితే, అనగా July 1st కు 10½ మాసాలు అన్నమాట, వారిని ఆ సంవత్సరం I Form లో చేర్చుకొంటే మంచిదని వారు చెప్పారు. ఇది న్యాయమైన విషయము. దీంట్లో ఎవరి కేమి అపకారము జరుగదు. దేశానికేమి ఉపద్రవము రాదు. లేకపోతే, పదేళ్ళ కుర్రవాడు B A pass అయినాడంటే అతను ఏమి మేలు చేయగలుగుతాడో నాకేమి అర్థం కావడంలేదు. అతనివల్ల దేశానికి వచ్చే లాభమేమి లేదని అనుకుంటాను.

తరువాత వేమయ్యగారు aided schools లో ఉన్నవారికి సరిగా జీతాలురావు, అదిరాదు, ఇదిరాదు, చాలా గంద్రగోళాలు జరుగుతున్నాయని చెప్పారు. ఇదేదో పెద్ద సంక్లిష్టంగా ఉంటున్నది తాకితే మనమీద పడుతుందేమో అని భయముగా కూడ ఉంటుంది. ఏమైనప్పటికి, ఇవన్నీకూడ మనము సవరించుకోవాలి. Teachers కు సరియైనటువంటి సదుపాయాలుకూడ మనముకలుగజేసి వాళ్ళచేత విద్యార్థులందరికి సరియైనటువంటి విద్యాపోషణ గరిపించాలి.

ఇంక ఈ text books విషయంలో తప్పకుండా ఏదో చర్చ తీసుకొంటామని కూడ నేను చెప్పాను. తరువాత ఈ N. C C, scouting వగైరాల విషయంలో ఎక్కువమందికి శిక్షణ ఇవ్వాలని, girls schools లో కూడ అందరు ఈ శిక్షణ పొందాలని ఈ విషయాలు గురించి ఎవరైనా మాట్లాడుతారేమోనని, సలహో లేమైన ఇస్తారేమోనని చూచాను కాని ఎవరు ఏమి మాట్లాడలేదు.

A. C. Subba Reddi గారు Chamber of Municipal Councils యొక్క Chairman గా ఉండి యీవిషయములో కొంతవరకు ఉదారతచూపించినందుకు చాలా సంతోషముగా ఉన్నది. వారియొక్క పలుకుబడిని ఉపయోగించి Chamber వారు Toll Compensation క్రింద ప్రభుత్వము మునిసిపాలటీలకు యిచ్చే ఏడు లక్షల రూపాయలను వదులుకునేటట్లు యింకా entertainment tax మీద వచ్చే ఆదాయములోనుంచి ప్రభుత్వానికి యిచ్చే 10% కు బదులు 20% యిచ్చి మిగతా 80% మాత్రమే మునిసిపాలటీలు తీసుకునేటట్లు చేయవలసిందిగా నేను వారిని కోరాను.

Sri A C. SUBBA REDDI.— Toll compensation ను గురించి మాత్రము నేను ఒప్పిస్తాను గాని, తక్కినవాటి విషయము ఒప్పండి అంటే, మునిసిపాలటీలకు deficit ఏర్పడితే, ఆ deficit ఎంత అవుతుందో, అది అంతా ప్రభుత్వమే యివ్వవలసి వస్తుందేమోనని అనుకుంటాను.

The Hon Dr B. GOPALA REDDI:— ఇప్పుడు ఆ మొత్తము కేటాయించి నందువల్ల యీ మొత్తము నాలుగులక్షలు అయింది.

Sri PILLALAMARRI VENKATESWARLU:— 7 లక్షలు మునిసిపాలిటీవారు భరించుకోవటానికి ఒప్పుకుంటున్నప్పుడు, ప్రభుత్వమువారు నాలుగు లక్షలకు ఒప్పుకోకూడదా ?

The Hon Dr. B GOPALA REDDI —దీనికి ఎప్పుడైతే మునిసిపాలిటీవారు తమయొక్క అంగీకారమును తెలియజేస్తారో అప్పుడు తప్పకుండా ప్రభుత్వము III Form వరకు ఫీజు లేకుండా 1956 వ॥ జూలై నెలనుంచే ప్రారంభించవచ్చు. కాని అప్పటికి మునిసిపల్ బడ్జెటులు గూడ తయారైపోయి ఉంటవి కాబట్టి, యీ జూలై నుంచి ఫీజు తీసివేసినా సరేనంటారు. కాని వచ్చే సంవత్సరము నుంచి ఒప్పుకుంటామని మునిసిపాలిటీలు చెబితే, తప్పకుండ దానికి ఏర్పాట్లు చేసుకోవచ్చును. దానికి దీనికి కొంత సంబంధము ఉన్నదని మేము మొదటినుంచి చెప్పతూనే వచ్చాము కాబట్టి మునిసిపాలిటీలు ఎప్పుడైతే, అందుకు మాకేమి ఆక్షేపణలేదు, దానికి మేము అంగీకరిస్తున్నామని చెబుతారో, అప్పటినుంచి ఏర్పాటు చేయవచ్చు. వీలుగావుంటే వెంటనే చెబితే కూడ, యీ 1956 జులైనుంచే ప్రారంభించటానికి ప్రభుత్వం తప్పకుండా ప్రయత్నిస్తుంది. కాని మేము అంగీకరించామని చేంబరువారు చెబితే చాలదు. మునిసిపాలిటీల individual అంగీకారము కావాలి అంటున్నారు. కాబట్టి ఆ విధంగా చేస్తే, అందరికీ సంతోషమే. పిల్లలకుగూడ చదువు ఎక్కువగా రావటానికి అవకాశాలు ఉంటాయి. ఇంకను వెనుకబడిన ప్రాంతాలలోని వారి బిడ్డలు అందరికి చదువుకోవ డానికి చాలా అవకాశము ఉంటుంది. III Form వరకు మేము జీతము లేకుండా చదువుకోగలుగుతున్నాము అనేమాట ప్రజలనుంచి వస్తే, యిది నిజముగా ప్రజలలో ఒక నూతనమైన ఉత్సాహాన్ని కలుగజేసినట్లే అవుతుంది. ఒకవేళ పన్నులు ఎక్కువగా వేసినను, ప్రజలు పన్నులు కట్టటానికి వెనుకంజ వేయరు. వాళ్ళు ఏమైన చెప్పేటట్లుగా ఉంటే, మీ పిల్లలకు ప్రభుత్వం జీతము లేకుండా ఉచితముగా చదువుచెప్పడము లేదా అని ప్రభుత్వమే కాదు, యింకా ఎవరైనాగూడ, అవిఘ్నంగా చెప్పేవారికి చెప్పవచ్చు. ప్రభుత్వం యింతవరకు ప్రజలకు సహాయము చేస్తున్నది కాబట్టి, యింకా పన్నులు ఎక్కువగా వేసినాగూడ, అవి భరించటానికి, యివ్వటానికి కూడ ఉత్సాహవంతులు అవుతారు. ప్రజలకు ఏవిధమైన సౌకర్యాలు, సహాయము చేయకుండా పన్నులు ఎక్కువ చేశాము, యివ్వండి అంటే, అది కొంతవరకు psychological గా కూడా బాగా ఉండదేమోనని నా ఉద్దేశ్యము. అందువల్ల మనము యీ education విషయములో అంతా రాజకీయంగా చేయాలంటే, తిరువాన్కూరులో, మద్రాసులో చేశారు కాబట్టి మనము కూడ యిది అనివార్యముగా చెయవలసిన విషయముగా ఉన్నట్లున్నది. ఇదే ప్లానింగు కమిషనువారు గూడ కోరుతున్నారు. కాబట్టి యీ Education విషయములో అన్ని విధములుగా ప్రయత్నము చేస్తామని చెబుతున్నారు. ఈ Education Demand మీద వెంకటేశ్వర్లుగారు, ఇంకా యితరులు ప్రభుత్వము నాటకాలకి ఏమి చేసింది, అని అడుగుతారని అనుకున్నాను కాని వారు యింతవరకు వాటినిగురించి యేమీ అడగలేదు. ఇంకా యీ దేశములో సంగీతానికి ప్రభుత్వము చేయవలసినవి ఎన్నో ఉన్నవి. (Laughter) నాట్యకళకు ఏమి చేస్తున్నారు? యీ సంగీతనాటకానికి academy ఎందుకు పెట్టలేదు? సాహిత్యానికి గూడ academy ఎందుకు పెట్టలేదు? అనేటటువంటి పెద్ద పెద్ద విషయాలు నన్ను అడుగుతారని అనుకున్నాను. కాని అవేమి అడగలేదు.

13th March 1956]

Sri PILLALAMARRI VENKATESWARLU — ఇప్పుడు అడిగిన వన్నీ చేస్తే చాలు.

The Hon Dr. B GOPALA REDDI — మేము ఏమిఅయితే చేయలేమో, అవే చేయమని మమ్ములను అడుగుతారు. మేము చేయగలిగినవి కొన్ని మాత్రమే ఉన్నవి. మేము చేయగలిగినవాటిని మీరు మమ్ములను ప్రోత్సాహించరు. ఏమిచేసేది ? కాబట్టి యింకా పెద్ద పెద్ద విషయాలు ఎన్నో ఉన్నవి. అవి అన్నీ మనము చేయవలసియున్నది. విద్యార్థులందరూ కూడ క్రమశిక్షణపైన దేశానికి ఉపయోగపడే విధముగా తయారవుతారని నేను ఆశిస్తున్నాను.

Sri P SUNDARAYYA .— Sports విషయము ఏమి చేశారు ?

The Hon Dr B. GOPALA REDDI — Sports విషయములో యీ సంవత్సరానికే మట్టుకు చేసినవి కొన్ని ఉన్నవి. వాటికి లెక్కలుగూడ ఉన్నవి. ఏదో Hockey Association అని, Cricket Association అని యిటువంటి వాటికి అన్నింటికి అడిగినవాటికి యిస్తూవచ్చాము. వాటి నన్నింటెని ప్రోత్సహించటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తున్నది. ఇంకా యీ Physical Training College విషయాన్ని గురించి విశ్వేశ్వరరావుగారు చెప్పారు. కాని ఆవిషయము నేనుమరచిపోలేదు. ఆకాలేజిని ప్రభుత్వము తిసుకోవడమో, లేక ఇప్పుడు ఉన్నవారిచేతనే మేనేజిమెంటు చేయించి, దానికి కావలసిన grants వగైరాలు ఎక్కువగా యిస్తేబాగుంటుందని అన్నారు. అందుకు వారు ఒప్పుకున్నారు. మీరు నాకు చెప్పింది యేమిటంటే, యీ కాలేజీని ప్రభుత్వము తీసుకోండి లేకపోతే మాకు యీ కాలేజీకి అయ్యేఖర్చు అంతా ప్రభుత్వము భరిస్తూ, grants కూడ ఎక్కువగ యివ్వండి అని చెప్పారు. ఇంకా మొన్న ఆ కమిటీవారు వచ్చినపుడు మేము grants ఎక్కువగానే యివ్వటానికి ప్రయత్నము చేస్తాము, కాని ఆ కాలేజీని మీరే run చేస్తే కొంతవరకు economical గా గూడ ఉంటుందని అన్నాము. అట్లా కాకుండా ప్రభుత్వమే takeup చేసి manage చేసేటట్లయితే, ఇంకా లక్షలకొద్ది estimates వస్తాయి, అప్పుడు ప్రభుత్వానికి అనుకున్నదానికన్న ఎక్కువగా ఖర్చు చెయవలసివస్తుందని అభిప్రాయము వచ్చింది. ఇంకా ఆంధ్రదేశములో వుండేది యీ ఒక్క కళాశాలయే కాబట్టి, దానికి తగిన ప్రోత్సాహము యివ్వవలసియున్నది. కాబట్టి దానికిగాను ఉండే పెద్ద పెద్ద ఆశలు అన్నీ జరుగుతునే ఉన్నవి, జరగబోతున్నవి కూడ. అందువల్ల యీ డిమాండుమీద యిచ్చిన Cut-motions అన్నికూడా withdraw చేసుకోవలసిందిగా సభ్యులను కోరుతున్నాను.

Sri PRAGADA KOTAIAH.—1956-57 సంవత్సరములో Handloom Institute పెట్టుతున్నారని చాలాసార్లు Industries Minister గారు యీ House లో చెప్పారు. మరల దాని ప్రసక్తేరాలేదు. దాని విషయము ఏమి అయింది?

The Hon. Dr. B. GOPALA REDDI — అది యీ Education Demand లో రాదు. అది అంతాకూడ Industries పద్దుమీద వస్తుంది. Poly-

